భర్తృహరి.

భర్తృహరి సుభాషితము

చెన్నపురి 1923.

Record no. 169

Bhartṛhari.

Bhartrhari Subhāṣitamu

Cennapuri, 1923.

Record no. 169

## Bibliographic Record Target

భర్తృహరి.

భర్తృహరి సుభాషితము: ఆంధ్రపద్య తాత్పర్య సహితము / భర్తృహరి.- చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1923.

136 p. ;20 cm.

Record no. 169

Bhartṛhari.

Bhartṛhari Subhāṣitamu : Āṃdhrapadya tātparya sahitamu / Bhartṛhari.- Cennapuri : Vāviḷla Rāmasvāmiśāstrulu aṃḍ Sans, 1923.

136 p. ;20 cm.

Record no. 169

శ్రీ ర స్తు.

# భర్తృహరిసుభాషితము.

ఆంధ్రపద్యతాత్పర్యసహితము.



చె న్న పు రి :

వావిళ్ల. రామస్వామిశాస్త్రులుఅండ్ సన్సు వారిచేఁ

ప్ర క టి త ము.

1923.

Printed by
V. RAMASWAMY SASTRULU & SONS
at the "VAVILLA" PRESS,
Madras.—1923.



శ్రీరస్తు.

# భర్తృహరిసుభాషితము

## నీతిశతకము.

---

శ్లో. దిక్కాలాద్యనవచ్ఛిన్నానన్తచిన్మాత్రమూర్తయే,
స్వానుభూత్యేకమానాయ నమః శాన్తాయ తేజసే.

క. అచ్ఛము దిక్కాలాద్యన
వచ్ఛిన్నానంతచిద్వి♦భవఘనంబు నిజ
స్వచ్ఛానుభూతిమానము
సచ్ఛాంతము తేజమే న♦జస్రముఁ దలఁతున్.

తా. దేశకాలపరిమితిలేక జ్ఞానమాత్రస్వరూపమై అనుభవముచేతనే ఎఱుంగఁదగినదై శాంతమయిన జ్యోతిస్స్వరూపమగు పరబ్రహ్మకు నమస్కారము.

### మూర్ఖపద్ధతి.

శ్లో. బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః,
అబోధోపహతాశ్చాన్యే జీర్ణమఙ్గే సుభాషితమ్. 2

తే. బోద్ధ లగువారు మత్సర♦పూర్ణమతులు
ప్రబలగర్వవిదూషితుల్ ♦ ప్రభువు లెన్న
నితరమనుజు లబోధోప♦హతులు గాన
భావమున జీర్ణ మయ్యె సు♦భాషితంబు.

తెలిసినవారలు అసూయతోనున్నారు. ప్రభువులు గర్వాంధులు. సామాన్యులకు వినునంతటి తెలివిలేదు. కావున నేను చెప్పఁదలఁచినసుభాషితము నాయందే అణఁగి పోయినది.

శ్లో. అజ్ఞః సుఖ మారాధ్య స్సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః,
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి. 3

క. తెలియనిమనుజుని సుఖముగఁ
దెలుపం దగు సుఖతరముగఁ ♦ దెలుపఁగ వచ్చున్
దెలిసినవానిం దెలిసియుఁ
దెలియనినరుఁ దెల్ప బ్రహ్మ ♦ దేవుని వశమే.

తెలియనివానికి సులభముగఁ దెలియఁజేయవచ్చును. చక్కఁగఁ దెలిసినవానికి సమాధానముచెప్పుట మఱింతసులభము స్వల్పజ్ఞానము గలిగి సర్వజ్ఞుఁడనని గర్వించు వానిని సృష్టికర్తయగు బ్రహ్మయు రంజింపఁజేయ నేరఁడు.

శ్లో. ప్రసహ్య మణి ముద్ధరే న్మకరవక్త్రదంష్ట్రాన్తరా
త్సముద్ర మపి సంతరే త్ప్రచలదూర్మిమాలాకులమ్,
భుజఙ్గ మపి కోపితం శిరసి పుష్పవ ద్ధారయే
న్నతు ప్రతినివిష్టమూర్ఖజనచిత్త మారాధయేత్. 4

చ. మకరముఖాంతరస్థ మగు ♦ మానికముం బెకలింప వచ్చుఁ బా
యక చలదూర్మికానికర ♦ మైనమహోదధి దాఁటవచ్చు మ
స్తకమున బూవుదండవలె ♦ సర్పము నైన భరింపవచ్చు మ
చ్చిక ఘటియించి మూర్ఖజన ♦ చిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్.

మొసలినోటిలోని కోఱలనడుమనుండు రత్నమునైనను ప్రయత్నించి బయటికిఁ దీయవచ్చును. పెద్దయలలుగల సముద్రమునైనను దాఁటవచ్చును. కోపముచేత బుస వెట్టు పామునైనను పూదండవలె శిరమునఁ దాల్చవచ్చును కాని దురాగ్రహముచేత మూర్ఖుఁడయినవాని మనమును సమాధానపెట్టుటకు సాధ్యముకాదు.

శ్లో. లభేత సికతాసు తైల మపి యత్నతః పీడయ
న్పిబేచ్చ మృగతృష్ణికాసు సలిలం పిపాసార్దితః,
కదాచి దపి పర్యటన్ శశవిషాణ మాసాదయే
న్నతు ప్రతినివిష్టమూర్ఖజనచిత్త మారాధయేత్. 5

తే. తివిరి యిసుమునఁ దైలంబు ♦ దీయ వచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ♦ ద్రావ వచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సా ♦ధింప వచ్చుఁ
జేరి మూర్ఖులమనసు రం ♦ జింపరాదు.



సముద్రమునకును, అచటినుండి పాతాళమునకువచ్చెను. గొప్పస్థితినుండి తొలఁగినవారి కిదేవిధంబుగ బలువిధంబు లగుపాట్లు సంభవించును.

శ్లో. శక్యో వారయితుం జలేన హుతభు క్ఛత్రేణ సూర్యాతపో
నాగేన్ద్రో నిశితాఙ్కుశేన సమదో దణ్డేన గో గర్దభః,
వ్యాధి ర్భేషజసఙ్గ్రహై శ్చ వివిధై ర్మన్త్రైః ప్రయోగై ర్విషం
సర్వ స్యౌషధ మస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధమ్.

చ. జలముల నగ్ని ఛత్రమునఁ ♦ జండమయూఖుని దండతాడనం
బొల వృషగార్దభంబులును ♦ బొల్పగునుత్తకరీంద్రముం సృణిన్
జెలఁగెడురోగ మౌషధము ♦ చే విషముం దగుమంత్రయుక్తిని
మ్ములఁ దగఁ జక్కఁ జేయ నగు ♦ మూర్ఖునిమూర్ఖత మాన్పవచ్చునే.

అగ్నికి జలంబును, ఎండకు గొడుగును, మదగజంబునకు అంకుశంబును, ఎద్దు, గాడిద మొదలగుజంతువులకుఁ గఱ్ఱయు, రోగంబునకు వివిధంబులగు మందులును, సర్పవిషంబునకుఁ బలువిధంబులగు మంత్రంబులును శాస్త్రములందు నివారకములుగ చెప్పఁబడియున్నవి. కాని మూర్ఖునిమూర్ఖత్వమును పోఁగొట్టునట్టియౌషధ మేశాస్త్రమునందును చెప్పఁబడలేదు.

## విద్వత్పద్ధతి.

శ్లో. శాస్త్రోపస్కృతశబ్దసున్దరగిరః శిష్యప్రదేయాగమా
విఖ్యాతాః కవయో వసన్తి విషయే యస్య ప్రభో ర్నిర్ధనాః,
త జ్జాడ్యం వసుధాధిపస్య సుధియ స్త్వర్థం వినా పీశ్వరాః
కుత్స్యాః స్యుః కుపరీక్షకై ర్న మణయో యై రర్ఘతః పాతితాః.

చ. సకలకలావిభూషితులు ♦ శబ్దవిదుల్ నయతత్త్వబోధకుల్
ప్రకటకవీంద్రు లేనృపతి ♦ పజ్జను నిర్ధనులై చరింతు రా
వికృతపుజాడ్య మాదొరది ♦ విత్తము లేకయు వారు పూజ్యు లం
ధకజనదూషితంబులు ఘ ♦ నంబులు గావె యమూల్యరత్నముల్

వ్యాకరణాదిశాస్త్రపఠనముచేత నిర్దుష్టముగను మనోహరంబుగను పలుకుచు విద్యార్థులకు శాస్త్రంబులు బోధించుచు సుప్రసిద్ధు లయినపండితులు యేప్రభువు నొద్దనైనను ధనవిహీను లయియుండిరేని అది ఆప్రభువుయొక్క తెలివితేనిమనే తెలుపును. రత్నపరిజ్ఞానము లేనివారికుఁ డమూల్యమణులను తక్కువవెలగలవానినిగా చెప్పి నంతమాత్రముచేతనే ఆరత్నములకు లోపము రాదుగదా.

శ్లో. హర్తుర్యాతి న గోచరం కిమపి శం పుష్ణాతి యత్సర్వదా౽
ప్యర్థిభ్యః ప్రతిపాద్యమాన మనిశం ప్రాప్నోతి వృద్ధిం పరామ్,
కల్పాన్తేష్వపి న ప్రయాతి నిధనం విద్యాఖ్య మన్తర్ధనం
యేషాం తాన్ప్రతిమాన ముజ్ఝత నృపాః కస్తైః సహ స్పర్ధతే.

ఉ. హర్తకుఁ గాదు గోచర మ♦హర్నిశమున్ సుఖపుష్టిఁ జేయు స
త్కీర్తి ఘటించు విద్య యను♦దివ్యధనం బఖిలార్థికోటికిం
బూర్తిగ నిచ్చినన్ బెరుఁగుఁ ♦ బోదు యుగాంతపువేళనైన భూ
భర్తలు తద్ధనాధికుల♦పట్టున గర్వము మానుటొప్పగున్. 13

విద్యాధనమును దొంగలు హరింపలేరు. అది (ధనమువలెగాక) ఎల్లప్పుడు సుఖమునే కలుగఁజేయును. కోరినవారి కెల్లప్పు డిచ్చుచుండినను మఱింత వృద్ధి నందును. ప్రళయకాల మప్పుడును నశింపదు. ఇట్టి విద్యాధనము గలవారియెడ సామాన్య ధనముగల రాజులు దురాగ్రహ మునుగలయును. హరి నెదుర్కొనుట కెవ్వరును జాలరు.

శ్లో. అధిగతపరమార్థాన్ పణ్డితాన్ మా౽వమంస్థా
స్తృణ మితి లఘు లక్ష్మీర్నైవ తాన్ సంరుణద్ధి,
అభినవమదరేఖాశ్యామగణ్డస్థలానాం
న భవతి బిసతన్తుర్వారణం వారణానామ్. 14

తే. ప్రభులు పండితు లగువారి♦వలన గర్వ
కలన మానుఁడు వారు మీ♦కలిమి తృణము
లీలఁ బోలింప లేమి మృ♦ణాళగుణము
భూరిమదవారణములకు ♦ వారణంబె.

ఓయీ! యథార్థ మెఱిఁగినపండితుల నవమానింపకుము. నీసంపదను చూచి నీమాటలభరింతురని తలఁచెదవేమొకాని వారు నీసంపదను గడ్డిపోఁచవలె చూతురు. నూతనముగ మదధారకారుటచేత నలుపెక్కిన చెక్కిళ్లుగల మదగజంబుల తామర తూటిచేతఁ గట్టివేయుట సాధ్యమగునా ?

శ్లో. అమ్భోజినీవనవిహారవిలాస మేవ
హంసస్య హన్తి నితరాం కుపితో విధాతా,
న త్వస్య దుగ్ధజలభేదవిధౌ ప్రసిద్ధాం
వైదగ్ధ్యకీర్తి మపహర్తు మసౌ సమర్థః. 15



చ. వనజభవుండు కోపమున ♦ వాహనమైనమరాళభర్తకున్
వనజవనీవిహారకల♦నంబుఁ దొలంగఁగఁ జేయఁగాని గుం
భనమున దుగ్ధజీవనవి♦భాగవిధాననిరూఢనైపుణీ
జనితమహాయశోవిభవ♦సారము హంసకు మాన్పఁ జాలునే.

బ్రహ్మకు హంసమీఁద కోపమువచ్చునేని పద్మసరోవరములందు విహరింపకుండునటుల చేయఁగలఁడుగాని నీరక్షీరంబుల వేఱుపఱుచుటయందుఁ గలనేర్పును తీసివేయఁజాలఁడుగదా.

శ్లో. కేయూరాణి న భూషయన్తి పురుషం హారా న చన్ద్రోజ్జ్వలా
న స్నానం న విలేపనం న కుసుమం నాలఙ్కృతా మూర్ధజాః,
వాణ్యేకా సమలఙ్కరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే
క్షీయన్తే౽ఖిలభూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్. 16

ఉ. భూషలు గావు మర్త్యులకు ♦ భూరిమయాంగదతారహారముల్
భూషితకేశపాశమృదు♦పుష్పసుగంధజలాభిషేకముల్
భూషలు గావు పూరుషుని ♦ భూషితుఁ జేయుపవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము♦భూషణముల్ నశియించు సన్నియున్.

పురుషునకు భుజకీర్తులు, సూర్యహారములు, చంద్రహారములు మొదలగు సొమ్ములుగాని, స్నానము, చందనము పూసికొనుట, పూలు ముడుచుకొనుట, కురులు దువ్వుకొనుట మొదలగువానిలో నేదియుగాని యలంకారము నియ్యఁజాలదు. శాస్త్రసంస్కారముగలవాక్కు ఒకటియే అలంకారమును కలుగఁజేయును. సువర్ణమయాది భూషణములన్నియు నశించును. వాగ్భూషణ మొక్కటియే నశించనిభూషణము

శ్లో. విద్యా నామ నరస్య రూప మతులం ప్రచ్ఛన్నగుప్తం ధనం
విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః,
విద్యా బన్ధుజనో విదేశగమనే విద్యా పరా దేవతా
విద్యా రాజసు పూజ్యతే నహి ధనం విద్యావిహీనః పశుః. 17

ఉ. విద్య నిగూఢగుప్తమగు♦విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి ♦ విద్య గురుండు విదేశబంధుఁడున్
విద్య విశిష్టదైవతము ♦ విద్యకు సాటిధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము ♦ విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే.

పురుషునకు విద్యయేరూపము. విద్యయే రహస్యముగ దాచిపెట్టఁబడినధనము. విద్యయే సకలభోగములను కీర్తిని సుఖమును కలుగఁజేయును. విద్యయే గురువువలె నన్నియు బోధించును. పరదేశమునందుఁ జుట్టమువలె సహాయ మొనర్చును. విద్యయే పరమాత్మ. విద్యయే రాజపూజితము. ధన మిట్టిదికాదు. ఇట్టివిద్యలేనివాఁడు పశుతుల్యుఁడు.

శ్లో. క్షాన్తిశ్చే త్కవచేన కిం కి మరిభిః క్రోధోఽస్తిచే ద్దేహినాం
జ్ఞాతి శ్చే దనలేన కిం యది సుహృ ద్దివ్యౌషధైః కిం ఫలమ్,
కిం సర్పై ర్యది దుర్జనాః కిము ధనై ర్విద్యాఽనవద్యా యది
వ్రీడా చే త్కిము భూషణై స్సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్. 18

చ. క్షమ కవచమ్ము క్రోధ మది ♦ శత్రువు జ్ఞాతి హుతాశనుండు మి
త్రము దగుమందు దుర్జనులు ♦ దారుణపన్నగముల్ సువిద్యవి
త్తము చితలజ్జ భూషణ ము♦దాత్తకవిత్వము రాజ్య మీక్షమా
ప్రముఖపదార్థముల్ గలుగు♦పట్టునఁ దత్కవచాదు లేటికిన్.

ఓరుపున్నయెడల కవచము లక్కఱలేదు. కోపమున్నయెడల (ఉపద్రవము గలుగఁజేయుటకు) శత్రువులక్కఱలేదు. దాయాదియున్నయెడల వేఱేనిప్పు అక్కఱలేదు. మిత్రుఁడుండెనేని సిద్ధౌషధములక్కఱలేదు. దుర్జనులుండిరేని సర్పములక్కఱలేదు.

శ్లో. దాక్షిణ్యం స్వజనే దయా పరిజనే శాఠ్యం సదా దుర్జనే
ప్రీతిః సాధుజనే నయో నృపజనే విద్వజ్జనే చార్జవమ్,
శౌర్యం శత్రుజనే క్షమా గురుజనే కాన్తాజనే ధృష్టతా
యే చైవం పురుషాః కలాసు కుశలా స్తేష్వేవ లోకస్థితిః. 19

చ. వరకృప భృత్యులందు నిజ♦వర్గమునం దనుకూలవృత్తి శా
పురుషులయందు శౌర్యము సు♦బుద్ధులయం దనురక్తి దాల్మి స
ద్గురువులయందు గౌరవము ♦ కోవిదులందు నయంబు రాజులం
దరిజనులందు శౌర్యము నృ♦గాక్షులయందుఁ బ్రగల్భభావ మీ
వరుసఁ గళాప్రవీణు లగు♦వారలయందు వసించు లోకముల్.

బంధువులయందు దాక్షిణ్యముతో నుండుటయు (దాక్షిణ్య మనఁగా వారియిష్టానుసారము నడుచుట), సేవకులయందు దయ, దుర్జనులయందు కఠినముగ నుండుట, సజ్జనులయందుఁ బ్రీతియు, రాజులయందు అనుసరణమును, విద్వాంసులయందుఁ గ్రమప్రవర్తనమును, శత్రువులయందుఁ బరాక్రమమును, పెద్దలయందు ఓర్పును, స్త్రీలయందు దిట్టతనమును ఏపురుషులు గనఁబఱతురో అట్టివారలే లోకస్థితికిఁ గారణభూతులు.



శ్లో. జాడ్యం ధియో హరతి సిఞ్చతి వాచి సత్యం
మానోన్నతిం దిశతి పాప మపాకరోతి,
చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం
సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్. 20

తే. సత్యసూక్తి ఘటించు ధీ♦జడిమ మాన్చు
గౌరవ మొసంగు జనులకుఁ ♦ గలుష మడఁచుఁ
గీర్తిఁ బ్రకటించుఁ జిత్తవి♦స్ఫూర్తిఁ జేయు
సాధుసంగంబు సకలార్థ♦సాధనంబు.

సత్సహవాసము బుద్ధిమాంద్యమును బోఁగొట్టును. సత్యవాక్యములనే పలుకఁజేయును. మంచిగౌరవమునిచ్చును. పాపములఁ బోఁగొట్టును. మనస్సు బాగుచేయును. దిక్కులయందుఁ గీర్తిని వ్యాపింపఁజేయును. వేయేల? అది చేయఁజాలని మంచి యేలోకమున లేదు.

శ్లో. జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్. 21

క. సుకృతాత్ములు రససిద్ధులు
సుకవీంద్రులు విజయనిధులు ♦ సుమ్ము తదీయా
ధికకీర్తిశరీరంబులు
ప్రకటజరామరణజన్మ♦భయరహితంబుల్.

తత్తద్రసానుగుణముగ నిర్మించు నైపుణ్యముండుటచేత ధన్యాత్ములగు కవీశ్వరులు జరామరణములు లేని తమకీర్తిశరీరములచేత సిద్ధౌషధసేవచే జరామరణముల నతిక్రమించిన యోగులవలె సర్వదా ప్రకాశించుచుందురు.

## మానశౌర్యపద్ధతి.

శ్లో. క్షుత్క్షామోపి జరాకృశోపి శిథిలప్రాయోపి కష్టాం దశా
మాపన్నోపి విపన్నదీధితిరపి ప్రాణేషు నశ్యత్స్వపి,
మత్తేభేన్ద్రవిభిన్నకుమ్భపిశితగ్రాసైకబద్ధస్పృహః
కిం జీర్ణం తృణ మత్తి మానమహతా మగ్రేసరః కేసరీ. 22

ఉ. గ్రాసము లేక స్రుక్కినను ♦ జరాకృశమైన విశీర్ణమైన సా
యాసము నైన నష్టరుచి ♦ యైనను బ్రాణభయార్తమైన సం

త్రాసమదేభకుంభపిశి♦తగ్రహలాలసశీలసాంద్రహా
గ్రేసరభాసమాన మగు♦ కేసరి జీర్ణతృణంబు మేయునే.

శూరాగ్రణియగు సింగము ఆకలిచే డస్సినను, ముదిమిచేఁ జిక్కినను, కష్టస్థితిఁ బొందినను, కాంతివిహీన మయినను, ప్రాణములు పోవుచున్నను మదించిన యేనుఁగు యొక్క కుంభస్థలమును పగులఁగొట్టి యందలిమాంసమును భుజింపఁ దలఁచునే కాని ఎండుగడ్డిని తినునా యేమి ?

శ్లో. స్వల్పస్నాయువసావశేషమలినం నిర్మాంస మప్యస్థి గోః
శ్వా లబ్ధ్వా పరితోష మేతి నచ తత్తస్య క్షుధాశాన్తయే,
సింహో జమ్బుక మఙ్క మాగత మపి త్యక్త్వా నిహన్తి ద్విపం
సర్వః కృచ్ఛ్రగతోఽపి వాఞ్ఛతి జన స్సత్త్వానురూపం ఫలమ్.

ఉ. స్నాయువసావశేషమలి♦నమ్మగు నెమ్ము గ్రహించి జాగిలం
బాయతమోద మందుఁ జన♦ దాఁకలి దానికిఁ జెంత నున్నగో
మాయువు దానిఁ జూచి పరి♦మార్పక సింగము దంతిఁ గూల్చు నే
చాయల నెల్లవారు నిజ♦సత్త్వసమానఫలార్థులే కదా.

కుక్క మాంసహీనమై సన్నని నరములు క్రొవ్వు స్వల్పముగనుండిన మలినమైన యెముక దొరకినంతనే సంతోషము నొందునుగాని అయ్యది దానియాఁకలిని దీర్పదు. సింగము తనయెదుట జంబుకములు చరించుచుండినను వాని వదలి వనంబంతయుఁ గ్రుమ్మరి గజరాజమును చంపును. కావున జనులు కష్టకాలమునందును తమ శక్తికి దగినలాభమునే కోరుదురుగాని ఎచ్చుతక్కువలుగఁ గోరరు.

శ్లో. లాఙ్గూలచాలన మధశ్చరణావఘాతం
భూమౌ నిపత్య వదనోదరదర్శనఞ్చ,
శ్వా పిణ్డదస్య కురుతే గజపుఙ్గవస్తు
ధీరం విలోకయతి చాటుశతైశ్చ భుఙ్క్తే. 24

ఉ. వాలముఁ ద్రిప్పు నేలఁ బడి♦ వక్త్రముఁ గుక్షియుఁ జూపుఁ గ్రిందటం
గా లిడుఁ ద్రవ్వఁ బిండదుని♦కట్టెదుటన్ శునకంబు భద్రశుం
డాలము శాలితండులగు♦డంబులు చాటువచశ్శతంబుచే
నోలి భుజించు ధైర్యగుణ♦యుక్తిగఁ జూచు మహోన్నతస్థితిన్.

కుక్క తనకు పిడికెడు నన్నము పెట్టువానియెదుట తోఁక నాడించుట, కాలితోనే భూమియందుఁబడి నోరు కడుపుఁ జూపించుట మొదలగు నీచకృత్యము లన్ని



యో చేయును. గజశ్రేష్ఠము ధైర్యముతోఁ జూచుచు మావటివానిచేత ప్రియవాక్యములచేత లాలింపఁబడుచు నాహారమును గ్రహించును.

శ్లో. పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే,
న జాతో యేన జాతేన యాతి వంశ స్సముున్నతిమ్. 25

తే. ప్రాణిలోకంబు సంసార♦పతిత మగుట
వసుధపై గిట్టి పుట్టని♦వాఁడు గలఁడె
వానిజన్మంబు సఫల మె♦వ్వానివలన
వంశ మధికోన్నతి వహించి♦ వన్నె కెక్కు.

చావు పుట్టుకలతో నెప్పుడునుగల యీసంసారచక్రమునఁ బుట్టువా రెందరో గలరు. అట్లు పుట్టినవారిలో నశింపనివా రెవరు ? ఎవనిపుట్టుకవలన వంశము కీర్త్యాదులచేత వాసిగాంచునో వాఁడే జన్మించినవాఁడు.

శ్లో. కుసుమస్తబకస్యేవ ద్వయీ వృత్తిర్మనస్వినః,
మూర్ధ్ని వా సర్వలోకస్య శీర్యతే వన ఏవ వా. 26

తే. కుసుమగుచ్ఛంబునకుఁ బోలెఁ♦ బొసఁగు శౌర్య
మానవంతున కివి రెండు♦ మహితగతులు
సకలజనమస్తకప్రదే♦శముల నైన
వనమునందైన జీర్ణభా♦వంబుఁ గనుట.

మాననీయుఁడగు విద్వాంసునకు పుష్పగుచ్ఛమునకుఁబోలె ఎల్లరచేత శిరసా వహింపఁబడుటయో, లేక అరణ్యముననే క్రుంగుటయో ఈరెండుగతులేతక్క వేఱు విధములేదు.

శ్లో. సన్త్యన్యేఽపి బృహస్పతిప్రభృతయ స్సమ్భావితాః పఞ్చషా
స్తా న్ప్రత్యేష విశేషవిక్రమరుచీ రాహు ర్న వైరాయతే,
ద్వావేవ గ్రసతే దివాకరనిశాప్రాణేశ్వరౌ భాస్వరౌ
భ్రాతః పర్వణి పశ్య దానవపతి శ్శీర్షావశేషాకృతిః. 27

మ. గురుముఖ్యుల్ గలరెవ్వ రార్వురు శుభాం♦గుల్ ఖేచరుల్ వారిలో
వరవిక్రాంతివిహారి రాహు వెపుడున్♦ వైరంబు సేయండు భా
స్వరులన్ భాస్కరయామినీచరులనే♦ బాధించుచున్నాఁడు ద
త్పరతన్ మస్తకశేషమూర్తి యగునా♦దైత్యుండు గర్వంబునన్

బృహస్పతి మొదలగు గణనీయములైన ఆయిదారుగ్రహము లున్నను పరాక్రమశీలుఁ డగురాహువు వారితెరువుబోక శీర్షావశిష్టుఁడై యుండియు తేజోవంతు

లగుదివాకరనిశాకరు (సూర్యచంద్రు) లను మాత్రమే పర్వకాలములంగుఁ బీడించుచున్నాఁడు.

శ్లో. వహతి భువనశ్రేణిం శేషః ఫణాఫలకస్థితాం
కమఠపతినా మధ్యేపృష్ఠం సదా సచ ధార్యతే,
తమపి కురుతే క్రోడాధీనం పయోధి రనాదరా
దహహ మహతాం నిస్సీమాన శ్చరిత్రవిభూతయః. 28

మ. భువనశ్రేణి వహించు శేషుఁడు ఫణా♦భోగంబుపై సంతతం
బవలీలన్ భరియించుఁ బృష్ఠమున గూ♦ర్మాధీశ్వరుం డాతనిన్
ధవళక్రోడవశాత్ముఁ జేయు నతనిన్ ♦ వారాశి యశ్రాంతిచే
నవురా ధీరచరిత్రసంపద లసం♦ఖ్యాతప్రభావోన్నతుల్.

ఆదిశేషుఁడు పదునాలుగులోకములను తనపడగలచేత మ్రోయుచున్నాఁడు. అతనిని ఆదికూర్మమూర్తి మూఁపున వహించుచున్నాఁడు. ప్రళయకాలసముద్రుఁడట్టి యాదికూర్మని ఆదివరాహునికి లోఁబడినవానినిఁగాఁ జేయుచున్నాఁడు. కావున, మహాత్ముల మహిమకు మేరలేదు.

శ్లో. వరం ప్రాణోచ్ఛేదః సమదమఘవన్ముక్తకులిశ
ప్రహారై రుద్గచ్ఛద్బహులదహనోద్గారగురుభిః,
తుషారాద్రేః సూనో రహహ పితరి క్లేశవివశే
న చాసౌ సంపాతః పయసి పయసాం పత్యు రుచితః. 29

చ. సమధికభీషణజ్వలన♦జాలవినిర్గమదుస్సహంబుచే
సమదసురేంద్రముక్తకులి♦శక్షతిచే నుచితంబు ప్రాణఘా
తము హిమవత్కుమారునకుఁ ♦ దండ్రి నిశాతశతారపాతఖే
దమున మునుంగుచున్నతఱిఁ ♦ దా జలరాశిఁ దొలంగ సర్హమే.

హిమవంతుని కుమారుఁడగు మైనాకునికి, దేవేంద్రుఁడు తనబలిమికొలఁది వేయు నిప్పులు గ్రక్కుచు నోర్వరాక మీఁదఁబడుకులిశముయొక్క దారాహతిచే జచ్చుటే కొంచము మంచిదిగాని, ఆపాటుచే మూర్ఛనొందిన తనతండ్రిని వదలి తనప్రాణముల రక్షించుకొనన సముద్రము జొచ్చి దాగియుండుట తగునా ?

శ్లో. యదచేతనోపి పాదైః స్పృష్టః ప్రజ్వలతి సవితు రినకాన్తః,
తత్తేజస్వీ పురుషః పరకృతనికృతిం కథం సహతే. 30



తే. అర్కకాంత మచేతనం♦ బయ్యు సవితృ
పాదములు సోఁకినంతనె ♦ బ్రజ్వరిల్లుఁ
గాన నభిమానవంతుఁ డెం♦దైన శత్రు
కృతతిరస్కార మెట్లు స♦హింప నేర్చు.

సూర్యకాంతమణి అచేతనమయినను సూర్యునిపాదములు (కిరణములు) తనకు సోఁకినంతమాత్రనే మండిపడును. కావున తేజోవంతులు పరులు చేయుపరిభవమును సహించి యూరకుండరు.

శ్లో. సింహః శిశురపి నిపతతి మదమలినకపోలభిత్తిషు గజేషు,
ప్రకృతి రియం సత్త్వవతాం నఖలు వయ స్తేజసాం హేతుః. 31

క. వికళింప నుఱుకుసింగపుఁ
గొదమయు మదమలినగండ♦కుంజరములపై
నిది బలశాలికి నైజము
గద తేజోనిధికి వయసు♦కారణ మగునే.

సింగము బాల్యదశయందుండినను మదధారలు ప్రవించుటచే మలినములయిన గోడలవంటి చెక్కిళ్ళుగల మదగజంబులమీఁది కుఱుకును. ఇది బలవంతుల స్వభావము. పరాక్రమప్రకటనమునకు వయసు మొదలగునవి పనిలేదు.

## అర్థపద్ధతి.

శ్లో. జాతి ర్యాతు రసాతలం గుణగణ స్తత్రా ప్యధో గచ్ఛతాత్
శీలం శైలతటా త్పత త్వభిజన స్సన్దహ్యతాం వహ్నినా,
శౌర్యే వైరిణి వజ్ర మాశు నిపత త్వర్థోఽస్తు నః కేవలం
యేనైకేన వినా గుణా స్తృణలవప్రాయా స్సమస్తా ఇమే. 32

ఉ. జాతి దొలంగుఁ గాత గుణ♦శక్తి రసాతలసీమకుం జనుం
గాత కులంబు బూది యగుఁ ♦ గాత నగంబుననుండి శీలముం
బాతముఁ జెందుఁ గాత బహు♦భంగుల విత్తమె మాకు మేలు వి
ఖ్యాతగుణంబు లెల్లఁ దృణ♦కల్పము లొక్కధనంబు లేవడిన్.

జాతి పాతాళమునకుఁబోయినను, సద్గుణము లంతకంటెఁ గ్రిందుపడినను, శీలము కొండమీఁదనుండి క్రిందపడినను, వంశము తగలఁబడినను, శౌర్యమునందుఁ బిడుగుపడినను మాకేమియు లోపములేదు. మాకు ద్రవ్యమొక్కటియున్నఁ జాలును. ఈ ద్రవ్యము లేకపోవునేని పైనచెప్పినవి యుండియు గడ్డిపోఁచకైనను కొఱగావు.

శ్లో. యస్యాస్తి విత్తం స నరః కులీనః స పణ్డిత స్స శ్రుతవాన్ గుణజ్ఞః,
సఏవ వక్తా సచ దర్శనీయః సర్వేగుణాః కాఞ్చన మాశ్రయన్తి.

క. ఏనరునకు విత్తముగల, దానరుఁడు కులీనుఁ డధికుఁ ♦ డార్యుఁడతండే
ధీనిధిధన్యుఁడు నేర్పరి, నానాగుణగణము కాంచ ♦ నంబుననిలుచున్.

లోకమునందు ధనముగలవాఁడే కులీనుఁడనియు, పండితుఁడనియు, శాస్త్రజ్ఞుఁడనియు, గుణావగుణముల నెఱింగినవాఁడనియు, చక్కనివాగ్ధోరణి కలవాఁడనియు, చూడఁదగినవాఁడనియు, రూపవంతుఁడనియుఁ జెప్పఁబడును. ధన మొకటుండునేని పైగుణములు లేకపోయినను వానియం దీగుణములున్నవని జనులు తలంతురు.

శ్లో. దౌర్మన్త్ర్యా న్నృపతి ర్వినశ్యతి యతి స్సఙ్గా త్సుతో లాలనా
ద్విప్రోఽనధ్యయనా త్కులం కుతనయా చ్ఛీలం ఖలోపాసనాత్,
హ్రీ ర్మద్యా దనవేక్షణా దపికృషిః స్నేహః ప్రవాసాశ్రయా
న్మైత్రీ చాప్రణయా త్సమృద్ధి రనయా త్త్యాగా త్ప్రమాదా ద్ధనమ్.

మ. యతి సంగంబున బాలుఁ డాదరముచే ♦ జ్యాభర్త దుర్మంత్రిచే
శ్రుతిహీనిన్ ద్విజుఁ డన్వయంబు ఖలుచేఁ ♦ గూరాప్తిచే శీల ము
ద్ధతిచే మిత్రత చూపు లేమిఁ గృషి మ ♦ ద్యప్రాప్తిచే సిగ్గు దు
ర్మతిచే సంపదలున్ నశించుఁ జెడు న ♦ ర్థంబుల్ ప్రమాదంబునన్.

దుర్మంత్రివలన రాజును, సంగమువలన యతియు, లాలించుటచేఁ బుత్త్రుండును, బ్రాహ్మణుఁడు వేదాధ్యయనములేమిచేతను, కుపుత్త్రునివలన వంశమును, దుర్జనుల సేవవలన సదాచారమును, మద్యపానమువలన లజ్జయు, వ్యవసాయము తఱుచుగఁ జూడక పోవుటచేతను, దేశాంతరసంచారముచేత స్నేహమును, అనురాగము లేమిచేత మైత్రియు, నీతిలేమిచేత సంపదయు, అపాత్రదానముచేత ధనంబును నశించును.

శ్లో. దానం భోగో నాశ స్తిస్రో గతయో భవన్తి విత్తస్య,
యో న దదాతి న భుఙ్క్తే తస్య తృతీయా గతి ర్భవతి. 35

క. దానము భోగము నాశము
పూనికతో మూఁడుగతులు ♦ భువి ధనమునకున్
దానము భోగము నెఱుఁగని
దీనునిధనమునకు గతి దృ ♦ తీయమె పోసఁగున్.

ధనవ్యయమునకు సత్పాత్రదానము, తా ననుభవించుట, దొంగలు మొదలగువారలు హరించుట, అని మూఁడుదారులు గనంబడుచున్నవి. ఎవఁడు సత్పాత్రమున కివ్వక తా ననుభవింపక యుండునో వానిధనమునకు మూఁడవదారి (అనఁగా చోరులు మొదలగువారు హరించుట) అగును.



మణి శ్శాణోల్లీఢః సమరవిజయీ హేతిదళితో
మదక్షీణో నాగః శరది సరి దాశ్యానపులినా,
కలాశేష శ్చన్ద్రః సురతమృదితా బాలవనితా
తనిమ్నా శోభన్తే గళితవిభవా శ్చార్థిషు నరాః. 36

ఉ. శాణవిఘృష్టరత్నమును ♦ శస్త్రహతుం డగుశూరుఁడున్ మద
క్షీణగజంబు సైకతవి ♦ శిష్టశరన్నదియున్ నవక్షపా
ప్రాణవిభుండు చండసుర ♦ తాలసబాలికయున్ ధనైకవి
శ్రాణనశూరులుం గడుఁ గృ ♦ శత్వమునం బ్రభఁ గాంతు రిద్ధరన్.

సానబెట్టఁబడిన మణియు, ఆయుధక్షతములు దగిలియున్నశూరుఁడును, మదజలస్రావముచేతఁ జిక్కినగజంబును, శరత్కాలమున ఎండినయిసుకతిన్నెలుగలనదియు, కళామాత్రావశిష్టుఁ డగుచంద్రుఁడును, రతిక్రీడచే డస్సిన నవయౌవన యగుబాలయు, సత్పాత్రదానముచేత నైశ్వర్యమును గోలుపోయినరాజులును విశేషముగఁ బ్రకాశింతురు.

పరిక్షీణః కశ్చిత్ స్పృహయతి యవానాం ప్రసృతయే
స పశ్చా త్సమ్పూర్ణః కలయతి ధరిత్రీం తృణసమామ్,
అత శ్చానేకాన్తా గురులఘుతయాఽర్థేషు ధనినా
మవస్థా వస్తూని ప్రథయతి చ సఙ్కోచయతి చ. 37

ఉ. చేరి యొకండు నెవ్వఁ బడి ♦ చిక్కుచుఁ జేరెడుశాలిధాన్యమే
కోరు నతండు పిమ్మట న ♦ కుంఠ ధనోన్నతుఁ డై వసుంధరం
బూరికి సాటిగాఁ దలఁచు ♦ భూరిధనాఢ్యులచో న్ననేకమై
గౌరవమున్ లఘుత్వమును ♦ గైకొనువస్తువులందు నెల్లెడన్.

దారిద్ర్యము ననుభవించునప్పు డొకగుప్పెడుధాన్యము నపేక్షించునతఁడే కాలాంతరమున ఐశ్వర్యమునందు నేని భూమండలమునంతయు గడ్డిపరకవలెఁ గాంచును. కాఁబట్టి సమయము ననుసరించి వస్తువులు అధికములనియును అల్పములనియుఁ జెప్పఁబడును. ఒకప్పుడు అల్పమైనది మఱొకప్పు డధికముగను, అదియే మరల నల్పమైనదిగను తోఁచును.

రాజన్ దుధుక్షసి యది క్షితిధేను మేనాం
తేనాద్య వత్స మివ లోక మముం పుషాణ,

తస్మింశ్చ సమ్య గనిశం పరిపుష్యమాణే
నానాఫలం ఫలతి కల్పల తేవ భూమిః. 38

తే. ధరణి ధేనువుఁ బిదుకంగఁ ♦ దలఁచితేని
జనులఁ బోషింపు మధిప వ♦త్సములమాడ్కి
జనులు పోషింపఁ బడుచుండ ♦ జగతి కల్ప
లత తెఱంగున సకలఫ♦లంబు లొసఁగు.

రాజా ! భూమియను గోవునుండి ధనమును పితుకదలఁచితివేని ఆవు దూడను పోషించినవిధంబుగ జనులఁ బోషింపుము. ఆజనులఁ జక్కఁగ నీవు పోషించితివేని భూమి కల్పవల్లివలెఁ గోరినవాని నన్నింటిని ఫలింపఁజేయును.

సత్యానృతాచ పరుషా ప్రియభాషిణీచ
హింస్రాదయాళు రపి చార్థపరా వదాన్యా,
నిత్యవ్యయా ప్రచురనిత్యధనాగమాచ
వారాఙ్గనేవ నృపనీతి రనేకరూపా. 39

తే. సత్య మనృతంబు పరుషోక్తి ♦ సరసభాష
ప్రాణిహింసయు దయయు లో♦భంబు నీఁగి
కనకసంగ్రహవ్యయములు ♦ గలుగు వార
రమణికైవడి బహురీతి ♦ రాజనీతి.

రాజనీతి కొన్నితావుల సత్యమిశ్రముగను, కొన్నితావుల నసత్యయుతముగను, ఒకచోట నిష్ఠురముగను, ఒకతావున చెవులకింపుగనుండునదియు, ఒకచోట బాధించునదియు, మఱొకతావున దయను గనంబఱుచుచు, ఒకతావున ద్రవ్య మాకర్షించుచు, మఱొకచోట వ్యయము నొనర్చుచు వారాంగనవలె నానాప్రకారముల నుండును.

ఆజ్ఞా కీర్తిః పాలనం బ్రాహ్మణానాం
దానం భోగో మిత్రసంరక్షణంచ,
యేషా మేతే షడ్గుణా న ప్రవృత్తాః
కోఽర్థ స్తేషాం పార్థివో పాశ్రయేణ. 40

తే. ఆజ్ఞయును గీర్తియును భూసు♦రావనంబు
దానమును భోగమిత్రసం♦త్రాణనములు
షడ్గుణంబులు గలుగ వే♦ జనులయందు
వారిఁ గొల్చిన ఫల మేమి ♦ వసుమతీశ.



దుర్జనశిక్షణము, సత్కీర్తి, బ్రాహ్మణపరిపాలనము, సత్పాత్రదానము, స్వచ్ఛందనవిహారాదిభోగములు, ఆపన్నులగు మిత్రాదుల రక్షించుట అను సద్గుణషట్కము లేనిరాజుల సేవించుటవలన లాభ మేమియులేదు.

యద్ధాత్రా నిజఫాలపట్ట లిఖితం స్తోకం మహద్వా ధనం
త త్ప్రాప్నోతి మరుస్థలేఽపి నితరాం మేరౌచ నాతోఽధికమ్,
త ద్ధీరో భవ విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మా కృథాః
కూపే పశ్య పయోనిధావపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్. 41

చ. వనజభవుండు నెన్నొసట ♦ వ్రాసినసొమ్ము ఘనంబొ కొంచమో
వినుము మరుభూమి కేగిన ల♦భించును మేరువుఁ జేరఁబోయినన్
ధన మధికంబు రాదు కడు♦దైన్యము మాను ధనాఢ్యులందు న
వ్వననిధి నూతఁ దుల్యముగ♦వారి గ్రహించుఘటంబు నూడుమా.

తననొసట వ్రాసినంతధనము కొద్దిదైనను గొప్పదైనను మరుస్థలమునందున్నను తప్పక పొందును. మేరువునందైనను అంతకంటె నధికముగఁ బొందఁడు. కావున ధనవంతులను జూచి దీనత్వమును గనంబఱుపకుము. కుండను తీసుకవెళ్ళి బావియందు ముంచినను సముద్రమున ముంచినను ఒకేవిధంబుగ జలమును గైకొనును.

## దుర్జనపద్ధతి.

అకరుణత్వ మకారణవిగ్రహః పరధనే పరయోషితి చ స్పృహా,
సుజనబన్ధుజనే ష్వసహిష్ణుతా ప్రకృతిసిద్ధ మిదంహి దురాత్మనామ్.

తే. కారణము లేనికలహంబు ♦ గరుణ లేమి
పరవధూపరధనవాంఛ ♦ బంధుసాధు
జనములం దసహిష్ణుత్వ ♦ మనఁగ జగతిఁ
బ్రకృతిసిద్ధంబు లివి దుష్ట♦నికరమునకు. 42

దయాహీనత, నిష్కారణమైన కలహము, పరులధనమునందును పరస్త్రీలయందును ఆసక్తియు, సజ్జనులయందును బంధువులయందును ఓర్పులేమియు ఇవి దుర్జనుల స్వభావగుణములు.

దుర్జనః పరిహర్తవ్యో విద్యయాఽలంకృతోఽపి సన్,
మణినా భూషిత స్సర్పః కి మసౌ న భయంకరః. 43

తే. విద్యచే భూషితుం డయి ♦ వెలయుచున్నఁ
బొడరి వర్జింప నగు జుమీ ♦ దుర్జనుండు

చారుమాణిక్యభూషిత♦శస్తమస్త
కంబు గలపన్నగము భయం♦కరము గాదె.

పాము శిరమునందు రత్నముకలదైనను భయంకర మగుటచేత దూరముగ నెటుల వదలుచున్నారో, అట్లే దుర్జనుఁడు విద్యావంతుఁడైనను దూరముగ విడువఁ దగినవాఁడు.

జాడ్యం హ్రీమతి గణ్యతే వ్రతరుచౌ దంభః శుచౌ కైతవం
శూరే నిర్ఘృణతా మునే ర్విమతితా దైన్యం ప్రియాలాపిని,
తేజస్విన్యవలిప్తతా ముఖరతా వక్తవ్యశక్తిస్థిరే
తత్కో నామ గుణో భవేత్సగుణినాం యో దుర్జనై ర్నాఙ్కితః.

శా. హ్రీరమ్యుం జడుఁ గాఁగ సువ్రతుని మా♦యింగా శుచిం దంభిఁగా
శూరున్ నిర్దయుఁగా మునిన్ విమతిఁగా ♦ శ్రోత్రప్రియాలాపు ని
స్సారుంగా బలవంతు గర్వితునిగా ♦ సద్వక్త వాచాలుఁగాఁ
గ్రూరుం డెన్ని సుధీగుణంబు దురితా♦రూఢంబు జేయుం గదా.

లజ్జగలవాని మందునిగను, తపోవంతుని డంబముగలవానిగను, శుచిగలవానిని వేషధారినిగను, శూరుని దయాహీనునిగను, మునీశ్వరుని బుద్ధిహీనునిగను, ప్రియముగ మాట్లాడువానిని దీనునిగను, తేజోవంతుని గర్విగను, యుక్తియుక్తముగఁ బలుకు వానిని వాచాలునిగను దుర్జనులు తలంతురు. ఎట్టిగుణవంతునైనను దుర్జనులు ఏదో యొకవంకపెట్టి నిందింతురు.

లోభశ్చే దగుణేన కిం పిశునతా యద్యస్తి కిం పాతకైః
సత్యంచే త్తపసాచ కిం శుచి మనో యద్యస్తి తీర్థేన కిమ్,
సౌజన్యం యది కిం బలేన మహిమా యద్యస్తి కిం మణ్డనైః
సద్విద్యాయది కిం ధనై రపయశో యద్యస్తి కిం మృత్యునా. 45

చ. పగ గొను లోభముం బిశున♦భావము సత్యము చిత్తశుద్ధియుం
దగుసుజనత్వముల్ సుమహి♦తత్వము విద్యయు లోకనిందయుం
దగిలిన దుర్గుణంబు దురి♦తంబు దపంబునుఁ దీర్థసేవ భృ
త్యగణము సొమ్ములున్ ధనచ♦యంబును జావును వేఱ యున్నదే.

అత్యాశయున్న వేఱొకదుర్గుణ మక్కఱలేదు. పిశునత్వ (కొండెములు చెప్పుట) మెుండునేని వేఱుపాపము లక్కఱలేదు. సత్యమున్న తపస్సుచేయ నక్కఱలేదు. నిర్మలమగుమనస్సున్న తీర్థసేవయక్కఱలేదు. మంచితనముండెనేని స్వకార్యనిర్వహణమునకు స్వజన మక్కఱలేదు. గౌరవముండునేని యలంకారము లక్కఱలేదు. చక్కనివిద్యయుండునేని ధన మక్కఱలేదు. అపకీర్తియుండునేని వేఱుగ చావక్కఱలేదు.



శశీ దివసధూసరో గళితయౌవనా కామినీ
సరో విగతవారిజం ముఖ మనక్షరం స్వాకృతేః,
ప్రభు ర్ధనపరాయణః సతతదుర్గతి స్సజ్జనో
నృపాఙ్గణగతః ఖలో మనసి సప్తశల్యాని మే. 46

చ. దినములినాంగుఁ డైనహిమ♦దీప్తియుఁ బ్రాయము దప్పునాతియున్
వనరుహశూన్య మౌకొలను ♦ వర్ణితరూపు నిరక్షరాస్యమున్
ధనపరుఁ డైనరాజు సత♦తంబును లేమిని గుందుసాధువున్
జనపతిచెంత దుర్జనుఁడు ♦ శల్యము లేడివి నామనంబునన్.

పగటియందుఁ దేజోహీనుఁడైన చంద్రుఁడును, గతయౌవనయగు కామినియు, తామరలు లేనికొలనును, చదువులేని సుందరుఁడును, కేవలధనాశగలభూపాలుఁడును, సర్వదా దరిద్రుఁడగు సజ్జనుఁడును, ప్రభులసమీపమున నుండినదుర్జనుఁడును ఈ ఏడుగురు శల్యమువలె మనంబునకు దుఃఖమును కలుగఁ జేయుదురని నాయభిప్రాయము.

న కశ్చి చ్చణ్డకోపాన మాత్మీయో నామ భూభుజామ్,
హోతార మపి జుహ్వానం స్పృష్టో దహతి పావకః. 47

క. మనుజులలో నెవ్వఁడు దగఁ
దనవాఁ డనువాఁడు దుష్ట♦ధరణీశునకున్
దనకై వ్రేలిమి వ్రేల్చెడు
జనునితనువుఁ గాల్చు వాయు♦సఖుఁ డదయుం డై.

అతికోపులగుభూపాలురకు ప్రేమించఁదగినవాఁడు ఒకఁడు నుండఁడు. అగ్నిహోత్రుఁడు తనతృప్తికై హోమముచేయువానిని సైతము తాఁకునేని మొగమోటమి లేక కాల్చును.

మౌనా న్మూకః ప్రవచనపటు ర్వాచకో జల్పకో వా
ధృష్టః పార్శ్వే భవతి చ వస న్దూరతో ఽప్యప్రగల్భః,
క్షాన్త్యా భీరు ర్యది న సహతే ప్రాయశో నాభిజాతః
సేవాధర్మః పరమగహనో యోగినా మప్యగమ్యః. 48

ఉ. మౌనముచేత మూఁగయు స♦మంచితవక్తృఁ బ్రలాపి చెంగటం
బూని వసించ దిట్ట దవ♦ముందట దవ్వుగ నుండెనేని శా
లీనుఁడు దాల్మిభీరుఁ డవ♦లిప్తుఁడు దాలిమి లేనిబంటు భూ
జానులసేవ దుష్కర మ♦సాధ్యము యోగులకైన నిద్ధరన్.

సేవకుఁ డగువాఁడు ఏమియుఁ బలుకకనుండునేని వానిని మూఁగవాఁడనియు, చక్కఁగ మాట్లాడునేని వదరుపోతనియు, సమీపముననున్న భయభక్తులు లేనివాఁడనియు, దూరముగనున్న చేతకానివాఁడనియు, సహించువాఁడగునేని పిఱికి యనియు, ఓర్పులేనియెడల సద్వంశజాతుఁడు కాఁడనియు ప్రభువులు తలంతురు. కావున ఇట్టిసేవాధర్మమునందు చక్కఁగఁ జరించుట యోగీశ్వరులకైనను అలవికాదు.

ఉద్భాసితాఖిలఖలస్య విశృఙ్ఖలస్య
ప్రోద్గాఢవిస్మృతనిజాధమకర్మవృత్తేః,
దైవాదవాప్తవిభవస్య గుణద్విషోఽస్య
నీచస్య గోచరగతైః సుఖమాస్యతే కైః. 49

చ. ఖలులగువారలం దురధి♦కారసమర్థులఁ జేసి తా నిర
ర్గళగతియై నికృష్టనిజ♦కర్మము విస్మృతిపాలొనర్చి ని
శ్చలగుణవైరియై విధివ♦శంబున సంపద గాంచి త్రుళ్లుచుం
మెలఁగు నృపాలుదేశమున ♦ మేలు లభించునె యెట్టివారికిన్.

దుర్జనులకే సహాయమొనర్చుచు వారిని జేరఁదీసి స్వేచ్ఛాచారుఁడై తా నింతకుముం దనుభవించిన హీనస్థితిని దైవయోగముచేత బట్టినసంపదచేత మఱచి గుణవంతుల ద్వేషించు నీచునిసమీపమున నుండువారలకు సుఖ మనునది యుండదు.

ఆరమ్భగుర్వీ క్షయిణీక్రమేణ లఘ్వీపురా వృద్ధిముపైతి పశ్చాత్,
దినస్య పూర్వార్ధపరార్ధభిన్నా ఛాయేవమైత్రీ ఖలసజ్జనానామ్. 50

తే. మొదలఁ జూచినఁ గడుఁగొప్ప ♦ పిదపఁ గుఱుచ
యాదిఁ గొంచెము తర్వాత ♦ నధిక మగుచుఁ
దనరు దినపూర్వపరభాగ♦జనితమైన
ఛాయపోలికఁ గుజనస♦జ్జనులమైత్రి.

దురాత్ములస్నేహము ప్రాతఃకాలపునీడవలె ప్రథమమున విస్తారముగనుండి క్రమక్రమముగ నశించును. సజ్జనులమైత్రి సాయంకాలపునీడవలె ప్రథమమున చిన్నదై క్రమక్రమముగ వృద్ధినందును.



మృగమీనసజ్జనానాం తృణజలసన్తోషవిహితవృత్తీనామ్,
లుబ్ధకధీవరపిశునా నిష్కారణమేవ వైరిణో జగతి.

తే. కసవుచే నీటిచే మోద♦కలనచేత
బ్రతుకు మృగమీనసజ్జన♦ప్రకరమునకు
శబరకైవర్తసూచక♦జనులు జగతిఁ
గారణము లేనిపగవారు ♦ గారె తలఁప.

పరులఁ బీడింపకయే గడ్డిచేత కాలయాత్రను గడుపుకొను జింకలు మొదలయిన మెకములకును, నీటిచేఁ బ్రదుకుమీనంబులకును, దొరకినదానితో సంతసించి కాలయాత్రచేయు సజ్జనులకును, బోయలు, జాలర్లు, కొండెగాండ్లు అకారణవైరులం లోకమునఁ గనంబడుచున్నారు.

## సుజనపద్ధతి.

వాఞ్ఛా సజ్జనసఙ్గతౌ పరగుణే ప్రీతి ర్గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితి రతి ర్లోకాపవాదా ద్భయమ్,
భక్తి శ్శూలిని శక్తి రాత్మదమనే సంసర్గముక్తిః ఖలై
రేతే యేషు వసన్తి నిర్మలగుణా స్తేభ్యో నమః కుర్మహే. 5

మ. సుకృతిశ్రేష్ఠులగోష్ఠియుం బరగుణ♦స్తోమంబునం బ్రీతి దే
శికసంసేవయు విద్యయందు రుచి స్వ♦స్త్రీకేళి లోకాపవా
దకథాభీతియు విష్ణుభక్తి దమనో♦ద్యచ్ఛక్తియుం సాధుదూ
షకసాంగత్యవిముక్తియుం గలమనీ♦షానంతులం గొల్చెదన్.

సత్సహవాసమునం దాసక్తియు, పరులగుణమునందుఁ బ్రీతియు, గురువులయందు అణఁకువయు, విద్యలయం దాసక్తియు, స్వభార్యయందు సంభోగము, జనాపవాదమునకు వెఱచుట, ఈశ్వరునియందు భక్తియు, అవమానముగలిగిన సామర్థ్యమును చూపుటయు, దుస్సహవాసమును విడుచుట, ఇట్టినిర్మలగుణములుంగలవారికి నమస్కారము.

విపది ధైర్య మథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః,
యశసి చాభిరతి ర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనామ్. 5

ఉ. ఆపదలందు ధైర్యగుణ ♦ మంచితసంపదలందుఁ దాల్మియుం
భూపసభాంతరాళమునఁ ♦ బుష్కలవాక్చతురత్వ మాజి శౌ

హాపటుశక్తియుఁ యశమునం దనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియుఁ బ్రకృతిసిద్ధగుణంబులు సజ్జనాళికిన్.

ఆపదలు వచ్చినప్పుడు ధైర్యము, ఐశ్వర్యము వచ్చినపుడు ఓర్పు, సభయందు వాక్పాటవము, యుద్ధమునందు శౌర్యముచూపుట, కీర్తియం దాసక్తి, వేదశాస్త్రాభ్యాసమునందు చింత ఇవి మహాత్ములకు స్వభావగుణములు.

కరే శ్లాఘ్య స్త్యాగః శిరసి గురుపాదప్రణయితా
ముఖే సత్యా వాణీ విజయి భుజయో ర్వీర్య మతులమ్,
హృది స్వచ్ఛావృత్తిః శ్రుత మధిగతం చ శ్రవణయో
ర్వినా ప్యైశ్వర్యేణ ప్రకృతిమహతాం మణ్డన మిదమ్. 54

చ. కరమున నిత్యదానము ముఖంబున సూనృతవాణి యౌదలం
గురుచరణాభివాదన మకుంఠితవీర్యము దోర్యుగంబునఁ
వరహృదయంబునఁ విశదవర్తన మంచితవిద్య వీనులఁ
సురుచిరభూషణంబు లివి శూరులకుఁ సిరి లేనియప్పుడున్.

మహాత్ములకు ఐశ్వర్యములేమిచేత బంగారుసొమ్ములు లేకపోయినను ఈక్రిందఁ జెప్పఁబోవునవి స్వాభావికాలంకారములుగఁ గనంబడుచున్నవి. ఎట్లన: హస్తములకు సత్పాత్రదానము, శిరంబునకు గురుపాదనమస్కృతియు, ముఖంబునకు సత్యవచనమును, భుజంబులకు జయస్వభావ మగుపరాక్రమమును, హృదయంబునకు అకలంకమయిన ప్రవర్తనయు, చెవులకు శాస్త్రశ్రవణమును ఇవియ అలంకారములు.

ప్రాణాఘాతా న్నివృత్తిః పరధనహరణే సంయమః సత్యవాక్యం
కాలే శక్త్యా ప్రదానం యువతి జనకథామూకభావః పరేషామ్,
తృష్ణాస్రోతోవిభంగో గురుషుచ వినయః సర్వభూతానుకమ్పా
సామాన్యం సర్వశాస్త్రే ష్వనుపహతవిధిః శ్రేయసా మేష పన్థాః.

మ. పరహింసాపరకీయవిత్తహరణాభావంబు సత్యవ్రతా
దరముం దానపరత్వ మన్యవనితోదంతోక్తిమూకత్వముం
బరతృష్ణాప్రఘురభంజనంబు గురునమ్రత్వంబునుం బ్రాణభృ
త్కరుణాశాస్త్రసమత్వసద్విధులు భద్రప్రాప్తికిన్ మార్గముల్. 55

జీవహింసనువిడిచి పరద్రవ్యమునందు మనసునుబోనీక సత్యము పల్కుచు దేశకాలములు లెఱిఁగి శక్తికొలఁది దానముచేయుచుఁ బరస్త్రీలవిషయమునుగుఱించి ఏమియుఁ బల్కక మౌనమువహించి ఆశ్యాశనునిలిపి గురువులయందు వినయమును గనంబఱు



చుచు సకలప్రాణులందు దయను గనంబఱచుట శ్రేయమును గలుగఁజేయునని సకలశాస్త్రములందును సుప్రసిద్ధము.

సంపత్సు మహతాం చిత్తం భవే దుత్పలకోమలమ్,
ఆపత్సుచ మహాశైలం శిలాసంఘాతకర్కశమ్. 56

తే. సంపదలు గల్గుతఱి మహాజనుల హృదయ
మభినవోత్పలకోమలం బగుచు వెలయు
నాపదలు వొందునపుడు మహామహీధ
రాశ్మసంఘాతకర్కశం బై తనర్చు.

మహాత్ములమనంబు సంపదలు సంభవించునేని కలువకంటె కోమలంబుగ నుండును. ఆపదలు వచ్చునేని పెద్దకొండయందలి రాతిగుండులకంటె కఠినముగానుండును. అనఁగా సంపదలువచ్చిన గర్వించి కఠినులుగారనియు, ఆపదలువచ్చిన వెలవెలఁబోరనియు భావము.

ప్రియా న్యాయ్యావృత్తి ర్మలిన మసుభఙ్గేఽప్యసుకరం
త్వసన్తో నాభ్యర్థ్యాః సుహృదపి న యాచ్యః కృశధనః,
విప ద్యుచ్చైః స్థైర్యం పద మనువిధేయం చ మహతాం
సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్. 57

మ. అసమానప్రియనీతివర్తనము ప్రాణాంతంబునందుఁ మలీ
మస మగ్రాహ్య మదుష్టయాచన మసత్ప్రార్థనాభావముఁ
వ్యసనావాప్తిని ధైర్యముఁ బుధజనాత్యంతానుకూలత్వ మీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహార్యశ్రేణికిం దెల్పెనో.

న్యాయమయినవృత్తి నవలంబించుటయు, ప్రాణాపాయముసంభవించినను అకార్యము లొనర్పకుండుటయు, దుర్జనులఁ బ్రార్థింపకుండుటయు, ధనహీనుఁడగునేని ప్రాణమిత్రుఁడైనను వానిని యాచింపకుండుటయు, ఆపదలయందు ధైర్యము, మహాత్ములకనుకూలముగ నడచుటయు అను ఈయసిధారావ్రతము సజ్జనులకు స్వభావముగఁ బట్టుపడి నదిగాని ఒకరియుపదేశముచేత రాలేదు.

ప్రదానం ప్రచ్ఛన్నం గృహ ముపగతే సంభ్రమవిధిః
ప్రియం కృత్వా మౌనం సదసి కథనం చాప్యుపకృతేః,
అనుత్సేకో లక్ష్మ్యాం నిరభిభవసారాః పరకథాః
సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్. 58

మ. పొసఁగం దానము గుప్త మర్థి భవనం♦బుం జేరుచో సంభ్రమో
ల్లసదుత్థానవిధానముం బ్రియవిధుల్ ♦ గావించి మౌనంబు రా
జసభన్ మిత్రకృతప్రకాశనము గు♦త్సాకర్మవై ముఖ్య మీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహా♦ర్యశ్రేణికిం దెల్పెనో.

రహస్యముగ దానముసేయుటయు, గృహంబునకువచ్చినయర్థికి సంతోషముతోఁ బ్రియముసేయుటయు, చేసినమేలునుచెప్పకుండుటయు, తనకితరులుచేసినమేలును సభలయందుఁ బలుకుటయు, సంపదలు వచ్చినప్పుడుగర్వములేకుండుటయు, ఇతరులనుగుఱించి నిందగామాట్లాడకపోవుటయు అనునీఅసిధారావ్రతము సజ్జనులకు స్వభావసిద్ధము.

సన్తప్తాయసి సంస్థితస్య పయసో నామాపి న శ్రూయతే
ముక్తాకారతయా తదేవ నలినీపత్రస్థితం దృశ్యతే,
అన్తస్సాగరశుక్తిమధ్యపతితం తన్మౌక్తికం జాయతే
ప్రాయేణాధమమధ్యమోత్తమజుషా మేవంవిధా వృత్తయః. 59

ఉ. నీరము తప్తలోహమున ♦ నిల్చి యనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళి♦నీదళసంస్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోఁ బడి మ♦ణిత్వముఁ గాంచు సమంచితప్రభం
బౌరుషవృత్తు లిట్లధమ ♦ మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్.

కాలిన యినుము పైనపడిన నీటిచుక్క ఊరుపేరులేక నశించిపోవును. ఆబిందువే తామరపాకుమీఁదఁ బడునేని ముత్యమువలెఁ గనంబడును. ఆబిందువే సముద్రాంతర్గతమగు ముత్తెపుచిప్పయందుఁ బడునేని మౌక్తికమణి యగును. కావున ఆశ్రయము ననుసరించిన వారి కాయాశ్రయానుసారము నీచులు, మధ్యములు, ఉత్తములు అను పేరులు వచ్చును.

యః ప్రీణయే త్సుచరితైః పితరం స పుత్రో
య ద్భర్తురేవ హిత మిచ్ఛతి తత్కళత్రమ్,
త న్మిత్ర మాపది సుఖే చ సమక్రియం య
దేవత్త్రయం జగతి పుణ్యకృతో లభన్తే. 60

చ. జనకుని బూజలం గడుఁ బ్ర♦సన్నుని జేయునతండు పుత్త్రుఁ డే
వనిత మెలంగు భర్తృవశ♦వర్తిని యై యది సత్కళత్ర మే
జనుఁడు విపత్తిసౌఖ్యసదృ♦శక్రియుఁ డాతఁడు మిత్త్రుఁ డీత్రయం
బును జగతిన్ లభించుఁ గడుఁ♦బుణ్యముఁ జేసినయట్టివారికిన్.



మంచిపనిచేతఁ దండ్రిని సంతోషపెట్టువాఁడే పుత్త్రుఁడు. భర్తకు హితముఁ గోరునదియే పెండ్లము. ఆపత్సమయమునందును సంపదలయందును సమానముగ చెలిమి చేయునతఁడే మిత్త్రము. ఇట్టిపుత్త్రుఁడు భార్యయు స్నేహితుఁడును పుణ్యాత్ములకుఁగాని లభించరు.

నమ్రత్వే నోన్నమన్తః పరగుణకథనైః స్వాన్గుణాన్ ఖ్యాపయన్తః
స్వార్థా న్సంపాదయన్తో వితతపృథుతరారమ్భయత్నాః పరార్థే,
క్షాన్త్యైవాక్షేపరూక్షాక్షరముఖరముఖా న్దుర్జనా న్దుఃఖయన్తః
సన్తః సాశ్చర్యచర్యా జగతి బహుమతాః కస్య నాభ్యర్చనీయాః.

చ. నతు లగుచున్ మహోన్నతిఁ ద♦నర్చుచు నన్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచున్ బరజ♦నప్రియకార్యసమర్థతన్ సముం
చితనిజకార్యసంగ్రహముఁ ♦ జేయుచు నిష్ఠురవాదులన్ క్షమా
ధృతి నిరసించుచు న్బరఁగు♦ధీరులు పుణ్యులు గారె యేరికిన్. 61

సత్పురుషులు అణఁకువ గలిగియే ఔన్నత్యమును పొందుదురు. పరులగుణములనే శ్లాఘించుటచేత తమసహృదయత్వమును గనంబఱుతురు. పరులకార్యసాఫల్యమునకై ఎక్కువ ప్రయత్నించి వారికార్యమును సానుకూలముచేయుచు తమకార్యముల నొనర్చుచుందురు. తమ్మును కఠినముగను పరుషముగను నిందించు దుర్జనులయందు ఓర్పును గనంబఱుచుచునే వారిని దుఃఖపెట్టుదురు. ఇట్టి ఆశ్చర్యకరమగు నడవడిగల మహాత్ము లెవరికిఁ బూజ్యులుగారు.

## పరోపకారపద్ధతి.

భవన్తి నమ్రా స్తరవః ఫలోద్గమై
ర్నవామ్బుభి ర్భూరివిలమ్బినో ఘనాః,
అనుద్ధతా స్సత్పురుషా స్సమృద్ధిభిః
స్వభావ ఏవైష పరోపకారిణామ్. 62

తే. తరువు లతిరసఫలభార♦గురుతఁ గాంచు
నింగి వ్రేలుచు నమృత మొ♦సంగు మేఘుఁ
డుద్ధతులు గారుబుధులు స♦మృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిది ♦ సహజగుణము.

వృక్షములు ఫలకాలమున నమ్రములయి (వంగి) యుండును. నూతనాంబువులుగల మేఘములు క్రిందుగనే వేలాడుచుండును. సత్పురుషులు సంపదలువచ్చినప్పుడు గర్వము వహింపరు. ఇది పరోపకారపరాయణుల స్వభావము.

శ్రోత్రం శ్రుతేనైవ న కుణ్డలేన దానేన పాణి ర్నతు కఙ్కణేన,
విభాతి కాయః కరుణాపరాణాం పరోపకారేణ న చన్దనేన. 63

తే. అమరుఁ జెవి శాస్త్రమునఁ గుండ♦లమునఁ గాదు
వలయమున నొప్ప దీవిచే ♦ వెలయుఁ బాణి
యుగుదయాఢ్యులమేను ప♦రోపకార
కలన రాణించు గంధంబు♦వలనఁ గాదు.

దయావంతులగుసత్పురుషులచెవులకు శాస్త్రశ్రవణ మలంకారము గాని కుండలములు గావు. హస్తంబులకు అలంకారము సత్పాత్రదానముగాని కంకణములు గావు. దేహమున కలంకారము పరోపకారముగాని చందనము పూసికొనుటగాదు.

పద్మాకరం దినకరో వికచం కరోతి
చన్ద్రో వికాసయతి కైరవచక్రవాలమ్,
నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి
సన్తః స్వయం పరహితే విహితాభియోగాః. 64

తే. ద్యుమణి పద్మాకరము విక♦చముగఁ జేయుఁ
గుముదహర్షంబు గావించు ♦ నమృతసూతి
యర్థితుఁడు గాక జలమిచ్చు ♦ నంబుధరుఁడు
సజ్జనులు దారె పరహితా♦చరణమతులు.

సూర్యుఁడు ప్రార్థింపఁబడకయే తామరకొలనును వికసింపఁజేయును. చంద్రుఁడు ప్రార్థింపఁబడకయే కలువల వికసింపఁ జేయుచున్నాఁడు. మేఘుఁడు యాచింపఁబడకయే నీటిని ఇచ్చుచున్నాఁడు. సత్పురుషు లెప్పుడు పరులకు హితమొనర్చుటయందే ఇష్టపడువారు.

ఏతే సత్పురుషాః పరార్థఘటకాః స్వార్థాన్ పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థ ముద్యమభృతః స్వార్థావిరోధేన యే,
తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నన్తి యే
యే తు ఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే న జానీమహే. 65

మ. తమకార్యంబుఁ బరిత్యజించియు బరా♦ర్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబుఘటించుచుం బరహితా♦ర్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ ♦ దైత్యుల్ వృథా న్యార్థభం
గము గావించెడువార లెవ్వరో యెఱుంగం♦గ శక్యమే యేరికిన్.



తమకార్యముల విడిచి పరులకార్యములను చేయువారు సత్పురుషులు. తమకార్యములకు భంగములేకుండ పరులకార్యముల నొనర్చువారు మధ్యములు. తమకార్యము నిమిత్తమై పరులకార్యమును చెడఁగొట్టువారు మనుష్యులలో రాక్షసులు. తమకు నష్టము లేకపోయినను పరులకు నష్టముచేయువారల కేపేరు పెట్టవచ్చునో నాకు తెలియుటలేదు.

పాపా న్నివారయతి యోజయతే హితాయ
గుహ్యం నిగూహతి గుణాన్ ప్రకటీకరోతి,
ఆపద్గతం చ నజహాతి దదాతి కాలే
సన్మిత్రలక్షణ మిదం ప్రవదన్తి సన్తః. 66

తే. అఘమువలన మఱల్చు హి♦తార్థకలితుఁ
జేయుఁ గోప్యంబు దాఁచుఁ బో♦షించు గుణము
విడువఁ డాపన్ను లేవడి♦ వేళ నిచ్చు
మిత్రుఁ డీలక్షణంబుల ♦ మెలఁగుచుండ.

చెడుపనుల వారించుట, మంచిపనులఁ జేయుటకుఁ బ్రోత్సాహించుట, రహస్యసంరక్షణము, సద్గుణములఁ బ్రకటించుట, ఆపత్కాలమున విడువకుండుట, కాలములకావశ్యక మగుదానిని ఇచ్చుట, ఇవి సన్మిత్రున కుండవలసినలక్షణములు.

క్షీరేణాత్మగతోదకాయ హి గుణా దత్తాః పురా తేఽఖిలాః
క్షీరోత్తాప మవేక్ష్య తేన పయసా స్వాత్మా కృశానౌ హుతః,
గన్తుం పావక మున్మన స్తదభవ ద్దృష్ట్వా తు మిత్రాపదం
యుక్తం తేన జలేన శామ్యతి సతాం మైత్రీ పున స్త్వీదృశీ. 67

ఉ. క్షీరము మున్ను నీటి కొసఁ♦గెన్ స్వగుణంబులు దన్ను జేరుటన్
క్షీరము దత్తమౌట గని ♦ చిచ్చుఱికెన్ వెతచే జలంబు దు
ర్వారసుహృద్విపత్తిఁ గని ♦ వహ్నిఁ జొరం జనె దుగ్ధ మంతలో
నీరముఁ గూడి శాంత మగు ♦ నిల్చు మహాత్ముల మైత్రి యీగతిన్.

పాలు తనయందుగలసినజలంబునకు తనగుణంబులన్నియు నిచ్చెను. తనకిట్టిసాయమొనర్చినక్షీరములకుఁ గలుగు తాపమును గాంచి జలము అగ్నియందుఁబడెను. తనకు మిత్రమగుజల మగ్నియందుఁబడుటను చూచి క్షీరములు తానుగూడ అగ్నియందుఁబడఁబోఁగా దానితో మరల జలముకలియుటచేత శాంతిల్లుచున్నది. సజ్జనసహవాసము ఇంతయే అని యర్థము.

ఇతః స్వపితి కేశవః కుల మిత స్తదీయద్విషా
మితశ్చ శరణార్థినాం శిఖరిణాం గణాః శేరతే,
ఇతో౽పి బడబానలః సహ సమ స్తసంవర్తకై
రహో వితత మూర్జితం భరసహంచ సిన్ధో ర్వపుః. 68

చ. ఒకయెడఁ బవ్వళించు హరి ♦ యొక్కయెడన్ వసియించు రాక్షస
ప్రకరము లొక్కచో నడఁగుఁ ♦ బర్వతసంఘము లొక్కెడన్ బలా
హకములతోడ నుండు బడ♦బాగ్నియు విస్తృత మూర్జితంబునుం
బ్రకటభరక్షమం బగుచు ♦ భాసిలు నౌర సముద్ర మెంతయున్.

సముద్రము తనయం దొకచోట వెన్నుని, ఒకచోట రక్కసులను, ఒకచోటఁ బర్వతసమూహమును, ఒకచోట బడబానలంబును వహించియున్నది. దీనిమహత్వ మెంతగొప్పదైయునది.

జాతః కూర్మః సఏకః పృథుభువనభరాయార్పితం యేన పృష్ఠం
శ్లాఘ్యం జన్మ ధ్రువస్య భ్రమతి నియమితం యత్ర తేజస్విచక్రమ్,
సంజాతవ్యర్థపక్షాః పరహితకరణే నోపరిష్టా న్నచాధో
బ్రహ్మాణ్డోదుమ్బరాన్త ర్మశకవ దపరే జన్తవో జాతనష్టాః. 69

చ. విततజగద్భరంబు దన♦వీఁపునఁ దాల్చినకూర్మనాథుఁడున్
సతతము చంద్రభాస్కరుల ♦ చక్రముఁ ద్రిప్పు ధ్రువుండు సజ్జనుల్
ప్రతిభ నజాండజంతుఫల♦రంధ్రవసన్మశకంబులట్ల నిం
దితవిఫలార్థసంగతి జ♦నించి నశించుఁ దదన్యజంతువుల్.

విస్తారమగు భూభారమును ధరించిన ఆదికూర్మముయొక్క జన్మము, జ్యోతిశ్చక్రమునే భ్రమింపఁజేయుటకు ప్రధానుఁడగు ధ్రువునియొక్క జన్మము, మెచ్చఁదగినవి లెక్కింపఁదగినవి. తక్కినవారందఱు పరోపకారము చేయఁజాలనివారగుటచేత ఆదికూర్మమువలె క్రిందను ధ్రువునివలె నూర్ధ్వభాగమునను లేక బ్రహ్మాండమను అత్తిపండులోని పురుగులవలెఁ బుట్టి నశించుచున్నారు.

తృష్ణాం ఛిన్ది భజ క్షమాం జహి మదం పాపే రతిం మాకృథాః
సత్యం బ్రూ హ్యనుయాహి సాధుపదవీం సేవస్వ విద్వజ్జనమ్,
మాన్యా న్మానయ విద్విషో౽ప్యనునయ ప్రఖ్యాపయ ప్రశ్రయం
కీర్తిం పాలయ దుఃఖితే కురు దయా మేత త్సతాం చేష్టితమ్. 70



శా. ఆశాసంహరణంబు నోర్మియు మద♦త్యాగంబు దుర్దోషవాం
ఛాశూన్యత్వము సత్యముక్తి బుధమతా♦చారంబు సత్సేవయున్
వైశద్యంబును శత్రులాలనము మా♦న్యప్రీతియుం బ్రశ్రయ
శ్రీశాలిత్వము దీనులందుఁ గృపయున్ ♦ శిష్టాలికిన్ ధర్మముల్.

అత్యాశను త్యజించి ఓర్పు కలిగి మదమును విడిచి దుష్కార్యములందు మనసును పోనీయక సత్యమునే పలుకుచు పెద్దలు పోయినమార్గమున నడచుచు విద్వాంసుల సేవించుటయు, పూజ్యుల మన్నించుచు శత్రువునైనను చక్కఁగఁజూచుచు పెద్దలయందు అణఁకువ కలిగి కీర్తికి భంగము రానివిధంబుగ చరించుచు దుఃఖితులయందు దయను గనంబఱచుచుండుము. ఇవి సత్పురుషులలక్షణములు.

మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణా
స్త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః,
పరగుణపరమాణూన్ పర్వతీకృత్యనిత్యం
నిజహృది వికసన్తః సన్తి సన్తః కియన్తః. 71

చ. హృదయవచశ్శరీరముల ♦ నెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై
ముదము బహూపకారముల♦మూఁడుజగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణల♦వంబులు గొండలుసేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తు లగు♦మాన్యులు గొందఱు వొల్తు రిద్ధరన్.

మనోవాక్కాయములయందును సత్కర్మల నొనర్చుటయను అమృతముచేత పూర్ణులయి ముల్లోకములం గున్నవారికి ఉపకార మొనర్చుచున్నవారలయి పరులయందుండిన అణువులవంటి సద్గుణములైనను కొండంతగా భావించి వికసించుచున్న హృదయములుగల సజ్జనులు కొందఱుమాత్రమే యుందురు.

## ధైర్యపద్ధతి

రత్నై ర్మహార్హై స్తుతుషు ర్న దేవా నభేజిరే భీమవిషేణ భీతిమ్,
సుధాం వినా నప్రయయు ర్విరామం ననిశ్చితార్థా ద్విరమన్తి ధీరాః.

తే. తనిసిరే వేల్పు లుదధిర♦త్నములచేత
వెఱచిరే ఘోరకాకోల♦విషముచేత
విడిచిరే యత్న మమృతంబు ♦ వొడమునునుక
నిశ్చితార్థంబు వదలరు ♦ నిపుణమతులు. 72

అమృతమునకై పాలసంద్రమును మథింపుచున్న దేవతలు అందలిరత్నలాభము నకు సంతోషింపక అందు పుట్టినకాలకూటవిషంబునకు భయపడక అమృతము కలుగు నంతదనుక తమపట్టును విడలరైరి. ధీరు లెప్పుడు తాము దలంచినకార్య మగునంతవఱకును ప్రయత్నమును వదలరు.

ప్రారభ్యతే నఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః,
విఘ్నై ర్ముహుర్ముహు రపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజన్తి. 73

శా. ఆరంభింపరు నీచమానవులు వి♦ఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురువి♦ఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచున్ ♦ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమా ♦ ప్రజ్ఞానిధుల్ గావునన్.

అధములు విఘ్నములు సంభవించునని కార్యము నారంభింప వెఱతురు. మధ్య ములు ఆరంభించి విఘ్నములు వచ్చినప్పుడు వదలెదరు. ధీరు లెన్నిపర్యాయము లెట్టి విఘ్నములు వచ్చినను తాము పట్టినకార్యమును విడువరు.

క్వచి త్పృథ్వీశయ్యః క్వచి దపిచ పర్యఙ్కశయనః
క్వచి చ్ఛాకాహారః క్వచి దపిచ శాల్యోదనరుచిః,
క్వచి త్కన్థాధారీ క్వచి దపిచ దివ్యామ్బరధరో
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్. 74

మ. ఒకచో నేలను బవ్వళించు నొకచో ♦ నొప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో ♦ నుత్కృష్టశాల్యోదనం
బొకచోఁ బొంత ధరించు నొక్కొకతఱిన్ ♦ యోగ్యాంబరశ్రేణిలె
క్కకు రానీయఁడు కార్యసాధకుఁడుదుః♦ఖంబున్ సుఖంబున్ మదిన్.

కార్యార్థియగుధీరుఁడు వీలునుపట్టి ఒకచోట భూశయ్యయు, ఒకచోట పరు పులయందు శయనించుటయు, ఒకతావున కాయగూరల నారగించుటయు, ఒకచోటను శాల్యోదనంబు సేవించుటయు, ఒకతావున బొంతగుడ్డను కట్టుకొనుటయు, ఒక చోట పీతాంబరముల ధరించుటయుఁ గలిగియుండును. కాని కష్టములు వచ్చినవని దుఃఖమునుగాని సుఖమువచ్చినదని సంతోషమునుగాని పొందఁడు.



నిన్దన్తు నీతినిపుణా యది వా స్తువన్తు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్,
అద్యైవ వా మరణ మస్తు యుగాన్తరే వా
న్యాయ్యా త్పథః ప్రవిచలన్తి పదం నధీరాః. 75

శా. నీతిప్రౌఢవిహారులైననిపుణుల్ ♦ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందినసంపదల్ నిలువనీ ♦ గాఢంబుగా సాఁగనీ
పూతం బప్పుడ పొందనీ నియతిమై ♦ కానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబు దప్పరు గదా ♦ నిత్యంబు ధీరోత్తముల్.

నీతివేత్తలు నిందించినను భూషించినను సంపదలువచ్చినను పోయినను మరణ మిప్పుడే కలిగినను కల్పాంతరమునకుఁ గలిగినను ధీరులయినవారు న్యాయమార్గమును దాఁటి ఒక అడుగునైనను పెట్టరు.

కాన్తాకటాక్షవిశిఖా న ఖనన్తి యస్య
చిత్తం న నిర్దహతి కోపకృశానుతాపః,
కర్షన్తి భూరివిషయా శ్చ న లోభపాశై
ర్లోకత్రయం జయతి కృత్స్న మిదం స ధీరః. 76

ఉ. మానవతీకటాక్షశిత♦మార్గణముల్ వికలింపఁ జాలవె
వ్వానిమనంబు కోపమయ♦వహ్ని దహింపదు లోభపాశసం
తానము మాల్యచందనవి♦తానములున్ వెతసేయనోప కె
వ్వాని వశంబునన్ మెలఁగు♦వాఁడు జయించు జగంబు లన్నియున్.

ఎవనిమనస్సు కామినులచూపు లనుబాణములచే క్షతముకాదో, ఎవనిహృదయ మును కోపాగ్ని దహింపదో, ఎవనిమనస్సు అత్యాశ యనుపాశములచే లాగఁబడదో అట్టిధీరుఁడు ముల్లోకముల జయించును.

కదర్థితస్యాపి హి ధైర్యవృత్తే ర్నశక్యతే ధైర్యగుణః ప్రమార్ష్టుమ్,
అధోముఖస్యాపి కృతస్య వహ్నే ర్నాధః శిఖా యాతి కదాచి దేవ.

తే. నియతిచేతఁ గదర్థితుం ♦ డయిన ధైర్య
పరుని ధైర్యగుణంబు మా♦న్పంగఁ దరమె
క్రిందు సేయంగఁ బడినట్టి♦కృష్ణపథుని
కీలలెం దయిన మీఁదుగాఁ ♦ గెరలుఁ గాదె. 77

ధైర్యవంతునికి ఎట్టిదుఃఖము సంభవించినను అతని ధైర్యమును పోఁగొట్టుట అసాధ్యము అగ్నిని తలక్రిందుగా పెట్టినను అగ్నిజ్వాల యూర్ధ్వముగనే ప్రసరించునుగాని అధోముఖముగ ప్రసరింపదు.

వరం తుఙ్గా చ్ఛృఙ్గా ద్గురుశిఖరిణః క్వాపి విషమే
పతిత్వా యం కాయః కఠినదృషద న్తే విదలితః,
వరం న్యస్తో హ స్తః ఫణిపతిముఖే తీక్ష్ణదశనే
పరం వహ్నౌ పాత స్తదపి న కృతః శీలవిలయః. 78

చ. ఉరుతరపర్వతాగ్రమున ♦ నుండి దృఢం బగుఱాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్ళి కాయము హ♦తంబుగఁ జేయుట మేలు గాలిమే
పరిదారవాతఁ గే లిడుట ♦ బాగు హుతాశనమధ్యపాతముం
వర మగుఁ జారుశీలగుణ♦వర్జన మర్హము గాదు చూడఁగన్.

ఎత్తయిన పర్వతశిఖరమునుండి కఠినమయిన ఱాతిమీఁద పడి దేహమును వదలుటయు, భయంకరములగు విషజ్వాలల వెళ్లగ్రక్కు కోరలుంగల ఆదిశేషునినోటి యందు చేయినిపెట్టుటయు, అగ్నియందుఁ బడుటయు ఇవి ఒకపక్షమున మేలనవచ్చును గాని సత్స్వభావమును విడుచుటమాత్రము మేలుగాదు.

వహ్ని స్తస్య జలాయతే జలనిధిః కుల్యాయతే తత్క్షణా
న్మేరుః స్వల్పశిలాయతే మృగపతిః సద్యః కురంగాయతే,
వ్యాలో మాల్యగుణాయతే విషరసః పీయూషవర్షాయతే
యస్యాఙ్గేఽఖిలలోకవల్లభతమం శీలం సమున్మీలతి. 79

చ. అతనికి వార్ధి కుల్య యగు♦నగ్ని జలం బగు మేరుశైల మం
చితశిలలీల నుండు మద♦సింహము జింక తెఱంగుఁ దాల్చుఁ గో
పితఫణి పూలదండ యగు ♦ భీష్మవిషంబు సుధారసం బగుం
క్షితి జనసమ్మతం బగు సు♦శీల మ దెవ్వనియందు శోభిలున్.

ఎవఁడు సత్స్వభావము కలిగియుండునో అట్టివానికి అగ్ని జలమువలె చల్లగను, సముద్రము అల్పమగుకాలువగను, మేరుపర్వతము చిన్నఱాతివలెను, సింగము జింకవలెను, సర్పము పూలమాలవలెను, విషము అమృతమువలెను అగును.

ఛిన్నోఽపి రోహతి తరుః క్షీణో ప్యుపచీయతే పున శ్చన్ద్రః,
ఇతి విమృశ న్త స్సన్తః స న్తప్య న్తే న విప్లుతా లోకే. 80



తే. ఖండిత బయ్యు భూజంబు ♦ వెండి మొలుచు
క్షీణుఁ డయ్యును నభివృద్ధిఁ ♦ జెందు సోముఁ
డవ్విధమున విచారించి ♦ యొడలు దెగిన
జనములకుఁ దాప మొందరు ♦ సాధుజనులు.

ఛేదింపఁబడిన వృక్షము మఱల అంకురించుటయు, క్షీణించిన చంద్రుఁడు మఱల వృద్ధినందుటయు సజ్జనులు గాంచుచున్నవారలయి తమకు దుఃఖముకలిగిన సమయమున సంతాపము నందరు.

ఐశ్వర్యస్య విభూషణం సుజనతా శౌర్యస్య వాక్సంయమో
జ్ఞానస్యోపశమః శ్రుతస్య వినయో విత్తస్య పాత్రే వ్యయః,
అక్రోధ స్తపసః క్షమా ప్రభవితు ర్ధర్మస్య నిర్వ్యాజతా
సర్వేషా మపి సర్వకారణ మిదం శీలం పరం భూషణమ్. 81

ఉ. జానుగ భూతికిం దొడవు ♦ సజ్జనభావము శౌర్యలక్ష్మికిన్
మానము నీతి విద్యకు శ♦మంబు సుబుద్ధికి విత్తవృద్ధికిన్
దానము దాల్మి శక్తికిని ♦ ధర్మనిరూఢికి దంభవృత్తియుం
బూనికతోడ సర్వగుణ♦భూషణ మెన్నఁగ శీలమే సుమీ.

సంపదలు కలిగి సుజనుఁడుగ నుండుటయు, శూరుఁడై మితభాషి యగుటయు, జ్ఞానముండి ఇంద్రియలోలత లేకుండుటయు, విద్యావంతుఁడై వినయము కలిగియుండుటయు, ధనముండి సత్పాత్రయందు వినియోగించుటయు, తపస్వియై కోపము లేకుండుటయు, సమర్థుఁడై ఓర్పుంటయు, నెపములేక ధర్మము నొనర్చుటయు ఇవన్నియు వానికి అలంకారముతో సమానము.

## దైవపద్ధతి.

నేతా యస్య బృహస్పతిః ప్రహరణం వజ్రం సురాః సైనికాః
స్వర్గో దుర్గ మనుగ్రహః ఖలు హరే రైరావణో వారణః,
ఇత్యాశ్చర్యబలాన్వితోఽపి బలభి ద్భగ్నః పరైః సఙ్గరే
త ద్వ్యక్తం నను దైవమేవ శరణం ధిగ్ధిగ్ వృథాపౌరుషమ్.

చ. గురుఁడు గురుండు వాలు శత♦కోటి సుపర్వులు వాహినీపతుల్
సురభవనంబు కోట మధు♦సూదనుఁ డుర్వి సయిదోడు దంతి ది
క్కరిపతి గాఁగ నొప్పు బల♦ఘాతియు దాయలకోడె నాజిలో
శరణము దైవమే పురుష♦శక్తి నిరర్థక మెన్నిభంగులన్. 82

బృహస్పతి గురువై వజ్ర మాయుధమై దేవతలు సేనలోనివారలయి స్వర్గము కోటయై విష్ణుమూర్తి అనుగ్రహము గలవాఁడై ఐరావతగజంబు కలిగి ఈవిధంబుగ ఆశ్చర్యమును కలుగఁజేయు శక్తిగల ఇంద్రుఁడే శత్రువులచేత యుద్ధమునం దోడిపోయెను. కావున దైవబలమే ప్రధానముకాని పౌరుష మెందుకును పనికిరాదు.

భగ్నాశస్య కరణ్డపిణ్డితతనోర్మ్లానేన్ద్రియస్య క్షుధా
కృత్వాఖు ర్వివరం స్వయం నిపతితో నక్తం ముఖే భోగినః,
తృప్త స్తత్పిశితేన సత్వర మసౌ తేనైవ యాతః పథా
స్వస్థా స్తిష్ఠత దైవమేవ హి పరం వృద్ధౌ క్షయే కారణమ్. 83

ఉ. రాతిరి మూషకంబు వివ♦రం బొనరించి కరండబద్ధమై
భీతిలి చిక్కి యాసచెడి ♦ పెద్దయు డస్సిన పామువాత సం
పాతముఁ జెందె దానిఁ దిని ♦ పాము దొలంగె బిలంబుత్రోవనే
యేతఱి హాని వృద్ధులకు ♦ నెక్కటిదైవము కారణం బగున్.

ఒకరాత్రియందు ఆహారార్థము యెలుక ఒకపెట్టెకు రంధ్రముచేసి అందులో దూరెను. అందంతకుమున్నె ఒకపాము ఆపెట్టెయందుండెను. ఇరకటమువలన దానిదేహము ముద్దయి బయటికివెళ్లుట ఇఁకలేదనినిశ్చయించుకొని ఆఁకలిచేత ఇంద్రియపాటవము దప్పి కృశించుచుండెను. ఆయెలుక లోనికి ప్రవేశింపఁగానే సర్పము దానిని భుజించి ఆయెలుకచేసిన రంధ్రమునుండి బయటికి పాఱిపోయెను. కావున వృద్ధిక్షయములకు దైవమేకారణము మీరు నెమ్మదిగ నుండుఁడు.

యథా కన్దుకపాతేనోత్పతత్యార్యః పతన్నపి,
తథా త్వనార్యః పతతి మృత్పిణ్డపతనం యథా. 84

క. కందుకమువోలె సుజనుఁడు
గ్రిందం బడి మగుడ మీఁది♦కి న్నెగయుఁ జుమీ
మందుఁడు మృత్పిండమువలె
గ్రిందం బడి యడఁగి యుండుఁ ♦ గృపణత్వమునన్.

చెండు క్రిందఁబడి మరల లేచునట్లు సజ్జనుఁడు హీనస్థితి నందినను వెంటనే ఉన్నతస్థితినందును మంటిముద్ద క్రిందఁబడి యట్లె యుండునట్లు దుర్జనుఁడు హీనస్థితినందిన యట్లె యుండును

ఖర్వాటో దివసేశ్వరస్య కిరణైః సన్తాపితో మస్తకే
వాఞ్ఛన్దేశ మనాతపం విధివశాత్తాలస్య మూలం గతః,



తత్రాప్యస్య మహాఫలేన పతతా భగ్నం సశబ్దం శిరః
ప్రాయో గచ్ఛతి యత్ర దైవహతక స్తత్రైవ యాన్త్యాపదః. 85

మ. ధర ఖర్వాటుఁ డొకండు సూర్యకరసం♦తప్తప్రధానాంగుఁ డై
త్వరతో డక్క బఱువెత్తి చేరి నిలిచెన్ ♦ దాళద్రుమచ్ఛాయఁ ద
చ్ఛిరముం దత్ఫలపాతవేగమున వి♦చ్ఛిన్నె శబ్దయోగంబుగాఁ
బోరి దైవోపహతుండు పోవుకడకుం ♦ బోవుం గదా యాపదల్.

బట్టతలవాఁ డొకఁడు మధ్యాహ్నకాల సూర్యునివేఁడిమిచేత తనతల మాడుచుండుటకుఁ దాళఁజాలక నీడగలప్రదేశము కోరి తాటిచెట్టుక్రిందికిఁ బోయెను. దైవికముగ నప్పు డాచెట్టునుండి యొకపండు వానితలమీఁదఁ బడి వానితల పటపట మని బ్రద్దలయ్యెను. దైవబలముచాలనివాఁ డెచటికిఁబోయినను అచటికే ఆపదలన్నియుఁ బోవును.

గజభుజఙ్గవిహఙ్గమబన్ధనం శశిదివాకరయో ర్గ్రహపీడనమ్,
మతిమతాం చ విలోక్య దరిద్రతాం విధిరహో బలవా నితిమేమతిః.

తే. ఫణులుగజములుఁ బక్షులుఁ ♦ బట్టువడుట
రవిసుధాకరులకు నైన ♦ రాహుబాధ
బుద్ధిమంతుల లేమియుఁ ♦ బొసఁగఁజూచి
విధి బలాఢ్యుఁ డటంచు భా♦వింతు మదిని. 86

బంధింప శక్యముగాని గజసర్ప విహంగములయొక్క బంధనమును, సూర్యచంద్రాదులకుగల గ్రహపీడయు, బుద్ధిమంతులకు దరిద్రమును చూడ నామనంబునకు దైవప్రభావము బలవత్తరమని నాయభిప్రాయము.

సృజతి తావ దశేషగుణాకరం పురుషరత్న మలఙ్కరణం భువః,
తదపి తత్క్షణభంగికరోతి చే దహహ కష్ట మపణ్డితతా విధేః. 87

క. గుణమణిఖని యగుపూరుష
మణి ధరణికి రవణముగ స♦మర్చినవిధి యా
గుణవంతుని వెసఁ దునిమిన
గుణహీనునిఁ గాఁగ నెన్న♦ఁగొనరే ధాతన్.

దైవము సకల సద్గుణ సంపన్నుఁడును భూమికి నలంకారుఁడును అగు పురుషవర్యుని నిర్మించియు వెంటనే వాదిని నశింపఁజేయుచున్నది. అయ్యయో దీనికిఁ దెలివి లేదు గదా.

అయ మమృతనిధానం నాయకోఽప్యోషధీనాం
శతభిషగనుయాతః శమ్భుమూర్ధ్నోఽవతంసః,
విరహయతి న చైనం రాజయక్ష్మా శశాఙ్కం
హతవిధిపరిపాకః కేన వా లంఘనీయః. 88

చ. శతభిషగాఖ్యుఁడున్ సతత♦శంభువతంసము నయ్యు నోషధీ
తతులకు నాథుఁడయ్యును సు♦ధారససేవధి యయ్యుఁ దారకా
పతి దనరాజయక్ష్మభవ♦బాధలఁ బాపఁగ నోపఁ డక్కటా
హతవిధికృత్య మెవ్వనికి ♦ నైన జగంబున దాఁటవచ్చునే.

ఈశకనంబడు చంద్రుఁడు అమృతమునకు స్థానము. సకలౌషధులకు రాజు నూఱ్గురువైద్యులు వెంటనేయుందురు. జగత్పరిపాలకుఁ డగుశివునికిఁ దాను స్వయముగ నలంకారము. ఇట్టిచంద్రునిసైతము క్షయరోగము బాధించుచున్నది. దైవవిధి దాఁటుటకు ఎవఁడును సమర్థుఁడు కాఁడు.

ప్రియసఖి విపద్దణ్డవ్రాతప్రపాతపరమ్పరా
పరిచయచలే చిన్తాచక్రే నిధాయ విధిః ఖలః,
మృదమివ బలా త్పిణ్డీకృత్య ప్రగల్భకులాలవ
ద్భ్రమయతి మనో నో జానీమః కి మత్ర విధాస్యతి. 89

చ. కలితవిపత్తిదండపద♦ఘట్టనసేయుచు మన్నుకై వడిన్
ఖలుఁడు విధాత పిండితము♦గా నొనరించి నితాంతచింతయన్
బలితపుసారెపై నిలిపి ♦ పాయక డెందము ద్రిప్పుచున్నవాఁ
డలమి కులాలురీతిఁ దెలి♦యం గలవారమె యేమిసేయునో.

ఈపాపిష్టిదైవము గడితేఱినకుమ్మరివలె నామనస్సును ముద్దచేసి విపత్తు లని యెడి కొయ్యలచేత నెల్లప్పుడుఁ గొట్టుచు చింతయను చక్రమునఁ ద్రిప్పుచున్నాఁడు. ఏమిచేయుట కిట్లు చేయుచున్నాఁడో తెలియుటలేదు.

విరమ విర మాయాసా దస్మా ద్దురధ్యవసాయతో
విపది మహతాం ధైర్యధ్వంసం యదీక్షితు మీహసే,
అపి జడవిధే కల్పాపాయే వ్యపేత నిజక్రమాః
కులశిఖరిణః క్షుద్రా నైతే న వా జలరాశయః. 90

చ. దొసఁగులు వచ్చువేళ గుణ♦ధుర్యులధైర్యగుణంబు సర్వముం
బస చెడ నంచుఁ జూచెదవు ♦ పాపుదైవమ యీదురాగ్రహ



వ్యసనము మాను మాను ప్రళ♦యంబున వీతనిజక్రమంబులై
నసి సెడ వించుకంతయును ♦ సాగరముల్ గులపర్వతంబులున్.

ఓ తెలివిలేని దైవమా! మహాత్ములకు ఆపదలను కలిగించి వారిధైర్యమునకు భంగము కలుగఁజేయఁ జూచుచున్నావు గాని ఇది సాధ్యముగాదు. కల్పాంతమున నైనను కులపర్వతములను సప్తసముద్రములను తమమేరలుతప్పు నీచులుఁగాఁ దలంపకుము.

దైవేన ప్రభుణా స్వయం జగతి యద్యస్య ప్రమాణీకృతం
తత్తస్యోపనమే న్మనా గపి మహా న్నైవాశ్రయః కారణమ్,
సర్వాశాపరిపూరకే జలధరే వర్ష త్యపి ప్రత్యహం
సూక్ష్మా ఏవ పతన్తి చాతకముఖే ద్విత్రాః పయోబిన్దవః. 91

తే. ఎవ్వనికి నిజ్జగంబున ♦ నెంతఫలము
దైవకృత మగునది వొందు ♦ దప్ప కతనిఁ
గారణము గాదు పెనుఁబ్రాపు♦ఘనునిఁ జేరు
చాతకమువాతఁ బడు నల్ప♦జలకణములు.

ఎవరికెంతయని దైవము నిర్ణయించునో అయ్యది వానికి తనంతటనే దొరకును. దీనికై ఒకరి నాశ్రయింప నక్కఱలేదు. నలుదిక్కులవ్యాపించి మేఘము ప్రత్యహము వర్షించుచున్నను చాతకమునోటియందు సూక్ష్మబిందువులు రెండోమూఁడోపడునుగాని ఎక్కుడపడవుగదా.

## కర్మపద్ధతి.

నమస్యామో దేవా న్నను హతవిధే స్తేఽపివశగా
విధి ర్వన్ద్యః సోఽపి ప్రతినియతకర్మైకఫలదః,
ఫలం కర్మాయత్తం కి మమరగణైః కిం చ విధినా
నమ స్తత్కర్మేభ్యో విధిరపి న యేభ్యః ప్రభవతి. 92

చ. శిథిలత లేనిభక్తి నతి♦సేతుము వేల్పుల కానువార్పులున్
విధివశవర్తు లావిధియు ♦ విశ్రుతకర్మఫలప్రదాత య
య్యధికఫలంబు కర్మవశ♦మట్లగుడం బనియేమి వారిచే
విధి కధికంబు గర్మమని ♦ వేమఱు మ్రొక్కి భజింతుఁ గర్మమున్.

దేవతలకు నమస్కారము వారుసైతము పాడుదైవమునకు లోఁబడినవారుగాన దైవమునకు మ్రొక్కెదను. ఆదైవము కర్మానుసారముగ ఫలమునిచ్చునుగాన కర్మకు నమస్కారము. ఫలము కర్మాధీనము గావున దేవతలతోడను దైవముతోడను మాకేమిపని? దేవతలచేతనుగూడ దాఁట శక్యముగాని కర్మమునకే పలుమాఱు మ్రొక్కెదను.

బ్రహ్మా యేన కులాలవ న్నియమితో బ్రహ్మాణ్డభాణ్డోదరే
విష్ణు ర్యేన దశావతారగహనే క్షిప్తో మహాసఙ్కటే,
రుద్రో యేన కపాలపాణిపుటకే భిక్షాటనం కారితః
సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మై నమః కర్మణే. 93

చ. నలువ కులాలుభంగి నలి♦నప్రభవాండమునందు దేనిచే
నిలిచె దశావతారవన♦నిష్ఠితుఁ డయ్యె మురారి దేనిచే
బెలుచఁ గపాలహస్తుఁ డయి ♦ భిక్షుకుఁ డయ్యెఁ బురారి దేనిచే
నల రవి దేనిచేఁ దిరుగు ♦ నాఘనకర్మము వంద్యమేకదా.

బ్రహ్మ దేనిచేతఁ గుండవలెనుండు బ్రహ్మాండమధ్యమున నుండ నియోగింపఁబడెనో, దేనిచేత విష్ణువు పదియవతారములెత్తుట యనుకష్టమునకుఁ బాల్పడెనో, రుద్రుఁడు దేనిచేత పుఱ్ఱెను పాత్రగాగొని బిచ్చగాఁడై దిరిగెనో, దేనిచేత సూర్యుఁడు ఆకాశమున సర్వదా తిరుగుచుండెనో అట్టికర్మకు నమస్కారము.

యా సాధూంశ్చ ఖలాన్ కరోతి విదుషో మూర్ఖాన్ హితాన్ ద్వేషిణః
ప్రత్యక్షం కురుతే పరోక్ష మమృతం హాలాహలం తత్క్షణాత్,
తా మారాధయ సత్క్రియాం భగవతీం భోక్తుం ఫలం వాఞ్ఛితం
హే సాధో వ్యసనై ర్గుణేషు విపులే ష్వాస్థాం వృథా మాకృథాః.

మ. ఖలునిన్ సజ్జనుఁ గాఁగ మూర్ఖజను సం♦ఖ్యావంతునిం గాఁగ దా
యలసన్మిత్రులుగా నగోచరము బ్ర♦త్యక్షంబుగాఁ బ్రాణహృ
త్కలనం బైనమహావిషం బమృతముం♦గాఁ జేయు సత్కర్మ ము
జ్జ్వలనిష్ఠానిధి వై భజింపుము వయ♦స్యా వాంఛితార్థాప్తికిన్. 94

ఓయి నేర్పరీ! నీవు కోరినకోర్కులను పొందదలఁచితివేని దుర్జనుల సజ్జనులుగను, మూర్ఖుని విద్వాంసునిగను, శత్రువుల మిత్రులుగను, ఇంద్రియాగోచరమును గోచరించుదానిగను, విషము నమృతముగను చేయఁజాలినసత్కర్మము నారాధింపుము. ఇతరవిషయములకయి పాటుపడకుము.

శుభ్రం సద్మ సవిభ్రమా యువతయః శ్వేతాతపత్రోజ్జ్వలా
లక్ష్మీ రిత్యనుభూయతే చిర మనుస్యూతే శుభే కర్మణి,
విచ్ఛిన్నే నితరా మనఙ్గకలహక్రీడాత్రుటత్తన్తుకం
ముక్తాజాల మివ ప్రయాతి ఝడితి భ్రశ్య ద్దిశో దృశ్యతామ్. 95



చ. లలితనికేతనప్రియవి♦లాసవతీధవళాతపత్రస
ద్విలసితవైభవం బనుభ♦వింపఁబడున్ సుకృతానువృత్తిచేఁ
జెలు వగుపుణ్యకర్మము న♦శించిన నంగజసంగరత్రుట
త్కరితగుణోరుమౌక్తికని♦కాయము లట్లు దొలంగు సంపదల్.

మంచికర్మయుండునేని మంచిమేడలు, విలాసవతులగుజవ్వనులును, ఏకచ్ఛత్రాధిపత్యముగల రాజ్యలక్ష్మియు నివిమొదలగునవి కలుగును. ఆసత్కర్మ తొలఁగునేని మేడలు మొదలగుసకలసంపదలు రతికేళియందు తెగినముత్యాలపేరులోనిముత్యముల వలె నలుగడల జెదరిపోవును.

గుణవ దగుణవద్వా కుర్వతా కార్య మాదౌ
పరిణతి రవధార్యా యత్నతః పణ్డితేన,
అతిరభసకృతానాం కర్మణా మావిపత్తే
ర్భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః. 96

తే. సగుణనిర్గుణకార్యముల్ ♦ నలుపు సుమతి
చేతఁ బరిణతి గడుఁ బ్రతీ♦క్షింపఁ దగును
బరుషకర్మవిపాకంబు ♦ ఫలముదనుక
హృదయము దహించు శల్యంబు♦రీతి జగతి.

పండితుఁడగువాఁడు మంచిదో చెడ్డదో యగునొకకార్యమును చేయఁబూనునేని ప్రయత్నముగనాలోచింపవలయును. అట్లుగాక అతిత్వరగ ఆలోచింపక చేసినకార్యముల యొక్క ఫలితము మరణపర్యంతము శల్యమువలె బాధించును.

స్థాల్యాం వైడూర్యమయ్యాం పచతి తిలఖలం చాన్దనై రిన్ధనౌఘైః
సౌవర్ణై ర్లాఙ్గలాగ్రై ర్విలిఖతి వసుధా మర్కమూలస్య హేతోః,
ఛిత్త్వా కర్పూరఖణ్డాన్ వృతి మిహ కురుతే కోద్రవాణాం సమన్తాత్
ప్రాప్యేమాం కర్మభూమిం న భజతి మనుజో య స్తపో మన్దభాగ్యః.

మ. చెలు వౌరత్నఘటంబునం దతఁడు సు♦శ్రీఖండఖండంబులం
దిలపిణ్యాకము వండె నారుగల క♦ర్థిన్ సప్తపర్ణావృతుల్
నిలిపెన్ జిల్లెడుదూదికై పుడమిదు♦న్నెన్ బైఁడినాగేళ్ల ని
మ్ములఁ గర్మక్షితిఁ బుట్టి యెవ్వఁడు దపం♦బుల్ సేయఁ డప్రాజ్ఞతన్.

కర్మభూమియగు ఈభరతఖండమున జన్మించియు ఎవఁడు తపము నాచరింపఁడో అట్టిభాగ్యహీనుఁడు వైడూర్యమణిచేత నిర్మింపఁబడిన వంటకుండయందు మంచి

గంధపుకట్టెలతో తెలికపిండిని వండువానితోడను, జిల్లేడువేళుకొఱకు బంగారునాగలితో భూమిని దున్నువానితోడను, కర్పూరపుటరంటుల నఱికి వానితో ఆళ్ళకు కంచెవేయువానితోడను సమానుఁడగును.

నైవాకృతిః ఫలతి నైవ కులం న శీలం
విద్యాపి నైవ న చ యత్నకృతాపి సేవా,
భాగ్యాని పూర్వతపసా ఖలు సఞ్చితాని
కాలే ఫలన్తి పురుషస్య యథైవ వృక్షాః. 98

తే. రమ్యరూపంబు విద్యయు ♦ రాజసేవ
గులము శీలంబుఁ జాలవు ♦ ఫల మొసంగఁ
బూర్వపుణ్యసంచితభాగ్య♦ములు ఫలించుఁ
గాలమునఁ బనసాదివృ♦క్షములకరణి.

పురుషునకు ఆకారముగాని కులముగాని స్వభావముగాని విద్యగాని ప్రయత్న పూర్వకముగ చేసినసేవగాని ఫలము నొసఁగవు. పూర్వకృతమయినతపస్సువలన గలిగినభాగ్యమే వృక్షములవలె కాలమునను ఫలము నొసంగును.

మజ్జ త్వమ్భసి యాతు మేరుశిఖరం శత్రూన్ జయ త్వాహవే
వాణిజ్యం కృషిసేవనాది సకలా విద్యాః కలాః శిక్షతామ్,
ఆకాశం విపులం ప్రయాతు ఖగవ త్కృత్వా ప్రయత్నం పరం
నాభావ్యం భవ తీహ భాగ్యవశతో భావ్యస్య నాశః కుతః. 99

చ. సలిలముఁ జొచ్చినం గనక♦శైలముఁ జేరిన వైరివీరులం
గెలిచిన రాజసేవఁ దిల♦కించిన వేదము లభ్యసించినం
గళలతెఱంగెఱింగిన ఖ♦గత్వము దాల్చినఁ గర్మనిఘ్నతా
కలన నభావ్య మైన పని ♦ గాదు వినాశము లేదు భావికిన్.

వర్తకముచేయుట, పైరుపెట్టుట, కొలువుకొలుచుట మొదలగుపను లెన్నిచేసినను, ఎన్నివిద్యలు నేర్చినను, ఎంతకష్టపడినను అదృష్టములేక యేమాత్రఫలమును గలుగదు. మంచియదృష్టము గలిగినయెడల వానికి ఫలము గలుగనీయక యడ్డపడుటకు నెవరికిని సాధ్యముగాదు.

వనే రణే శత్రుజలాగ్నిమధ్యే మహార్ణవే పర్వతమస్తకే వా,
సుప్తం ప్రమత్తం విషమస్థితం వా రక్షన్తి పుణ్యాని పురాకృతాని.

క. కానవమున రణమున సలి, లానలరిపుమధ్యమున మ♦హాబ్ధి నగాగ్ర
స్థానమున మత్తునిద్రితుఁ, బూనికతోఁ బూర్వపుణ్య♦ములు రక్షించున్.



అడవిలోను, యుద్ధమునను, శత్రువులమధ్యను, నీళ్లలోను, నిప్పులోను, సముద్రములోను, కొండచివరను, నిదురలోను, కైపులోను, అపాయములోను పురుషుని పూర్వపుణ్యములు రక్షించును.

భీమం వనం భవతి తస్య పురం ప్రధానం
సర్వో జనః స్వజనతా ముపయాతి తస్య,
కృత్స్నా చ భూ ర్భవతి సన్నిధిరత్నపూర్ణా
య స్యాస్తి పూర్వసుకృతం విపులం నరస్య. 101

తే. భువనమునఁ బూర్వసంభృత♦పుణ్యరాశి
యగుచు నుదయంబు గాంచిన♦సుగుణనిధికి
వనము పుర మగుఁ బరు లాత్మ♦జనము లగుదు
రవని నిధిరత్నపరిపూర్ణ ♦ యయి ఫలించు.

ఎవనికి తొలుత సంపాదింపఁబడిన యనల్పమైన పుణ్యముండునో, వానికి భయంకరమైన యడవియును భోగార్హ మగునగరమగును. పెఱవారెల్లరును బంధువులగుదురు. భూమియంతయు రత్నపుగనులతోడను మంచివస్తువులతోడను నిండినదై యుండును.

మ. యమునానీలసరోజసౌరభరస♦వ్యాసంగిభృంగీకులో
పమకంఠద్యుతిలిప్తశేషభుజగ♦ప్రాలంబజాంబూనదా
ద్రిమహాకార్ముకరూఢగూఢపదమౌ♦ర్వీసంప్రయుక్తత్రివి
క్రమశాతాంబకపాతితాంబరచర♦క్రవ్యాత్పురాట్టాలకా.

క. సుమనోనాయక సంభృత
సుమనోర్చిత పదబిసప్ర♦సూనభవానీ
సుమనోహర సురనిర్ఝర
సుమనోదామార్హ జాట♦జూటోద్దేశా.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుఁగు లక్ష్మణకవిరాజపౌత్ర తిమ్మనార్యపుత్ర వివిధవిద్వజ్జనవిధేయ లక్ష్మణకవినామధేయప్రణీతం బయినసుభాషితరత్నావళీకావ్యమునందు నీతిశతకంబున మూర్ఖపద్ధతియు, విద్వత్పద్ధతియు, మానశౌర్యపద్ధతియు, నర్థపద్ధతియు, దుర్జనపద్ధతియు, సుజనపద్ధతియుఁ, బరోపకారపద్ధతియు, ధైర్యపద్ధతియు, దైవపద్ధతియుఁ, గర్మపద్ధతియు ననుప్రకరణంబులు గలది ప్రథమాశ్వాసము.

నీతిశతకము సమాప్తము.

శ్రీ ర స్తు.

# భర్తృహరిసుభాషితము

## శృంగారశతకము.

అవతారిక. శ్రీమద్రాజర్షిశ్రేష్ఠుఁ డగుభర్తృహరి శృంగారరసానుభవముగూడ నీతిపూర్వకముగాఁ జేయఁదగినదికాని, దానికి విరుద్ధముగాఁ జేయరాదని తెలియఁజేయుచు, మొదట నీతిబోధకమై నీతిశతకమును రచించి పిదప శృంగారరసమనుభూతమై, యనంతరమున వైరాగ్యము గలిగించుటకు హేతువగునని యెంచి, మొదట శృంగారశతకమును వర్ణించి తర్వాత వైరాగ్యశతకమును వర్ణింపఁగలనని మనంబున నెంచి, శృంగారశతకమును బ్రారంభింపఁగోరినవాఁడై శృంగారరసమునకు మన్మథుఁడు ముఖ్యుఁడగుటవలన మొదట మన్మథనమస్కారరూపమైన మంగళమును జేయుచున్నాఁడు.—

శ్లో. శంభుస్స్వయంభుహరయో హరిణేక్షణానాం
యేనాక్రియన్త సతతం గృహకర్మదాసాః,
వాచామగోచరచరిత్రవిచిత్రితాయ
తస్మై నమో భగవతే మకరధ్వజాయ. 1

ఉ. శంకరపద్మగర్భముర♦శాసనులన్ భువనేశులన్ నిరా
తంకధృతిన్ మృగాక్షులకు ♦ దాసులఁ జేసిన మేటికిం గురం
గాంకవసంతమిత్త్రునకు ♦ నంజలిఁ జేసెద వాగతీతని
శ్శంకచరిత్రచిత్త్రునకు ♦ షడ్గుణహారికి శంబరారికిన్.

ఒకటి చేయుటకును, ఒకటి చేయకుండుటకును, జేసినదానిని మఱియొక్కవిధంబుగాఁ జేయుటకును జాలినవారలయినను, బ్రహ్మవిష్ణుశివులను ఏమన్మథుఁడు మృగాక్షులగు కాంతలయొక్క పనివాండ్రనుగా నెల్లప్పుడు చేసెనో అట్టియనిర్వాచ్యమైనవింతయగుచరిత్రగలవాఁడు గనుక నైశ్వర్యవంతుఁడగుపూవిల్తునికి నమస్కారము (అనికృతికర్త మన్మథునికి నమస్కారముగావించెను). (ఈశ్వరుఁడుపార్వతినితనయర్ధాంగమున నుంచుకొనియుండుటచేతను, విష్ణువు లక్ష్మినిదనవక్షమ్మున నే దాల్చియున్నందునను, బ్రహ్మ సరస్వతిని తనవాక్కునందే యుంచుకొనియుండుటచేతను ఈప్రకారము వర్ణింపఁబడినది.)



### —స్త్రీప్రశంస.—

అవ. స్త్రీలు చిఱునగవు మొదలగువానిచేఁ బురుషులను వశపఱచుకొందురని చెప్పుచున్నాఁడు.—

శ్లో. స్మితేన భావేన చ లజ్జయా భియా
పరాఙ్ముఖై రర్ధకటాక్షవీక్షణైః,
వచోభి రీర్ష్యా కలహేన లీలయా
సమస్తభావైః ఖలు బన్ధనం స్త్రియః. 2

చ. చెలువపుఁ దేట లేనగవు♦చేతను భావముచేత సిగ్గుచే
నలు వగులీలచేత సుగు♦ణంబులచేఁ గడఁగంటిచూపుచేఁ
గలహముచేత విందు లగు♦కందువమాటలచే నసూయచే
బెలుచన నెంతవారి వల♦పింతురు కాంతలు పెక్కుభంగులన్.

స్త్రీలు చిఱునవ్వులచేతను, చేతులు మొదలగునవి త్రిప్పుటచేతను, సిగ్గుచూపుటచేతను, భయపడుటచేతను, పెడమోముచూపుటచేతను, కడగన్నులు సగముమూసి తెఱచి చూచుటచేతను, మాటలచేతను, పొలయలుకచేతను, సొగసులచేతను, మఱి యనేక చేష్టలచేతను పురుషులను గట్టివేయుదురు.

అవ. స్త్రీలకు కటాక్షాదులు స్వవిషయమున భూషణములుగను, పురుషులమీఁదికి ఆయుధములవలె నున్నవి యని చెప్పుచున్నాఁడు.—

[1] భ్రూచాతుర్యాత్ కుఞ్చితాక్షాః కటాక్షాః
స్నిగ్ధావాచో లజ్జితాన్తాశ్చ హాసాః,
లీలామన్దం [2] ప్రస్థితం చ స్థితం చ
స్త్రీణా మేతద్భూషణం చాయుధం చ. 3

తే. భ్రూలతాక్షేపకుంచిత♦స్ఫురణదాల్పు
కలికిచూపులు నెయ్యంపుఁ ♦ బలుకుతీపు
సిగ్గునగవులు చెన్నగు♦చిన్నినడలు
సొమ్ము లాయుధములు ముద్దు♦గుమ్మలకును.

1 భ్రూచాతుర్యాత్కుంచిత. 2 ప్రస్థితం సస్మితం చ

కనుబొమ్మ నేర్పుతో వంచి యరకన్ను వెట్టి కడగంటితోఁ జూచుటయు, తిన్నని పలుకులును, సిగ్గుతోఁగూడిన చిఱునగవులును, కులుకునడకయు, ముసిముసినగవును స్త్రీలకు స్వభావసిద్ధములైన భూషణంబులుగను, పురుషులను వశపఱచుకొనుట కాయుధములుగను నగుచున్నవి.

అవ. శృంగారరసమున కాధారమైన యతివను ఐదుశ్లోకములచే వర్ణించుచున్నాఁడు.—

క్వచి త్సభ్రూభంగైః క్వచి దపిచ లజ్జాపరిగతైః
క్వచి ద్భీతిత్రస్తైః క్వచి దపిచ లీలావిలసితైః,
[1]నవోఢానా మేతై ర్వదనకమలై ర్నేత్ర[2]లసితైః
స్ఫురన్నీలాబ్జానాం ప్రకరపరికీర్ణా ఇవ దిశః. 4

ఉ. భ్రూలతికావిభంగయుత♦ముల్ సభయంబులు సత్రపంబు లు
ద్వేలవిలాసముల్ మదన♦దీపనముల్ రుచిరంబు లైనకాం
తాలసమాననేత్రవలి♦తంబులచే దిశలెల్ల విస్ఫుర
న్నీలసరోజపత్త్రములు ♦ నిండె ననం గనుపట్టె నెంతయున్.

ముద్దరాండ్రు కొన్నిచోట్ల గనుబొమలు ముడివెట్టుకొనియు, కొన్నిచోట్ల సిగ్గుచేఁ దలవంచుకొనియు, కొన్నితావులం దులికిపడియు, కొన్నిచోటులందుఁ దమసొగసులఁ జూపియు, కొన్నిచోట్ల కమలములంబోలు మోములంజూపియు, కన్నులఁ ద్రిప్పియు నంతట నల్లకలువలు వికసించియున్నవో యనునట్లు చేయుదురు.

అవ. స్త్రీల స్వభావసిద్ధమైన భూషణములఁ జెప్పుచున్నాఁడు.—

వక్త్రం చన్ద్ర[3]విడమ్బి పఙ్కజపరీహాసక్షమే లోచనే
వర్ణః స్వర్ణ మపాకరిష్ణు రలినీజిష్ణుః కచానాం చయః,
వక్షోజా విభకుమ్భవిభ్రమహరౌ గుర్వీ నితమ్బస్థలీ
[4]వాచో హారి చ మార్దవం యువతిషు స్వాభావికం మణ్డనమ్. 5

ఉ. తమ్ముల నేలుకన్నులు సు♦ధానిధిఁ బోలుమొగంబు మత్తభృం
గెచ్చుకొప్పు కన♦కద్యుతి మీఱుమెఱుంగు కుంభికుం
భమ్ముల నవ్వు గుబ్బచను♦బంతులు గొప్పపిఱుందు తేనియల్
చిమ్మెడుముద్దుబల్కులును ♦ జేయనిసొమ్ములు సుందరాంగికిన్

1 కుమారీణా మేతైః. 2 వలితైః. 3 వికాసి. 4 వాచాం హారి.



చంద్రమండలముంబోలుమోమును, కమలములను గేలిసేయఁగల నేత్రములును, బంగారును మించినమేనిసొరను, తుమ్మెదలను గెల్వఁజాలుకేశసమూహమును, ఏనుఁగుకుంభముల సొంపుమీఱెడి స్తనములును, లావుపిఱుఁదులును, మిక్కిలి తిన్ననైన పలుకులును జవరాండ్రకుఁ బుట్టుకతోడవచ్చెడి యలంకారములు.

అవ. ముద్దరాలియొక్క సొగసులు రమ్యము లని వర్ణింపుచున్నాడు.—

స్మితం కిఞ్చి[1]న్ముగ్ధం సరలతరలో దృష్టివిభవః
పరిస్పన్దో వాచా మభినవవిలాసోక్తిసరసః,
గతానా మారమ్భః కిసలయితలీలాపరికరః
స్పృశన్త్యా స్తారుణ్యం కిమివ న హి రమ్యం మృగదృశః. 6

ఉ. ఇంచుక ముద్దులేనగవు ♦ లింపగునవ్యవిలాససూక్తు ల
భ్యంచితలోలదృష్టియు న♦వారుణపల్లవమండలంబు ని
ర్మించు సలీలయానములు ♦ మేలుగ యౌవనలక్ష్మితోడ వ
ర్తించుమృగాక్షిచందము ల♦తిప్రముదంబు ఘటింపఁ జాలవే.

మోమునందలి చిఱునగవు, చక్కనైన చంచలదృష్టి, క్రొత్తలైన సరసంపుఁబలుకులు పలుకుట, ఒయ్యారపుటారంభదశయగు నడకలతీరు, వీనిలోఁ బ్రాయమున నుండుమృగాక్షి కేది రమ్యముగానుండదు ? అన్నియు రమ్యములుగానే యుండును.

అవ. కన్నులు మొదలగు పంచేంద్రియములకును మనస్సనెడి యాఱవయింద్రియమునకును విషయీభూతంబు లగుపదార్థములెల్ల నొకయంగనయందే యున్నవి యని ప్రశ్నోత్తరముగా వర్ణింపఁబడియున్నది.—

ద్రష్టవ్యేషు కి ముత్తమం మృగదృశః ప్రేమప్రసన్నం ముఖం
ఘ్రాతవ్యే ష్వపి కిం తదాస్యపవనః శ్రావ్యేషు కిం తద్వచః,
కిం స్వాద్యేషు తదోష్ఠపల్లవరసః స్పృశ్యేషు కిం తద్వపుః
ధ్యేయం కిం నవయౌవనే సహృదయైః సర్వత్ర తద్విభ్రమః 7

సీ. చూడంగఁ దగినవ♦స్తువులందు ఘన మెద్ది,
తుల లేక తగువెలం♦దుల మొగంబు

1 ద్వక్త్రే.

వలపు గైకొనఁదగు ♦ వానిలో నెయ్యది,
మగువవదనాబ్జ♦మారుతంబు
వీనుల కింపైన♦వానియం దెయ్యది,
కోమలాంగులముద్దు♦గులుకుపలుకు
తనువు సోఁకిన సుఖం ♦ బొనరించు నెయ్యది,
మెలఁతల సొబగైన ♦ మేనుదీవ
తే. యతిమధుర మెద్ది కాంతాధ♦రామృతంబు
సరసజనులకుఁ జింతింపఁ ♦ జాలు నెద్ది
పువ్వుఁబోఁడుల వెలలేని ♦ జవ్వనంబు
వెలయు నెల్లెడఁ బడఁతుల♦విభ్రమములు.

రసికులగువారు ప్రాయమున నుండునప్పుడు చూడఁదగినదియేది? (అనిప్రశ్న.) లేడికంటి యగుజవరాలి ముద్దుగులుకు తేటయైనమోము. (అనియుత్తరము.) దీనిచే నేత్రేంద్రియతృప్తికరం బగురూప మనువిషయము చెప్పఁబడినది. వాసనచూడఁదగిన వానిలో నుత్తమమేది? (అనిప్రశ్న.) ఆమచ్చకంటికమ్మనితావియే. (అనియుత్తరము.) దీనిచే నాసికేంద్రియవిషయము చెప్పఁబడినది. వినఁదగినవానిలో శ్రేష్ఠమైనదేది? (అని ప్ర.) ఆచిలుకలకొలికియొక్క పలుకులె. (అని యుత్త.) దీనిచే శ్రోత్రేంద్రియవిషయము సూచితంబయ్యె. పానముచేయఁదగినవస్తువులలో నుత్తమద్రవ్యమేది? (అని ప్రశ్న.) ఆముగుదయొక్క కెమ్మోవిచిగుళ్లతియ్యనిపానమే. (అని యుత్త.) దీనిచే జిహ్వేంద్రియవిషయము చెప్పఁబడియె. తాఁకఁదగినవానిలో మేలైనది యేది? (అని ప్రశ్న.) మెలఁతల మెత్తనిమేనుదీఁగయె. (అని యుత్త.) దీనిచే త్వగింద్రియవిషయము చెప్పఁబడియె. ఎల్లప్పుడు మనసునఁ జింతింపఁదగిన దేది? (ప్రశ్న.) ఆయంగనల తళుకుఁబెళుకులె. (అని యుత్త.) దీనిచే మానసేంద్రియవిషయంబు చెప్పఁబడియె. లోకంబున నుత్తమవిషయాభిలాషగలవా రుత్తమస్త్రీసంభోగమే చేయవలయును.

అవ. స్త్రీలకు లోఁబడనిపురుషుఁడు లేఁడని చెప్పుచున్నాఁడు.—

శ్లో. ఏతా శ్చలద్వలయసంహతి మేఖలోత్థ
ఝం[illegible]రనూపురరవాహృతరాజహంస్యః,
కుర్వన్తి కస్య న మనో వివశం తరుణ్యో
విత్రస్తముగ్ధహరిణీ [1]సదృశైః కటాక్షైః.

1 సదృశాక్షిపాతైః.



మ. కరచంచన్మణికంకణక్వణరణ♦త్కాంచీగుణస్వర్ణనూ
పురనాదాహృతరాజహంసరమణుల్ ♦ పూర్ణేందుబింబాననల్
ధర నెవ్వానిమనంబు సేకొనరు ము♦గ్ధత్రస్తవల్గన్మృగీ
తరళాలోకనతుల్యవిభ్రమదృగ♦న్తస్తోమపాతంబులన్.

చేతికడియములయొక్కయు, నడుమునందలి యొడ్డాణములయొక్కయు, కాళ్ల యందెలయొక్కయుఁ గలరవములచే రాయంచల నోడించినయతివలు మిక్కిలి బెదిరిన లేళ్లచూపులంబోలు తమక్రీఁగంటిచూపులం బర్వఁజేసి యీపుడమియందలి యేపురుషునిమనసును లోఁబఱచుకొనఁజాలరు? (స్త్రీలు పురుషుల నన్నితెఱఁగులచేతను వశపఱచుకొనఁగలరనుట)

కుఙ్కుమపఙ్కకళఙ్కితదేహా
గౌరపయోధరకమ్పితహారా,
నూపురహంసరణత్పదపద్మా
కం న వశీకురుతే భువి రామా. 9

చ. గొన బగుమేన సంకుమద♦కుంకుమపంక మెసంగ సిబ్బెపుం
జనుగవ రత్నహారములు ♦ సారె బెనంగఁ బదాంబుజంబులన్
మొనసినగిల్కుటందియల♦మ్రోఁతె చెలంగ ననంగవైభవం
బెనయఁగఁ గుల్కుకల్కిసొబ ♦ గెవ్వనిఁ దా వలపింప దిమ్మహిన్.

కుంకుమపువ్వుతోఁగూడిన మైపూఁతపూసికొని, బంగరువన్నెగలగుబ్బలపై ముత్తెపుసరము లదురుచుండ, తమ్మిరేకులఁబోలుకాలియందెలు ఘల్లుఘల్లుమని మ్రోఁతలు మ్రోఁగుచుండ నతివలకుఁ బుడమియందుఁ బురుషులెవ్వరు వశులుగాక యుందురు? జితేంద్రియులైనను మగువలు తమసొగసులచే లోఁబఱచుకొందురు.

అవ. అబలలు సబలలేయని వారినేర్పును వర్ణించుచున్నాఁడు.—

నూనం హి తే కవివరా విపరీతవాచో
యే నిత్యమాహు రబలా ఇతి కామినీ స్తాః,
యాభి ర్విలోలతరతారకదృష్టిపాతైః
శక్రాదయోఽపి విజితా స్త్వబలాః కథం తాః. 10

చ. అతివలఁ జూచి వీ రబల ♦ లంచు వచించు మహాకవీంద్రు లు
ద్ధతవిపరీతవాదు లిది ♦ దబ్బర గాదు విలాసినీసమం

చితతరళాక్షీపాతముల ♦ చే గెలువంబడి రింద్రముఖ్యులు
ధృతి నటువంటివా రబల ♦ లేగతి నైరి తలంచి చూడఁగన్.

జనరాంద్రనుజూచి వీరు బలములేనివారని యెల్లప్పుడు వర్ణించెడికవులు ప్రత్యక్షమునకు విరుద్ధముగా మాటాడువారు. ఇదినిక్కము. స్త్రీలు చంచలములగు తమ ప్రగ్డుల నిట్టటు త్రిప్పుటచేత నే సర్వరాక్షససంహారము గావించిన యింద్రాదులనుగూడఁ గెల్చిరి. అట్టికామిను లెట్లు అబలలని చెప్పఁదగును. కావున వారు దుర్బలులని చెప్పు కవులు మాటలపటిమలేనివారుగాని వా రెన్నటికిని అబలలుగారు.

అవ. మన్మథుఁడు కాములకు బనివాఁడని చెప్పఁబడుచున్నది.—

నూన మాజ్ఞాకర స్తస్యాః సుభ్రువో మకరధ్వజః,
యత స్తన్నేత్రసంచారసూచితేషు ప్రవర్తతే. 11

క. నారీజనముల కాజ్ఞా
కారి యగుభటుండు మరుఁడు ♦ గాఁబోలుఁ జుమీ
వారికటాక్షము సోఁకిన
వారియెడన వాఁడిఁ జూపి ♦ వర్తించుఁ గదా.

మరుఁ డతివయొక్క విధేయుఁ డగుసేవకుఁడేమో, కావుననే యతివలు కంటిచూపుచేఁ జూపఁబడినవారికడకుఁ బోవుచుండును. లోకంబున ప్రభువుపొమ్మన్నచోటికి బనివాఁ డేగుచుండును. అట్లె మరుఁడు కాంతలు దృష్టితో గనఁబఱచిన వారిమీఁదికి బోవుచుండునుగావున నతివల కితఁడు బనికాఁడై యుండనోపును. కామినీజనంబు క్రీఁగంటిచూపులు పడినమాత్రముననే పురుషులు మన్మథునిబారిఁదగులుదురు.

అవ. ఒకకామియొకానొక కాంతనుశ్లాఘించునట్లు శ్లేషమూలమున దానిని సంబోధించువిధంబు నీరెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.—

కేశాః సంయమినః శ్రుతే రపి పరం పారంగతే లోచనే
అన్తర్వక్త్ర మపి స్వభావశుచిభిః కీర్ణం ద్విజానాం గణైః,
ముక్తానాం సతతాధివాసరుచిరౌ వక్షోజకుంభా వివౌ
విత్థం తన్వి వపుః ప్రశాన్త మపి తే రాగంకరో త్యేవ నః. 12

ఉ. [illegible]ఁ గన్నుదోయి శ్రుతి ♦ పారఁగ మెంతయు సంయముల్ కురుల్
భాపశుచిద్విజప్రకర ♦ భాజన మెన్న ముఖాంతరంబు ము
క్తావళిరమ్యముల్ కుచము ♦ లక్కట యిట్లు ప్రశాంత మయ్యు రా
జీవదళాక్షి మేను విర ♦ చించుచు నున్నది మాకు రాగమున్,



ఓకాంతా! నీకేశములు సంయాములు (చక్కనినియమంబుగలవి). నీకన్నులో శ్రుతిపారంగతములై యున్నవి (ఉపనిషద్విచారము చేయునవిగనున్నవి). నీనోటిరంధ్రమును స్వభావశుద్ధద్విజగణములతోఁ గూడియున్నది (చక్కని నడతగల బ్రాహ్మణగణములతోఁ గూడియున్నది). ఈనీకుచకుంభములును ముక్తుల కెల్లప్పుడునికియై యున్నవి (జీవన్ముక్తుల కెల్లప్పుడు తావరమై వెలయుచున్నది). ఓసన్ననిమైదీఁగగలదానా! నీమే నిట్లు శాంతమైయున్నను (వైరాగ్యసాధనసంపత్తిగలదిగనున్నను) మాకు రాగమునే (సంభోగాభిలాషనే) కల్గించుచున్నది. ఇది యొక్కవింత గదా (శాంతులకడఁజేరి వారికి వైరాగ్యము గలుగవలసియుండఁగా, సంభోగాభిలాష గలిగించుట యనునది విరోధము).- ఓతన్వీ! నీనెఱికురులు ముడివేయఁబడియున్నవి. నీకన్నులు చెవితుద నొందుచున్నవి. నీవదనంబునఁ దెల్లనిపల్వరుస లున్నవి. నీగుబ్బపాలిండ్లు ముత్తెపుసరులతో నెల్లప్పుడు వెలయుచున్నవి. నీశరీర మిట్లు తేటదనము గలిగియుండుటచే మాకు రాగమును గలిగించుట వింతగాదు. అని పరిహారము.

ఈశ్లోకమున స్త్రీశరీరము శాంతమయ్యు రాగజనకంబుగా నున్నదనుటచే విరోధము. అది పైఁజెప్పినతీరున నాభాసితమగుటచే విరోధాభాసాలంకారము సంయమి, శ్రుతి, ద్విజాదిపదములకు శ్లేషము చెప్పుటచే రెంటికిని సంకరము.

ముగ్ధే ధానుష్కతా కేయ మపూర్వా త్వయి దృశ్యతే,
యయా విధ్యసి చేతాంసి గుణై రేవ న సాయకైః. 13

క. శరములచే ఛేదింపక, నిరతముఁ జేసెదవు హృదయ ♦ నిర్భేదము భా
సురగుణములచే నద్భుత, కరచాపప్రౌఢి నీకె ♦ కలదు లతాంగీ.

ఓ ముద్దరాలా! నీయెడ క్రొత్తదైనవిలుకానితనము గన్పట్టుచున్నది లోకంబునఁ బ్రోడలగు విలుకాండ్రు చక్కఁగాఁ గనఁబడులక్ష్యవస్తువులనే బాణములతోఁ గొట్టుదురు. నీవన్ననో ముగ్ధవయ్యుఁ (మూఢవయ్యు; అందగత్తెవయ్యు) గంటికిఁ గనఁబడని లక్ష్యములగు మనస్సులను గుణములచేతనే (అల్లత్రాటిచేతనే; సౌందర్యాది గుణములచేతనే) గొట్టుచున్నావు. ఇది వింతగదా (అనఁగా నీవు నీసౌందర్యాదిగుణంబులచే మామనస్సులను ఆకర్షించుచున్నావు అని సమాధానము).

సతి ప్రదీపే [1]సత్యగ్నౌ సత్సు [2]తారారవీందుషు,
వినా మే మృగశాబాక్ష్యా తమోభూత మిదం జగత్ 14

ఆ. పెక్కుదివియ లున్న ♦ జక్కవచెలి యున్న
రిక్కరాయఁ డున్నఁ ♦ జుక్కలున్నఁ

1 సత్యర్కే. 2 తారామణీందుషు.

జిన్ని లేడిచూడ్కి ♦ చేడియ నెడఁబాయు
నప్పు డంధకార ♦ మయ్యె జగము.

పగటిపూట వెలుఁగు నిచ్చుటకు సూర్యుఁడును, రాత్రులందు చంద్రుఁడు, నక్షత్రములు, అగ్నిహోత్రుఁడు, దీపము మొదలగు వస్తువులున్నను, ఆలేడిపిల్ల కన్నులంబోలు కన్నులుగల యామగువ లేమిచే నీజగమెల్ల నిరులు గ్రమ్మియున్నట్లే తోఁచుచున్నది. ఆకాంతయే నాకంటికి వెలుతురు నిచ్చినది కావున నది లేక నేను జడుఁడనై యున్నాను అని యొకకాముకుఁడు తనచెలికానితోఁ జెప్పుకొనెను.

ఉద్వృత్తః స్తనభార ఏష తరళే నేత్రే చలే భ్రూలతే
రాగాధిష్ఠిత మోష్ఠపల్లవ మిదం కుర్వన్తు నామ వ్యథామ్,
సౌభాగ్యాక్షరపఙ్క్తికేవ లిఖితా పుష్పాయుధేన స్వయం
మధ్యస్థాఽపి కరోతి తాప మధికం రోమావళిః కేన సా. 15

చ. గరువపుఁజన్నులుం బెళుకుఁ♦గన్నులు నిక్కడ లేనికన్బొమల్
మురియుచు నెఱ్ఱవాఱుజిగి♦మోవియుఁ దాపముఁ జేయఁగాఁదగున్
స్మరలిఖితోరుభాగ్యలిపి♦జాల మనం దగి మధ్యవర్తియై
పరఁగినరోమరాజియును ♦ బాయక తాపముఁ జేయ న్యాయమే.

ఈ యుద్వృత్తమయిన (గర్వించిన అనిబాహ్యార్థము. గుండ్రనైన అని అంతరార్థము.) చనుల బరువును, ఈచపలములైన (నిలుకడలేని-బా. కదలుచుండు-అంత.) ఈచంచలములయిన కనుబొమలును, రాగములుగల (మచ్చరముగలదగు అని బా. ఎఱుపుగల అని అంత.) పెదవియు వ్యథను గలిగించినను గలిగింపనీ. మన్మథుండు స్వయముగా వ్రాసిన సౌభాగ్యమును దెల్పునక్షరపంక్తియో యనఁదగిన యీనూఁగారు మధ్యస్థమయినను (తిన్ననిదై యున్నను-బా. నడుమనున్నను-అంత.) మీఁదు మిక్కిలిగాఁ దాపంబు గలిగించుచున్నది. ఏకారణముచేతనో తెలియకున్నది లోకంబున గర్వచాపలద్వేషాదిగుణములు గలవారు పరులకు హానిచేయుట సహజమే. నెమ్మదిగలవాఁడు గూడ నొరులనుబాధించుట యాశ్చర్యకరంబుగా నున్నది. నీచనుల యుబ్బును, అదరుపాటును, బెళుకుకనుఁజూడ్కులును, నీకనుబొమ్మలలీలలును, నీయెఱ్ఱకెమ్మోవిచిగురును మనస్సు వ్యథను గలిగించుచున్నవి. వీ టన్నిటికంటె నెక్కువగా మరుఁడు వ్రాసిన యక్షరములబంతియో యనఁదగు నీనూఁగారు నన్ను మదనానిలసంతప్తునిఁ జేయుచున్నది. నీయెడ మరులుగలిగి, నిన్నుఁబొందుటకు వీలుగామిచే న న్నీయంగములెల్ల వెతలఁ ద్రోయుచున్నవి. నన్ను దయతోఁ జూచి నీతోడిపొందును గ్రహింపుము.



ముఖేన చన్ద్రకాన్తేన మహానీలైః శిరోరుహైః,
కరాభ్యాం పద్మరాగాభ్యాం రేజే రత్నమయీవ సా. 16

తే. మిగుల శశికాంతమైన నె♦మ్మోముచేత
నెఱి మహానీలరుచులైన ♦ నెఱులచేత
జలజరాగము లయినహ♦స్తములచేత
రత్నమయ మనఁ గామినీ♦రత్న మమరె.

చంద్రకాంతమణిరూపమైన మోమును, గొప్పనీలములరూపుదాల్చినకురులును, పద్మరాగమణిరూపములైన కరంబులు గలది యగుటంజేసి, యీచెలువ రత్నమయమై యున్నట్లు కానిపించెను. ఆసుందరియొక్క మోము చందురునిమాడ్కి మనోహరముగను, నెఱికురులు మిక్కిలి నల్లవిగను, హస్తములు తామరపూవులమాడ్కి నెఱ్ఱగను నున్నవి.

గురుణా స్తనభారేణ ముఖచన్ద్రేణ భాస్వతా,
శనైశ్చరాభ్యాం పాదాభ్యాం రేజే గ్రహమయీవ సా. 17

క. గురు వగుకుచభారంబును
సరసకళాభాస్వదాస్య♦చంద్రుండు శనై
శ్చరము లగుచరణములుఁ గల
కరిగమన దనర్చె నౌర ♦ గ్రహరూప యనన్.

స్తనభారమనెడి గురువును, వెలుఁగుగలవాఁడగు ముఖమనెడి చంద్రుఁడును, శనైశ్చరము లగుపాదంబులును గలది యగుటవలన నాసుందరి గ్రహమయి యుండునట్లు మెఱయుచుండెను. ఆమగువయొక్క మోము చంద్రునివలెను, స్తనములు మిక్కిలి బరువు గలవిగను, పాదములు తిన్ననినడక గలవిగాను నుండెను.

తస్యాః స్తనౌ యది ఘనౌ జఘనం చ హారి
వక్త్రం చ చారు తవ చిత్త కి మాకులత్వమ్,
పుణ్యం కురుష్వ యది తేషు త వాస్తి వాఞ్ఛా
పుణ్యై ర్వినా నహి భవన్తి సమీహితార్థాః. 18

చ. సుదతిపయోధరంబు లతి♦సుందరముల్ జఘనంబు రమ్య మా
వదనము హృద్య మంచుఁ జల♦నర్తన మేటికి నీకుఁ జిత్తమా
కదలక వానిపై దలఁపు ♦ గల్గిన బున్నెము లాచరింపు మిం
పొదవ లభించునే సుకృత♦యోగము లేక సమీహితార్థముల్.

ఆనాతియొక్క గుబ్బలు గొప్పవిగా నున్న నేమి? ఆయుగ్మలిపిఱ్ఱులు మనోహరంబుగా నున్న నేమి ? ఆయతినెమోము చక్కనిదిగ నున్న నేమి? ఓమనసా ! నీకేల యీకలవరపాటు ? నీకు వానియందుఁ గోర్కిగలదేని, తపస్సు, దానము మొదలగుపుణ్యకార్యములను జేయుము దానధర్మాదులంజేయక కోరినకోర్కి లబ్బునే. జ్యోతిష్టోమాదియాగంబుల నొనరించువారికి రంభాదితెఱగంటియన్నువలసంభోగ మబ్బినట్లు, ఏదియో పుణ్యవిశేషమున్న నేకాని యోమనసా ! నీ కట్టియుత్తమాంగనయొక్క సంభోగము దొరకనేరదు.

అవ. సుందరస్త్రీలవిలాసమహిమను వర్ణింపుచున్నాఁడు.—

ఇమే తారుణ్యశ్రీనవపరిమళాః ప్రౌఢసురత
ప్రతాపప్రారంభాః స్మరవిజయదానప్రతిభువః,
చిరం చేతశ్చోరా అభినవవికారైకగురవో
విలాసవ్యాపారాః కిమపి విజయన్తే మృగదృశామ్. 19

చ. కనఁదగు నిండుజవ్వనపు ♦ గల్మికి దావులు ప్రౌఢసంగమం
బునకు నుపక్రమక్రియలు ♦ పుష్పధనుర్జయదానదక్షవా
ఙ్మనసిజచిత్తహారులు వి♦కారనిదానము లైనకామినీ
జనులవిలాసకృత్యములు ♦ సంతతరమ్యతరంబు లెన్నఁగన్.

లేడికన్నులంబోలు కన్నులుగల చెలువలయొక్క యీశృంగారచేష్టలు జవ్వనముచేఁ గడు మెఱయు ననియు, విస్తారమగు మరుకేళి సల్పుటయందుగల నేర్పునకుఁ బ్రారంభదశను దెలుపుననియు, మదనునికి గెల్పునొసఁగుటకుఁ బూటకాఁపులును, విడువక కాముకులడెందములను జూఱగొనునవియు, క్రొత్తక్రొత్తసింగారపు వికారములను బాగుగ నేర్పఁగలవియునై యింతింతనరానిమహిమతోఁగూడి వెలయుచున్నవి.

అవ. కామినులయం దెక్కువ మోహము గలవానియొక్క సర్వస్వమును వా రపహరింతురని చెప్పుచున్నాఁడు.—

[1] ప్రణయమధురాః ప్రేమోద్గారాః రసాశ్రయతాం గతాః
ఫణితిమృదులా ముగ్ధప్రాయాః ప్రకాశితసమ్మదాః,
ప్రకృతిసుభగా విస్రమ్భార్ద్రాః స్మరోదయదాయినో
రహసి కిమపి స్వైరాలాపా హరన్తి మృగీదృశామ్. 20

1 "ప్రణయమధురాః ప్రేమోద్గాఢారసాదలసాస్తథా, ఫణితమధురాముగ్ధప్రాయాః ప్రకాశితసమ్మదా, ప్రకృతిసుభగా విస్రమ్భార్ద్రాః స్మరోదయదాయినో, రహసి కిమపి స్వైరాలాపాహరన్తి మృగీదృశామ్."



మ. ప్రణయశ్రీమధురంబు లుజ్జ్వలరస♦ప్రాచుర్యముల్ ప్రేమభా
షణముల్ దర్శితహర్షముల్ రుచిరవి♦శ్వాసార్ద్రముల్ హృద్యముల్
ఫణితిశ్లాఘ్యము లంగజప్రభముల్ ♦ ప్రాణేశ్వరీనర్మభా
షణముల్ నానుదిఁ గొల్లలాడెడి రహ♦స్యక్రీడలం దెప్పుడున్.

లేడికన్నులమాడ్కిఁ గదలు కన్నులుగలయంగన లేకతంబునఁ జనువుతో మాటాడుమాటలు ప్రేమచేఁ దియ్యనివియు, అనురాగమును వెలువరించునవియు, శృంగారరసమున కాదరులైనవియు, మాటాడురీతిచే మధురములును, స్పష్టములు గానివియు, నిబ్బరంపుసంతసమ్మును వెలిపుచ్చునవియు, స్వభావముచేతనే సొంపులును, నమ్మికచే సరసములునై, మన్మథవికారము గలిగించునవియునై కాముకులయాసద్ధనమును దోఁచుకొనుచున్నవి.

## సంభోగవర్ణనము.

అవ. శృంగారము సంభోగశృంగారమని, విప్రలంభశృంగారమని ద్వివిధము. కవి సంభోగశృంగారమును మీఁద సవిస్తరంబుగా వర్ణించువాఁడై, మొదట నొక శ్లోకముచే విప్రలంభశృంగారమును వర్ణింపుచున్నాఁడు.—

విశ్రమ్య విశ్రమ్య వనే ద్రుమాణాం
ఛాయాసు తన్వీ విచచార కాచిత్,
స్తనోత్తరీయేణ కరోద్ధృతేన
నివారయన్తీ శశినో మయూఖాన్. 21

చ. విరహకృశాంగి యైనఘన♦వేణి యొకర్తు వనంబులోపలం
దరువులనీడలందు నుచి♦తంబుగ మాటికి విశ్రమించి బం
ధురగతి సంచరించెఁ జను♦దోయిని బయ్యెదకొంగుఁ గేలఁ దా
వెరవుగఁ బూని యగ్గలపు♦వెన్నెలకాఁకఁ దొలంగఁ జేయుచున్.

ఒకానొకకాంత ప్రియవిరహముచేఁ జిక్కినమేను గలదై, యొకవనంబునఁ బ్రొద్దుపుచ్చ వచ్చి యచ్చటఁగాయుచుండు పండువెన్నెలతాపంబు సైరింపఁజాలక తన పైఁటకొంగు నెత్తి యావెన్నెలలు దనపైఁ బడకుండునట్లు నివారించుచుఁ జెట్లయొక్క దట్టములైన నీడలయందు మాటి మాటి కలసటఁ దీర్చుకొనుచుఁ [illegible]గుచుండెను.

అవ. కవి సంభోగశృంగారమును వర్ణింపఁ బూని యందు బాహ్యము, ఆభ్యంతరము అను ద్వివిధశృంగారములలో మొదటిది యగు

ఆలింగనాదిరూపమైన బాహ్యశృంగారమును రెండుశ్లోకములచే వర్ణించుచున్నాఁడు.—

ఆదర్శనే దర్శనమాత్రకామా
దృష్ట్వా [1]పరిష్వఙ్గసుఖైకలోలాః,
ఆలిఙ్గితాయాం పునరాయతాక్ష్యా
మాశాస్మహే విగ్రహయోరభేదమ్. 22

ఉ. బాలిక నన్నుఁ గన్గొనని♦పట్టున దర్శనమాత్ర మబ్బినం
జాలు నటంచుఁ గోరె మఱి♦చక్కఁగఁ గన్నుల నన్నుఁ జూచి ప్రో
యాలు కవుంగలింపవలె ♦ నంచుఁ దలంచెఁ దమిం గవుంగిటన్
మేలుగఁ జేర్చుకొన్ననిరు♦మేనులు నొక్కటి సేయఁగోరితిన్.

ఒకచెలువను జూడకుండునంతవఱకు దానిదర్శనమైన మనకబ్బునాయని కోరుచుందుము. చూచినతర్వాత దానిబిగికౌఁగిలింతలయందే యాస గలిగియుందుము. ఆమెచ్చెకంటి నాలింగనము చేసికొన్నతర్వాత మారెండుమేను లెప్పటికిని వీడకుండవలెనని కోరుచుందుము.

అవ. పుష్పమాలికలు, అగురు, గంధము మొదలగువానిని ధరించుటతోఁ గూడఁ జేసిన ప్రియాసంగమమే స్వర్గసుఖదమని వర్ణించుచున్నాఁడు.—

మాలతీ శిరసి జృమ్భణోన్ముఖీ
చన్దనం వపుషి కుఙ్కుమావిలమ్,
వక్షసి ప్రియతమా మనోహరా
స్వర్గ ఏష పరిశిష్ట ఆగతః. 23

చ. తలపయి మాలతీకుసుమ♦దామము నెమ్మెయిఁ గుంకుమంబుతోఁ
గలసినకమ్మతావి విరి♦గందపుఁబూత వెడందఱొమ్మునం
దలికులనీలకుంతలమ♦దాలసనీలసరోరుహాక్షియుం
గల్గుట నింద్రభోగ మనఁ♦గా దగదే మఱి వేఱె యున్నదే.

ఏమానవుఁ డరవిరిసిన జాజిపూవులమాలను ధరించి, కుంకుమపువ్వుతోఁ జేర్చిన చందనము మేని కలఁదుకొని మనోహర యగుప్రేయసిని ఱొమ్మునఁ జేర్చుకొనుచున్నాఁడో వాఁ డీలోకంబుననే స్వర్గసుఖంబు ననుభవించుచున్నాఁడు.

1 పరిష్వంగరసైక,



అవ. ఇఁక నాభ్యంతరశృంగారమును వర్ణించుచున్నాఁడు.—

ప్రాఙ్మా మేతి మనాగనాగతరసం జాతాభిలాషం తతః
సవ్రీడం తదను శ్లథీకృతతను ప్రత్యస్తధైర్యం పునః,
ప్రేమార్ద్రం స్పృహణీయనిర్భరరహః క్రీడాప్రగల్భం తతో
నిశ్శఙ్కాఙ్గవికర్షణాధికసుఖం రమ్యం కులస్త్రీరతమ్. 24

ఉ. ఆది మితాదరంబు తద♦నంతర మంచితరాగ మంత ల
జ్జోదయరమ్య మంత శిథి♦లోద్యమ మంత నితాంతధైర్యవి
చ్ఛేదము ప్రేమపూరము వి♦శేషవివిక్తవిహార మంత నా
హ్లాదకరాంగసంగము కు♦లప్రమదారత మల్పసౌఖ్యమే.

రతి గలుగకముందు వలదు వలదని యడ్డుబాటుతోఁ గూడినదియు, అనంతరముదయించినరాగము గలదియు, ఆపైని సిగ్గుతోఁ గూడినదియు, తరువాత వివశమైన శరీరము గలదియు, పిదప విడువఁబడినధైర్యము గలదియు, అనురాగముతో నిండినదియు, కమనీయమై గాఢానురాగయుక్తమైన ఏకాంతక్రీడచే ప్రౌఢమైనదియు, అంతనుండి జంకులేక కుచాద్యవమర్దనమువలన మించినసుఖముగలిగిన కులకామినీసురతమే మనోహరమైనది.

ఉరసి నిపతితానాం స్రస్తధమ్మిల్లకానాం
ముకులితనయనానాం కించిదున్మీలితానామ్,
ఉపరిసురతఖేదస్విన్నగణ్డస్థలానా
మధరమధు వధూనాం భాగ్యవన్తః పిబన్తి. 25

ఉ. అక్కున వ్రాలి కొప్పు విడి ♦ యల్లల నాడఁగఁ గన్నుఁదామరల్
చక్కఁగ మోడ్చి చొక్కి పురు♦షాయితసంజనితశ్రమంబునం
జెక్కుల ఘర్మబిందువులు ♦ చిందఁగ విం దొనరించుబోంట్ల మే
ల్చొక్కపుమోవితేనె చవిఁ ♦ జూతురు భాగ్యము గల్గునేర్పరుల్.

సిగవీడ నానందపారవశ్యమున మూసియు మూయనికనుదమ్ములతోఁ గూడి పురుషాయితక్రీడచేఁ జెక్కులుచెమర్ప ఱొమ్మున వ్రాలిన కామినుల యధరామృతమును పుణ్యవంతులు గ్రోలుదురు.

అవ. జ్ఞానపూర్వకముగాఁ జేయుసంభోగసుఖమే సఫలమని చెప్పుచున్నాఁడు.—

ఆమీలితనయనానాం [1]యః సురతరసోఽనుసంవిదం భాతి,
మిథునై ర్మిథోఽవధారిత మవితథ మిదమేవ కామనిర్వహణమ్.

తే. కన్ను లరమోడ్చి విహరించు♦చున్నవారి
సురతభోగంబు తెల్వితోఁ ♦ బరఁగెనేని
రమ్య మగు నిది కామని♦ర్వహణ మనుచు
నాయికానాయకులకు ని♦ర్ణయము గాదె. 26

సురతశ్రమమునఁ గన్ను లరమోడ్చినతరుణు లగు స్త్రీపురుషులు తెలివితోఁ గూడి యేసంభోగసుఖము ననుభవింతురో, ఆసుఖానుభవమే కామపురుషార్థమునకు సాఫల్యమని యారసజ్ఞు లగు స్త్రీపురుషు లొండొరులు నిర్ధారణ చేసియున్నారు.

అవ. స్త్రీపురుషుల కవస్థాభేదముచే నుచితముగామిని, దోషమును జెప్పుచున్నాఁడు.—

ఇద మనుచిత మక్రమశ్చ పుంసాం
య దిహ జరాస్వపి మాన్మథా వికారాః,
య దపి చ న కృతం నితమ్బినీనాం
స్తనపతనావధి జీవితం వా రతం వా. 27

చ. ఇది యుచితంబు గానిపని ♦ యిమ్మహిలో మగవారి కెంతయున్
మదనసుఖాభిలాషములు ♦ మానక యున్కి జరాభరంబునన్
గొదమమిటారిముద్దుచను♦గుబ్బలు జాఱినవెన్క బోంట్లకున్
మదనసుఖంబు జీవితము ♦ మాన్పఁడు తామరచూలి జాణయై.

ఈపురుషులు ముసలివా రయినపిదపఁగూడ మన్మథవికారంబు గలిగియుండుటన ట్లొనర్చుటయు, స్త్రీలు కుచములు జాఱిపోవునంతవఱకే బ్రతికియుండునట్లుగాని, సురతము సలుపునట్లు గాని యుండవలెనని యేర్పాటు చేయకపోవుటయు మిక్కిలి యనాగరికమైనదియు, న్యాయవిరుద్ధముగాను నున్నది.

అవ. సుఖానుభవమునకు జవ్వనము ముఖ్యమని మూఁడుశ్లోకములచే వర్ణింపుచున్నాఁడు.—

(దేశాంతరమునఁ గొల్వుగొల్చుప్రాయపువారివచనము.)
రాజం స్తృష్ణామ్బురాశే ర్నహి జగతి గతః కశ్చి దేవావసానం
కో వార్థోఽర్థైః ప్రభూతైః స్వవపుషి గళితే యౌవనే సానురాగే,

1 "యత్సురతరసోఽనుసంవిదం స్ఫురతే"



గచ్ఛామః సద్మ యావ ద్వికసితనయనేన్దీవరాలోకినీనా-
మాక్రమ్యాక్రమ్య రూపం ఝటితి న జరయా లుప్యతే ప్రేయసీనామ్.

శా. ఆశాసాగర పారమేరికిని శ♦క్యం బౌనె చేరంగ భో
గాశాయుక్తము జవ్వనంబు గళితం♦బైనన్ ధనం బేల భా
త్రీశా యింటికిఁ బోదుమే ప్రియవధూ♦హృద్యోల్లసద్రూపరే
ఖాశోభాతిశయంబు దుర్భరజరా♦క్రాంతంబు గాకుండఁగన్. 28

ఓరాజా! ఆశ యనునది సముద్రముంబోలినది. లోకంబున నాసముద్రపుదరిఁ జూచినవాఁ డొక్కఁడయినను లేఁడు. మాదేహమున జవ్వనంబు జాఱికయుండువన పుడే సుఖంబు లనుభవింపవలయును. యౌవనముడిగినపిదప నీయపారధనమున్న నేమి యుపయోగము? కావునఁ బుడమిఱేఁడా! విరిసినకలువలం బోలుకన్నులతోఁ జూచు మాప్రియురాండ్రయొక్క రూపంబు ముదిమిచేఁ జెడిపోకమునుపే మాయింట్లకుఁ బోయి సుఖంబుల ననుభవింప నుత్తరు వొసఁగుము.

అవ. సర్వానర్థములకు జవ్వనము మూలమని చెప్పుచున్నాఁడు.—

శ్లో. రాగస్యాగార మేకం నరకశతమహాదుఃఖసంప్రాప్తిహేతు
ర్మోహస్యోత్పత్తిబీజం జలధరపటలం జ్ఞానతారాధిపస్య,
కన్దర్పస్యైకమిత్రం ప్రకటితవివిధస్పష్టదోషప్రబన్ధం
లోకేఽస్మి న్న హ్యనర్థవ్రజకులభవనం యౌవనా దన్య దస్తి.

చ. రతిపతిచేతివాలు ఘన♦రాగనివాసము నీతివైరి దు
ర్గతిశతదుఃఖమోహజని♦కారణముజ్జ్వలబోధతారకా
పతినిబిడాభ్రబృందము శు♦భప్రతిబంధము దోషసంగసం
గత మగుసేఁగి జవ్వనము♦కన్న జగంబున వేఱె యున్నదే. 29

యౌవన మనునది యాశకుఁ బ్రధానస్థానము. పెక్కు పాపములను, తీరని వ్యసనంబులను బొందుటకుఁ గారణమైనది. మోహమును గలిగించువిత్తనము. జ్ఞానమనుచంద్రునికి మొయిళులగుంపువంటిది. (మొయిళులగుంపు చంద్రమండలమును గ్రమ్మునట్లు జ్ఞానమును గ్రమ్మునది.) మరునికి విడువనినెచ్చెలి. పెక్కులైనపాపములను నిర్భయముగాఁ జేయించునది. మంచిపనులకుఁ బ్రతిబంధకమయినది. ఇట్లు చేటులకుఁ బుట్టినింటివంటిది జవ్వనమునకు మించినది మఱొక్కటి యీభూలోకమునను లేదు.

అవ. ఇట్టిసర్వానర్థమూల మయినయౌవనమున వికారమునొందనిపురుషుఁడు ధన్యుఁడని చెప్పుచున్నాఁడు.—

శృంగారద్రుమనీరదే ప్రసృమరక్రీడారసస్రోతసి
ప్రద్యుమ్నప్రియబాన్ధవే చతురవాఙ్ముక్తాఫలోదన్వతి,
తన్వీనేత్రచకోర పార్వణవిధౌ సౌభాగ్యలక్ష్మీనిధౌ
ధన్యః కోఽపి న విక్రియాం కలయతే ప్రాప్తే నవే యౌవనే. 30

ఉ. మారునికూర్మిచుట్టము స♦మంచితకేళిరసప్రవాహంబు శృం
గారమహీజనీరదము ♦ కంజముఖీజనదృక్చకోరరా
కారజనీశమండలము ♦ కాంతవచోమణివార్ధి యౌవనం
బారయఁ జెందుచో వికృతి ♦ నందనివాఁడె కృతార్థుఁ డిమ్మహిన్.

మేఘంబు వర్షించి చెట్లను పెంపొందించునట్లు, శృంగారరసమును బెంచునదియు, పాఱుచుండు క్రీడారసం బనెడి యుదకప్రవాహమువంటిదియు, మరుని కనుఁగుబందు వైనదియు (ప్రియబంధువుమాడ్కి మన్మథునికిఁ బ్రేమగూర్చినదియు), జాణపలుకు లనెడి ముత్తెములకు సంద్రముమాడ్కి నునికిపట్టును, చకోరపక్షులను బున్నమచందురుఁడు సంతోషపెట్టునట్లు తీఁగెబోఁడులకన్నుల కింపొదవునదియు, సౌందర్యసంపదకు నునికియు నైన యౌవనము దేహమున నెలకొన్నయప్పుడు పుణ్యాత్ముఁ డెవ్వఁడో యొక్కఁడు చిత్తవికారంబు నొందఁడుగాని తక్కినయందఱు చపలు లగుదురు.

అవ. యౌవన మనర్థమూలము గనుక, కామినులను విడిచినయెడల నాయౌవన మనర్థములకుఁ గారణముగాదు గదా యని శంకించి, మగువల విడుచుట కష్టమనిమూఁడుశ్లోకములచే వర్ణింపుచున్నాఁడు—

సంసారేఽస్మిన్నసారే [1]కునృపతిభవనద్వారసేవావలమ్బ
వ్యాసఙ్గధ్వస్తధైర్యం కథ మమలధియో మానసం సన్నిదధ్యుః,
యద్యేతాః ప్రోద్యదిన్దుద్యుతినిచయభృతో నస్యు రమ్భోజనేత్రాః
ప్రేఙ్ఖత్కాఞ్చీకలాపాః స్తనభరవినమన్మధ్యభాగా స్తరుణ్యః. 31

చ. జలజవిలోచనంబులును ♦ సన్నపుఁజందురకావిచీరలుం
గిలుకుమెఱుంగుఁ జన్నులును ♦ గొంచెపుగన్నులు రత్నకింకిణీ

1 "కునృపతిభవనద్వారసేవాకళఙ్కవ్యాసఙ్గవ్యస్తధైర్యం" అనుపాఠమున చెడ్డరాజువాఁకిళ్ళముందటఁ గొల్వు గొల్చుటచేతఁ గలిగిననిందను మోయుటచే మనసు చెదరి యుండువారు అని తాత్పర్యము.



కలరశనాగుణంబులును ♦ గల్గినకాంతలు గల్గ రేని గా
సిలి మతిమంతు లేటికి వ♦సింతురు రాజగృహాంగణంబులన్.

ఈ నిస్సారమయిన సంసారమునందుఁ జక్కఁగా నుదయించిన చంద్రుని కాంతి సమూహమువంటి కాంతిగలవలువలు దాల్చినవారును, కమలనేత్రలును, ఘణిల్లుఘణిల్లు మని రవణించు చిఱుగజ్జెలయొడ్డాణములు ధరించినవారును, గబ్బిగుబ్బల బరువుచేఁ గొంచెమువంగిన నడుముగలవారును నైన యీప్రమదలుందురేని నిర్మలమనస్సుగల పండితులు చెడ్డరాజుల వాఁకిళ్ళయందుఁ గొలువుకొలుచుటయం దలవాటుచే ధైర్యమువీడిన తమ మనసులనెట్లు ధరింపఁగలరు? (చెడుదొరల కొలువువలనిదుఃఖముచేఁ గలవరము నొందినవారయినను పురుషులు పైజెప్పినగుణములుగల స్త్రీలను బొందుటచేత నిలుకడగల మనస్సుకలవా రగుదురు.)

అవ. స్త్రీలపైనియాశ పురుషులను మ్రొక్కునట్లు చేయునని చెప్పుచున్నాఁడు.—

సిద్ధాధ్యాసితకన్దరే హరవృష[1]స్కన్ధావరుగ్ణద్రుమే
గఙ్గాధౌతశిలాతలే హిమవతః స్థానే స్థితే శ్రేయసి,
కః కుర్వీత శిరః ప్రణామమలినం [2]మ్లానం మనస్వీ జనో
య ద్విత్రస్తకురఙ్గశాబనయనా న స్యుః స్మరాస్త్రం స్త్రియః. 32

శా. గంగాధౌతశిలాతలంబు హరగో♦స్కంధప్రదేశాహతో
త్తుంగక్ష్మాజము సిద్ధసేవితగుహా♦స్తోమంబు శీతాచలో
త్సంగం బుండఁగ నెవ్వఁ డోపు నృపపా♦దంబుల్ దలం దాల్ప సా
రంగీశాబవిలోచనల్ మనసిజా♦స్త్రంబుల్ సతుల్ లేనిచోన్.

వెఱచిన జింకకూనలకన్నులం బోలిన కన్నులుగలయంగనలు మన్మథుని తూఁపులు గాకేని, సిద్ధులువసించెడి గుహలతోఁగూడి, ఈశ్వరునివాహనంబగు నందికేశుని దేహముచే విఱువఁబడినచెట్లచే వెలయుచు, గంగాజలముచేఁ బావనంబగు ఱాతిప్రదేశము గలిగియుండు నుపద్రవములేని హిమవంతముయొక్క ప్రదేశ మున్నప్పుడు, ఏధీరుఁడగు మానవుఁడు రాజులకు సాష్టాంగముగాఁ బ్రణమిల్లి తనశిరస్సును మలినమయి వాఁడునట్లుచేసికొనును? లోకంబున స్త్రీలు మన్మథవికారంబుఁ గలిగింపఁజాలనివారయినయెడల, మనుజులు సంసారములఁబాసి, హిమవంతమునకేగి తపస్సుచేయుచుందురు. అట్లుకాక మన్మథవికారమునకు వారు కారణభూతులైయున్నందుననే పురుషులు రాజులయడుగులకు మడుగులొత్తుచు వారిచుట్టును దిరుగుచుందురు.

1 "స్కన్ధావగాఢద్రుమే". 2 "మానం".

అవ. స్త్రీలే బంధహేతువులని చెప్పుచున్నాఁడు.—

సంసార! తవ పర్యన్తపదవీ న దవీయసీ,
అన్తరా దుస్తరా న స్యుర్యది తే మదిరేక్షణాః. 33

తే. అమితసంసార! నీదుప♦ర్యంతపదవి
గతి దలంప దవీయసి♦గాదు సూవె
యర్థి నీలోనఁ గడవంగ ♦ నలవిగాని
ఖంజరీటాయతాక్షులు ♦ గలుగరేని.

ఓ సంసారసముద్రమా! నడుమ దాఁట నశక్యలయినయతివ లుండిరేని, నీయావలిగట్టునకుఁ బోవుదారి యంతదవ్వుగాదు. ప్రమదలమూలమున నీసంసారమునకుఁ గట్టువడియుండవలసినదికాని, వారులేనిచో సంసారము విడుచుట్ల యంతకష్టము గాకయుండును.

—పక్షద్వయనిరూపణము.—

అవ. స్త్రీలయం దనురాగము గలుగు నిమిత్తము సంభోగశృంగారమును వర్ణించి మఱల వారిని వదలుట బుద్ధిమంతులకు నసాధ్యముగాన వందఱు వారియందే తగులుగలిగియుందురు. అట్టిసంసారులకు శ్రేయస్సు గలుగు టెట్లని యాక్షేపించి స్త్రీలను బ్రేమతోఁ జూచువారి కీలోక సౌఖ్యములును, స్త్రీలను వదలినవిరాగులకుఁ బరలోకసౌఖ్యములును గలుగునని తెలుపుటకై యనురక్తి, విరక్తి యను రెండుపక్షములను ఇంక నేడు శ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.—

దిశ వనహరిణేభ్యో వంశకాణ్డచ్ఛవీనాం
కబళ ముపలకోటిచ్ఛిన్నమూలం కుశానామ్,
[1]శకయువతికపోలాపాణ్డుతామ్బూలవల్లీ
దళ మరుణనఖాగ్రైః పాటితం వా వధూభ్యః. 34

చ. శిలమొన మూలముల్ చిదిమి ♦ చెన్నుగ వేణుకరీరకాంతిచే
లలితము లైనదర్భకబ♦ళంబులు లేళ్లకు నిమ్ము కానలోఁ
గలితశకాంగనావిపుల♦గండసుపాండుర నాగవల్లికా
దళముల గోళ్ళఁ ద్రుంచి వని♦తాతతి కైన నొసంగుమిమ్ములన్.

1 శుకయువతి.



ఓ మనుజుఁడా! నీవు పావనమయిన యరణ్యమున బెదరులేక దగ్గఱ కేతెంచిన జింకలకు వెదురుమొలకలవలెఁ బసరుగలదర్భలను కత్తెరతాళ్ళయంచులతో నఱికి మేఁత పెట్టుము. (విరక్తుఁడవేని యడవియందు వసింపుము అని భావము.) లేదా! శకదేశపు టతివలచెక్కిళ్ళవలె నంతట్లఁ దెల్లనైన తమలపాకులను నీయొజ్జనిగోళ్ళకొనలతోఁ జీల్చి యింతులకిమ్ము.) (అనురక్తుఁడవేనియింటనుండి స్త్రీలంగూడి విహరింపుముఅనుట.)

అసారాః సన్త్వేతే విరతివిరసా వాథ విషయా
జుగుప్స్యన్తాం యద్వా నను సకలదోషాస్పద మితి,
తథాఽప్యేతద్భూమౌ న హి పరహితాత్పుణ్య మధికం
న చాస్మిన్ సంసారే కువలయదృశో రమ్య మపరమ్. 35

చ. దురితనిదానముల్ సకల♦దోషగృహంబులు సారహీనముల్
పరిణతిఘోరముల్ విషయ♦పద్ధతు లెంతయుఁ గుత్సితంబు లి
ద్ధరను బరోపకారసుకృ♦తంబును బోలవు పుణ్యముల్ మనో
హరతరవస్తువుల్ గువల♦యాక్షులకన్నను గల్ల వెవ్వియున్.

ఈసంసారసుఖములు (శబ్దాదివిషయములు లేక పుష్పచందనవనితాదులు) సారహీనములుగానైనను, మొదట మనసున కింపుగానున్నను గొనను నీరసములుగానుండిన నుండుఁగాక. లేక చెరుపుల కన్నిటి కిరవని యందఱావిషయముల నేవగింతురు గాక. అయినను భువిని పరోపకారమునకంటె మించిన పుణ్యములేదు. ఈసంసారమునఁ గలువకంటులకంటె సొబగయినవస్తు వేదియులేదు.

అవ. పర్వతనితంబ స్త్రీనితంబములలో నేది యాశ్రయింపఁదగినదని యడుగుచున్నాఁడు.—

మాత్సర్య ముత్సార్య విచార్య కార్య
మార్యాః సమర్యాద మిదం వదన్తు,
సేవ్యా నితమ్బాః కిము భూధరాణా
ముత స్మరస్మేరవిలాసినీనామ్. 36

ఉ. ఆరయ మత్సరంబు విడ♦నాడి సమంచితకార్యనిశ్చయో
దారవిచారులై సరస♦త న్వచియింతురు గాక సజ్జనుల్
ధారుణి సేవ్యముల్ గిరిని♦తంబములో మఱి కాక మన్మథ
స్మేరవిలాసినీజనవి♦శేషనితంబములో తలంపఁగన్.

కార్యాకార్యముల నెఱుఁగఁగల యోపండితులారా! మీరు మచ్చరంబుమాని, శాస్త్రానుసారంబుగ నే నడుగఁబోవువానిలో నేది చేయఁదగినదో చెప్పఁడు. పర్వత నితంబములు (మధ్యభాగములు) ఆశ్రయింపవలెనా ? మదనవికారంబును చిఱునగవునుగల స్త్రీలనితంబములుః (కటిపశ్చాద్భాగములు) ఆశ్రయింపవలెనా ?

అవ. ఈసంసారమునఁ బండితులకు రెండువిధములుగాఁ గాలంబు గడచుచున్నది యని చెప్పుచున్నాఁడు.—

సంసారే స్వప్నసారే పరిణతితరళే ద్వే గతీ పణ్డితానాం
తత్త్వజ్ఞానామృతామ్భఃప్లవలులితధియాం యాతుకాలః కథఞ్చిత్,
నో చేన్ముగ్ధాంగనానాం స్తనజఘనఘనాభోగసంభోగినీనాం
స్థూలోపస్థస్థలీషు స్థగితకరతలస్పర్శలీలోద్యమానామ్. 37

శా. సారం బెక్కడలేక మిథ్య యగుసం♦సారంబునన్ మార్గముల్
బాఱం జూచిన రెండు పండితులకున్ ♦ బ్రహ్మానుసంధానయో
గారూఢత్వము రూపవద్యువతిర ♦ మ్యస్థూలమీనధ్వజా
గారన్యస్తకరారవిందకృతయో♦గ్యస్పర్శలీలాప్తియున్.

ఈయస్థిరమయిన సారములేనిసంసారమునందుఁ దిరుగుపండితులు పరబ్రహ్మవిచారమనెడి యమృతమునందు మునుంగుటయను తెప్పయందుఁ బొరలుచుండు తెలివిగలవారై కాలంబుపుచ్చెదరు. కాదేని గబ్బిగుబ్బలును, వెడఁదలగు పిఱుఁదులును గలవారగు చక్కని మగువల మరుగీములం దాశతోడఁ దమచేతులను దడవుచుండుటయందు మక్కువగలిగి కాలంబుపుచ్చెదరు. (సంసారమునఁ దత్త్వజ్ఞానమొక్కగతి. స్త్రీలనితంబములందుఁ జేతులనుంచికొని యుండుట రెండవగతి. ఈరెంటిలో మొదటిదగు తత్త్వజ్ఞానములేనపుడు, స్త్రీనితంబసేవనమే తత్త్వజ్ఞానమువలె సుఖదాయకమని భావము.)

ఆవాసః క్రియతాం గాఙ్గే పాపహారిణి వారిణి,
స్తనద్వయే తరుణ్యా వా మనోహారిణి హారిణి. 38

తే. అఖిలపాతకభయహారి ♦ యైనగాంగ
వారియందైన యువమనో♦హారి యగుచు
హారి యగుకల్కికుల్కుమి♦టారిచన్ను
దోయి యందైన వాసంబు♦సేయవలయు.

విరక్తుఁ డగువాఁడు సకలపాపంబులఁ బోఁగొట్టి పుణ్యములనొసఁగెడి గంగానదీతీరంబునఁ గాశిమొదలగుపుణ్యక్షేత్రములందు వసింపఁదగును. అట్లువసించి మోక్షము నొందవలయుననుట. లేదా, ముత్యాలహారములచే నొప్పెడిజవరాలిగబ్బిగుబ్బదోయియందు రమించి యిహలోకసౌఖ్యములం గుడువవలయు.



అవ. కవి తానే పైప్రశ్న కుత్తర మిచ్చుచున్నాఁడు.—

కి మిహ బహుభి రుక్తై ర్యుక్తిశూన్యైః ప్రలాపై
ర్ద్వయమిహ పురుషాణాం సర్వదా సేవనీయమ్,
అభినవమదలీలాలాలసం సున్దరీణాం
స్తనభరపరిభిన్నం యౌవనం వా వనం వా. 39

చ. కనుఁగొన యుక్తియుక్తములు ♦ గానివి మాటలు వేయు నేటికిన్
గొనబుగ రెండు మానవుల♦కున్ భజనార్హము లైనవస్తువుల్
వినుతనవీనచారుమద♦విభ్రమలాలససుందరీజన
స్తనభరభిన్నమై యమరు♦యౌవనమున్ వనమున్ వసుంధరన్.

ఆర్యులారా! పొందికలేకుండఁ జెప్పిన పలుతెఱంగులగు వట్టిమాటలతో నేమి యుపయోగము? ప్రపంచమున మానవులు జవ్వనంపుమచ్చరమువలని వేడుకతోఁ గులుకుచుండువారును, స్తనభారముచేఁ గొంచెము ముందుకు వంగినవారునైన చెలువల యౌవనమునైనను, వనంబునైనను సేవింపవచ్చును. (వైరాగ్యము గలుగనప్పుడు జవరాండ్రకు గొలువవలయును, వైరాగ్యముగలిగిన పదంపడి యరణ్యమున నుండవలయునని భావము.)

అవ. అతివయే సుఖదుఃఖములకుఁ బ్రధానహేతువు, మఱొక్కటికాదని చెప్పుచున్నాఁడు.—

సత్యం జనా వచ్మి నపక్షపాతా ల్లోకేషు సర్వేష్వపి తథ్య మేతత్,
నాన్య న్మనోహారినితమ్బినీభ్యో దుఃఖస్య హేతు ర్నహి కశ్చిదన్యః.

తే. తథ్యమ వచింతుఁ బక్షపా♦తమునఁ గాదు
నిఖిలజగములయం దిది ♦ నిక్కువంబు
తొయ్యలులకన్న రమ్యవ♦స్తువులు లేవు
వారలే కష్టములకెల్లఁ ♦ గారణములు. 40

ఓజనులారా! నేను పక్షపాతములేక నిక్కువముఁ జెప్పెదను. లోకంబులయం దన్నిటియందును ఇదే యథార్థమైనసంగతి. వైరాగ్యము గలుగనప్పుడు స్త్రీకంటె సుఖప్రదమైనది మఱియొక్కటిలేదు. విరక్తిగలిగినపిదప స్త్రీలకంటె దుఃఖహేతువు మఱొక్కటిలేదు.

## స్త్రీగర్హణము.

అవ. విద్వాంసుఁడును స్త్రీలనుజూచి మోహించుచున్నాఁ డని చెప్పుచున్నాఁడు.—

కాన్తే త్యుత్పలలోచ నేతి విపులశ్రోణీభ రే త్యుత్సుకః
పీనోత్తుఙ్గపయోధ రేతి సుముఖామ్భో జేతి సుభ్రూ రితి,
దృష్ట్వా ముహ్యతి మోద తేఽభిరమ తే ప్రస్తౌతి విద్వా నపి
ప్రత్యక్షాశుచిభస్త్రికాం స్త్రియ మహో మోహస్య దుశ్చేష్టితమ్.

మ. మలభూయిష్ఠపుఁ దోలుబొమ్మ యగుకో♦మ్మం జూచి విద్వాంసుఁడుం
బులినశ్రేణి మనోహర స్తని నవాం♦భోజాస్య నీలోత్పలా
క్షి లతాతన్వి యటంచు మత్తుఁ డగుహ♦ర్షించున్ రమించున్ భళీ
భళియంచున్ వినుతించు మోహవికృతుల్♦భావింపఁగాఁ జిత్రముల్.

లోకమున విద్వాంసుఁడుసైతము తనకంటికి బాగుగాఁ గనఁబడుచుండుతోలు బొమ్మవంటికాంతనుజూచి మోహించుచున్నాఁడు. మఱియానంద మొందుచున్నాఁడు. కోరఁదగినదియనియు, కలువకంటియనియు, వెడఁదపిఱుఁదుభారంబు గలదనియు, నుత్సాహముతోఁ గూడినగబ్బిగుబ్బలు గలదనియు, తమ్మివంటిమోము గలదనియు, సొగసు బొమలుగలది యనియుఁ గొనియాడుచు రమించుచున్నాఁడు. ఆహా మోహముయొక్క చెడ్డవ్యాపార మేమని చెప్పవచ్చును?

అవ. మూఁడుశ్లోకములచే స్త్రీ స్వరూపమును దూషింపుచున్నాఁడు.—

స్మృతా భవతి తాపాయ దృష్టా చోన్మాదకారిణీ,
స్పృష్టా భవతి మోహాయ సా నామ దయితా కథమ్. 42

క. తనుఁ దలఁచినఁ బరితాపము
గనుఁగొనఁ జిత్తభ్రమంబు ♦ గడువేడుక ము
ట్టిన మోహంబు నొసంగెడు
వనిత దయిత యనుచుఁ బలుక♦వచ్చునె జగతిన్.

తలఁచినంతమాత్రమున వేఁడ్రము గలిగించును. చూచినంతమాత్రమున వెఱ్ఱిని గలుగఁజేయును. తాఁకినంతమాత్రమున సొక్కించును. అట్టిమగువ నెట్లు ప్రియురాలనవచ్చును?



తావ దే వామృతమయీ యావ న్నయనగోచరా,
చక్షుష్పథా దతీతా తు విషా ద ప్యతిరిచ్యతే. 43

తే. ఎంతలో నింతికన్నుల ♦ యెదుట నిలుచు
నంతలో నింపు వాటించు ♦ నమృత మట్ల
కాక లోచనమార్గంబు ♦ గడచెనేని
గరళమునకన్న బ్రాణసం♦కటముఁ జేయు.

సుందరి కంటికిఁ గనఁబడునంతవఱకే యమృతముమాడ్కి నింపుగలిగించుచుండును. కంటికిఁ గనఁబడకున్న నాసుందరియే విషయమును మించినదై ప్రాణములకుపద్రవము గలిగించును. సుందరాంగులవియోగము సైఁచుట దుష్కరమని భావము.

అవ. స్త్రీయొక్క మంచిచెడ్డలఁ దెల్పుచున్నాఁడు.—

నామృతం న విషం కించి దేకాం త్యక్త్వా నితమ్బినీమ్,
సైవామృతలతా రక్తా విరక్తా విషవల్లరీ. 41

ఆ. పడఁతి నొక్కదాని ♦ విడిచి యించుక యమృ
తంబు లేదు భువి వి♦షంబు లేదు
అమృతలత లతాంగి ♦ యమరాగవతి యైనఁ
గాక మెలఁగెనేని ♦ గరళవల్లి.

చక్కనిపిఱుఁదులుగల స్త్రీయొక్కటితప్ప వేఱొక్కవిషముగాని, యమృతము గాని లేదు. ప్రేమగల స్త్రీయే యమృతలత. ప్రేమలేనికాంతయే విషపుఁదీఁగె. అనురాగముగల స్త్రీ యమృతలతమాడ్కిఁ బ్రాణముల నొసఁగును. అనురాగము లేని యతివయే విషపుఁదీఁగెవలెఁ బ్రాణములఁ దీయునని భావము.

అవ. స్త్రీ యను యంత్రమును జేసిన సృష్టికర్తను నిందించుచున్నాఁడు.—

ఆవర్తః సంశయానా మవినయభవనం పట్టణం సాహసానాం
దోషాణాం సన్నిధానం కపటశతమయం క్షేత్ర మప్రత్యయానామ్,
స్వర్గద్వారస్య విఘ్నో నరకపురముఖం సర్వమాయాకరణ్డం
స్త్రీయన్త్రం కేన సృష్టం విష మమృతమయం ప్రాణిలోకస్య పాశః.

మ. నరకద్వారము సాహసాకరము పు♦ణ్యస్వర్గవిఘ్నంబు దు
స్తరమాయాశతపేటి దంభనిధి దో♦షస్థాన మప్రత్యయో

త్కరసుక్షేత్రము కాలకూట మమృతా♦కారంబు స్త్రీయంత్రముం
ధర నెవ్వాఁడు సృజించెఁ బూరుషగళో♦ద్బద్ధక్రియాపాశమున్. 45

సంశయముల కునికిపట్టును, అడఁకువలేమికిఁ బుట్టినిల్లును, తెంపులకు వీడును, పాపములకుఁ బెన్నిధియు, పెక్కువంచనలే మేనుగఁగలదియు, అపనమ్మికలకుఁ బుట్టుచోటును, స్వర్గపువాకిలి నడగించు గడియమ్రానును, నరకపట్టణమునకు వాకిలియు, మాయలకన్నింటికిఁ బెట్టియయు, ప్రాణులకుఁ గట్టుత్రాడును, అమృతమువలెఁ గాన్పించువిషమునైన యీ స్త్రీయంత్రము నేమాయకాఁడు సృజించెనో తెలియకున్నది.

అవ. కవులపలుకులకు మోసపోయిన యొకనివచనము.—

నో సత్యేన మృగాఙ్క ఏష వదనీభూతో న చేన్దీవర
ద్వన్ద్వం లోచనతాం గతం న కనకై రప్యంగయష్టిః కృతా,
కి న్త్వేవం కవిభిః ప్రతారితమనా స్తత్త్వం విజాన న్నపి
త్వఙ్మాంసాస్థిమయం వపు ర్మృగదృశాం మన్దో జనః సేవతే. 46

చ. అల నెల కామినీవదన ♦ మై జనియింపఁగ లేదు కల్వలుం
నెలఁతకుఁ గన్ను లై యునికి ♦ నిక్కము గాదు కడాని చే నొడల్
వలనుగఁ జేయ లేదు కవి♦వంచితమానసుఁ డై వివేకియుం
మలమలినాంగనాతను స♦మాశ్రయుఁ డై విహరించు మందతన్.

నిజము పరికించి చూడఁ జందురుఁడే యీమృగాక్షులమోముగాఁ గాలేదు. కలువలజంటయే దానికన్నుదోయిగాఁ గాలేదు. దానిమెయిదీఁగ పసిఁడితోఁ జేయఁబడలేదు. అయినను, కవులు చంద్రముఖి, కలువకంటి, కనకాంగి యని వర్ణించుటచే వివేకియుఁ దాను వస్తుతత్త్వము నెఱిఁగినవాఁడయ్యుఁ గవులమాటలకు మోసపోయి, మూఢుఁడయి చర్మము మాంసము నెముకలుఁగ నుండునీమృగాక్షులశరీరమును గొలుచుచున్నాఁడు.

అవ. స్త్రీలకు స్వాభావికము లైనకడగంటిచూడ్కులు మొదలగునవి తన్నుఁ గూర్చి యని భ్రమసి పురుషుఁడు మోసపోవుచున్నాఁడని తుమ్మెద దృష్టాంతముచేఁ జెప్పుచున్నాఁడు.—

లీలావతీనాం సహజాః స్వభావా
స్త ఏవ మూఢస్య హృది స్ఫురన్తి,
రాగో నళిన్యా హి నిసర్గసిద్ధ
స్తత్ర భ్రమ త్యేవ ముధా షడంఘ్రిః. 47



తే. లలిత మైనట్టిలీల లీ♦లావతులకు
సహజ మది మూఢునకు మది ♦ సందడించుఁ
బద్మినికి రాగగరిమ స్వా♦భావికంబు
తేఁటి పని లేక దానిలోఁ ♦ దిరుగుచుండు.

ఎఱ్ఱగలువకు రాగము (రక్తవర్ణముండుట) స్వాభావికమైనను, భ్రమరము వ్యర్థముగా దానిచుట్టును దిరుగునట్లు వేడుకకత్తె లగుజవరాండ్రకు కడగంటిచూడ్కులు మొదలగుచేష్టలు స్వాభావికములుగా నున్నను మూఢు లగుపురుషు లాచేష్టలన్నియుఁ దమ్ముఁ గూర్చియె వారు చేయుచున్నారని యనుకొందురు. వా రట్టియభిమానము గలిగి యుండుట వ్యర్థము.

అవ. చెలువలమోము మోహజనకముగా నున్నను, అంత్యమునఁ గష్టప్రదమగును గాన దానిం జూచి మోహమందరాదని చెప్పుచున్నాఁడు.—

యదేత త్పూర్ణేన్దుద్యుతిహర ముదారాకృతి పరం
ముఖాబ్జం తన్వంగ్యాః కిల వసతి యత్రాధరమధు,
ఇదం త త్కింపాకద్రుమఫల మిదానీ మతిరసం
వ్యతీతేఽస్మిన్ కాలే విష మివ భవిష్య త్యసుఖదమ్. 48

శా. రాకాకైరవమిత్రకాంతిహర మై ♦ రమ్యాధరోష్ఠామృతా
స్తోకం బై విలసిల్లుచున్నరమణీ♦శుంభన్ముఖాబ్జంబు కిం
పాకక్ష్మాజఫలం బగున్ రుచిర మై ♦ ప్రారంభకాలంబునన్
గాకోలంబు తెఱంగునన్ నరులకుం ♦ గష్టం బొసంగుం దుదిన్.

తీఁగెబోఁడియొక్క మోముదమ్మి పున్నమచందురునిసొబుఁగు నపహరించునదియు, మిక్కిలియొప్పుగల రూపుగలదియు, మోవియందుఁ దీపిగలదియు నై యౌవనసమయంబున ముష్టిపండువలె నెంతయు సౌఖ్యకరంబుగాఁ దోఁచినను, యౌవనకాలము మీఱిన తర్వాత విషమువలె దుఃఖప్రదమగును.

అవ. స్త్రీపరిత్యాగము చేసినవానికి సంసారమే లేదని చెప్పుచున్నాఁడు.—

ఉన్మీల త్త్రివళీతరఙ్గవలయా ప్రోత్తుంగపీనస్తన
ద్వన్ద్వే నోద్యతచక్రవాకయుగళా వక్త్రామ్బుజోద్భాసినీ,
కాన్తాకారధరా నదీయ మభితః క్రూరాశయా నేష్యతే
సంసారార్ణవమజ్జనం యది తదా దూరేణ సన్త్యజ్యతామ్. 49

ఉ. చన్నులు చక్రవాకములు ♦ చక్కనిమోముఁ గరంబు లబ్జముల్
గన్నులు మీలు నాభి సుడి ♦ గాఢనితంబము సైకతంబుగా
నెన్నికఁ గన్నబోఁటి యను ♦ నేటికి దవ్వుల నుక్కి చాల మే
లెన్న భవాబ్ధిమజ్జన మ♦దేమియుఁ గోరనివారి కిమ్మహిన్.

త్రివళులనెడియలలును, నిక్కివెలుఁదచన్నులనెడి జక్కవకవలును, మోమనెడి తమ్మియుఁగలిగి యంతటఁ గ్రూరాశయముగల (కఠినమనస్సుగల యని స్త్రీపరమున నర్థము. మొసళ్లు మొదలగు క్రూరజంతువుల కునికిపట్టయిన యని నదీపరమున నర్థము.) స్త్రీయను నేఱు సంసారమనుసముద్రమునకుఁ గొనిపోవునది కావున సంసారసముద్రమున మునుఁగఁ గోరనివారు స్త్రీనదిని చాలదూరముననే విడువవలయును.

అవ. స్త్రీలను నమ్మరాదనుటకుఁ గారణములు చెప్పుచున్నాఁడు.-

జల్పన్తి సార్ధ మన్యేన పశ్యన్త్యన్యం సవిభ్రమాః,
హృద్గతం చిన్తయన్త్యన్యం ప్రియః కో నామ యోషితామ్. 50

తే. ఒకనితోఁ గూడి భాషింతు ♦ రొక్కనరునిఁ
జూతురు విలాససంపద ♦ సొంపు గులుక
మఱియు నొక్కనిఁ దలఁతురు ♦ మనసులోనఁ
గూర్చు ప్రియుఁ డెవ్వఁడో ♦ ముద్దుగుమ్మలకును.

స్త్రీ లొక్కనితోఁ బ్రేమ మీఱ మాటాడుదురు. మఱియొకనిఁ దళుకుబెళుకు నడతలతోఁ జూతురు. మనసున మఱొక్కనిని దలఁచుచుందురు. కావున వారి కిష్టుఁ డొక్కఁడనుట లేదు.

అవ. స్త్రీలకడఁ జేరరా దనుచున్నాఁడు.—

అపసర సఖే! దూరా దస్మాత్కటాక్షవిషానలాత్
ప్రకృతివిషమా ద్యోషిత్సర్పా ద్విలాసఫణాభృతః,
ఇతరఫణినా దష్ట శ్శక్య శ్చికిత్సితు మౌషధై
శ్చతురవనితాభోగిగ్రస్తం త్యజన్తి హి మన్త్రిణః. 51

ఉ. చూపు విషంబు విభ్రమము ♦ సొంపు ఫణాఫలకంబుగా వధూ
రూపము దాల్చుభోగికిని ♦ రూఢిగ దూరముగాఁ దొలంగుమీ
దాపుగ సర్పదష్టునకుఁ ♦ దప్పు విషంబు మహౌషధంబులం
బాప వధూభుజంగవిష♦భగ్నునిచెంతకుఁ బోరు మాంత్రికుల్.



చెలికాఁడా! కడగంటిచూపులనెడి విసపునిప్పులు గ్రక్కునదియు, స్వభావవక్రమైనదియు, సొంపు లనెడిపడగలను దాల్చినదియునైన యాఁడుదియను పాముకడఁ జేరక దవ్వునకుఁ బరుగెత్తుము. తక్కినపాములు గఱచినయెడల మంత్రజ్ఞులు మూలికలు దెచ్చి చికిత్సచేసి, విషవేగము తగ్గించి మాన్పుదురు. జాణయగు నెలఁతుకయను పాముచేఁ గఱవఁబడినవానిని గుదుర్చుట యసాధ్యమని తలంచి మంత్రజ్ఞులు విడిచి వేయుదురు.

విస్తారితం మకరకేతనధీవరేణ
స్త్రీసంజ్ఞితం బడిశ మత్ర భవామ్బురాశౌ,
తే నాచిరా త్తదధరామిషలోలమర్త్య
మత్స్యాన్వికృష్య స పచ త్యనురాగవహ్నౌ. 52

ఉ. చేరి మనోజధీవరుని♦చేత భవాంబుధిలోన నంగనా
కారముఁ బూని యున్న పెను♦గాలము చిమ్మఁగ నయ్యె దానిచే
భీరుజనాధరామిషముఁ ♦ బేర్మి భుజించు నరాండజంబులన్
వారక స్వారెకుం దిగిచి ♦ నందు మరుం డనురాగవహ్నిలోన్

మరుఁడను జాలరి యీ సంసారమను సముద్రమున నాఁతి యను గాలమును విసరివైచియున్నాఁడు. ఆగాలమున మోవి యను నెర యున్నది. ఆయెరయం దాశపడి యీగాలమునకుఁ జిక్కుకొన్న పురుషులనెడి చేఁపలనులాగి యాజాలరి వలపనెడి నిప్పునందుఁ బచనము చేయును. కావున నాగాలమునకుఁ జిక్కుకొనకుఁడు.

కామినీకాయకాన్తారే కుచపర్వతదుర్గమే,
మా సఞ్చర మనఃపాన్థ! తత్రాస్తే స్మరతస్కరః. 53

క. స్తనపర్వతదుర్గమమై
ఘనమగు కాంతాశరీర♦కాంతారమునం
జనఁ బోకు మనఃపాంథుఁడ
కనలుచు మరుఁ డనెడి దొంగ ♦ గలఁ డచ్చోటన్.

ఓ మనసనెడి బాటసారీ! బలితంపు గుబ్బలనెడి గట్టులచేఁ జొచ్చుటకు వీలుకాకయున్న క్రొల్లంటి మేననెడి యడవియందు దిరుగకుము. అచ్చట మరుఁ డనెడి దొంగ యున్నాఁడు. అతఁడు నిన్నీడ్చుకొని పోవునుసుమీ.

అవ. ఒక కాముకుఁడు విరక్తుఁడై స్వానుభవముఁ దెల్పుచున్నాఁడు.-

వ్యాదీర్ఘేణ చలేన వక్రగతినా తేజస్వినా భోగినా
నీలాబ్జద్యుతినాఽహినా వర మహం దష్టో న తచ్చక్షుషా,
దష్టే సన్తి చికిత్సకా దిశిదిశి ప్రాయేణ ధర్మార్థినో
ముగ్ధాక్షీక్షణవీక్షితస్య నహి మే వైద్యో న వా ప్యౌషధమ్. 54

చ. ఉరగము ముట్టినా నరుల ♦ కుర్విని వెజ్జులు ధర్మశీలురై
గరళము నెక్కుడింతు రధి♦కంబుగ నాయతమేచకోత్పల
స్ఫురణ వహించి వక్రగతిఁ ♦ బూనినమానినిచూపుసోఁకినం
బురుషున కెందు మందులును ♦ బొందవు పొందరు వెజ్జు లెవ్వరున్.

మిక్కిలి నిడుపై కదలుచు వంకరగాఁ బోవునదియు, బలిమిగలదియు నై పడగ గలిగి, నల్లఁగలువవంటివన్నెగల సర్పము నన్నుఁ గఱచినను హానిలేదు. అయితే చెవివఱకు నిడుపై యదురుచు, వంకరగాఁబోవుచు మెఱుఁగుగలిగి విఱివిగలిగియుండు నల్లఁగలువకు సాటివచ్చు నాకలువకంటియొక్కచూపు లనుపాము గఱచినఁ గీడు తప్పకవచ్చును. అది కొంచెమైనను మేలుగాదు. సాధారణము లగుపాములుగఱచినఁ జికిత్స చేయుపుణ్యాత్ములు మూలమూలకు నెందఱో యున్నారు. ముగ్ధుచూడ్కులుగలక్రాల్గంటిచూపు తగిలెనా చికిత్స చేయువైద్యులును లేరు. మందును లేదు.

ఇహ హి మధురగీతం కృత్త మేత ద్రసోఽయం
స్ఫురళపరిమళోఽసౌ స్పర్శ ఏష స్తనానామ్,
ఇతి హతపరమార్థై రింద్రియై ర్భ్రామ్యమాణః
స్వహితకరణధూర్తైః పఞ్చభి ర్వఞ్చితోఽస్మి. 55

ఉ. ఈమృదుగాన మీనటన ♦ మీకుచమర్దన మీసుధారసం
బీమహనీయసౌరభము ♦ నింతులయందుఁ దనర్చు నంచు న
న్నేమరఁజేసి యాత్మహిత ♦ మిచ్చినభంగి మెలంగి యింద్రియ
గ్రామము మోసపుచ్చె హిత♦కార్యవిహీనుఁడ నైతి నక్కటా.

ఈకాంతయందే యింపయినపాట లున్నవి వినవచ్చునని నాచెవులును, దీనియందె నాట్యమున్నది చూడవచ్చునని నాకన్నులును, దీనికెమ్మోవియందే తీపియున్నది చవిగొనవచ్చునని నానాలుకయు, దీనినోటియందలితావియె మూర్కొనవచ్చునని నా నాసికయు, దీనిచనుమొనలరాయిడియె చాలునని నాయొడలును తలఁచి పరతత్త్వవిచారము మాని, తనమే లొడఁగూర్చుటయందు శ్రద్ధలేకుండిన యీపం



చేంద్రియములు నన్ను విషయములందుఁ జొప్పించి మైమఱపు గలిపించి మోసపుచ్చినవి. ఆహా యిప్పుడే వీనిటక్కు దెలిసికొంటిని.

అవ. మన్మథదూషణము చేయుచున్నాఁడు.—

న గమ్యో మన్త్రాణాం న చ భవతి భైషజ్యవిషయో
న చాపి ప్రధ్వంసం వ్రజతి వివిధైః శాన్తికశతైః,
భ్రమావేశా దఙ్గేక మపి విదధ ద్భఙ్గ మసకృత్
స్మరాపస్మారోఽయం భ్రమయతి దృశం ఘూర్ణయతి చ. 56

ఉ ఆరయ మంత్రగమ్యమును ♦ నౌషధసాధ్యముఁ గాదు శాంతికా
చారశతంబులం జెడదు ♦ చంషతరభ్రమకల్పనోద్ధతిఁ
భూరివికార మంగములఁ ♦ బూన్చుచు మన్మథజన్య మీయప
స్మారము లోచనద్వయము ♦ సారెకుఁ ద్రిప్పెడుఁ జక్రముం బలెన్

ఈమోహమనెడి యపస్మారరోగము మంత్రములచే కుందునదికాదు. ఔషధముచేఁ గుదురునదికాదు. ఎన్నిశాంతికర్మములు చేసినను నయముగాదు. పలుమాఱు మనస్సునకు భ్రమముగలిగించి, చేతులు కాళ్లుమొదలగునంగములు వంకరపోవునట్లుచేసి కన్నులు గిరగిరద్రిప్పి భ్రమగప్పునట్లుచేయుచున్నది. ఈరోగమునకు నేదియుఁ జికిత్స గనుపడలేదు. ఏమిచేయుదును?

అవ. మూఁడుశ్లోకములచే వేశ్యాదూషణము చేయుచున్నాఁడు.—

జాత్యన్ధాయ చ దుర్ముఖాయ చ జరాజీర్ణాఖిలాంగాయ చ
గ్రామీణాయ చ దుష్కులాయ చ గళత్కుష్ఠాభిభూతాయ చ,
యచ్ఛన్తీషు మనోహరం నిజవపు ర్లక్ష్మీలవశ్రద్ధయా
పణ్యస్త్రీషు వివేకకల్పలతికాశస్త్రీషు రజ్యేత కః. 57

చ. విడువక పుట్టుగ్రుడ్డునకు ♦ వృద్ధశరీరికిఁ గుష్ఠరోగికిన్
జడునకు జాతిహీనునకుఁ ♦ జారునిజాంగము లొక్కరూకకై
కడువడి నిచ్చువారి గుణ♦కల్పలతల్ విదళించుకత్తులం
బడుపుఁబడంతులం దనదు♦భావముఁ జేర్చునె యెవ్వఁడేనియున్

వెలయాండ్రొక్కింతడబ్బున కాసపడి పుట్టుగ్రుడ్డికేనియు, వదరుఁబోతునకేనియు, ముదిమిచే నన్నియంగములు సడలినవానికేనియు, పల్లెటూరివానికేనియు, చెడుకులంబునఁ బుట్టినవానికేనియు, కుష్ఠుచేఁ గాళ్లుచేతులు తినిపోవుచుండ నసహ్యపడఁదగిన వానికేనియుఁ దనసొంపుమేనిని సంభోగమునకై యప్పగింతురు. జ్ఞానమను

కల్పలతవఁ జూఁకత్తులయిన యిట్టివెలయాండ్రయం దేవివేకి మోహము నుంచును? ఎవఁడును వెలయాండ్రనడతలఁ దెలిసినవాఁడు వారిఁ జూడఁడు.

వేశ్యాసౌ మదనజ్వాలా రూపేన్ధనసమేధితా,
కామిభి ర్యత్ర హూయన్తే యౌవనాని ధనాని చ. 58

క. రూపేంధనవర్ధితవే
శ్యాపంచశరాగ్నికీలయం దంగజపూ
జాపరతంత్రులు వేల్తురు
దాపుగఁ దమజవ్వనములు ధనములుఁ గడఁకన్.

ఈ వెలయాలు మదనాగ్నిజ్వాలయైనది. ఇది రూపమనెడి సమిధలచేఁ బెంపొందునది. ఈయగ్నిజ్వాలయందుఁ గాముకులో జవ్వనములు, కల్మిలు ననుహవిస్సులను వ్రేల్చుదురు.

చుమ్బతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞమపి,
చార భట చోర చేటక నట విట నిష్ఠీవనశరావమ్. 59

క. జారభటచోరచేటక, చారనటప్రభృతినీచజననిష్ఠీవా
ధారశరావము వారస్త్రీరమ్యాధరము సంస్పృశింతురె కులజుల్.

వేఁగులు, బంటులు, దొంగలు, కుంటెనకాండ్రు, నట్టువకాండ్రు, విటులు మొదలగుహీనకులపుమనుజులు ముద్దుపెట్టి యెంగిలిచేసిన వేశ్యలకెమ్మోవిచిగు రెంతసొంపుగానున్నను, సత్కులమునఁ బుట్టినయేమానవుఁడు దాని కాసపడును? వేశ్యలకెమ్మోవి యెంత సొగసుదనము గలదిగనున్నను హీనకులజులు ముద్దుపెట్టి యపవిత్రపఱచినందున దానిని ముద్దిడరాదని భావము.

అవ. స్త్రీలు పైకి మంచివారుగను, లోపలఁ జెడ్డవారుగ నుందురనుచున్నాఁడు.—

మధు తిష్ఠతి వాచి యోషితాం హృది హాలాహల మేవ కేవలమ్,
అత ఏవ నిపీయ తేఽధరో హృదయం ముష్టిభి రేవ తాడ్యతే. 60

చ. కలదు కదా సుధారసము కంజదళాక్షుల ముద్దుపల్కులన్
వెలయుఁ గదా హాలాహలము వీరలచిత్తమునందుఁ గావునన్
బలుమఱుఁ బల్లవాధరముఁ బాన మొనర్తురు నిండువేడుకన్
బలితపుఁబొమ్ము ముష్టితలపాతములం బ్రహరింతు రెంతయున్.



మగువలకు వాక్కునందుఁ దేనెయు, హృదయమున హాలాహలమను విషమును న్నది. కావుననే పురుషులు వారిమోవిఁ బీల్తురు. ఱొమ్మును పిడికిళ్ళతో గ్రుద్దుదురు (అధరచుంబన స్తనమర్దనములు స్వాభావికము లయిననని యిట్లువర్ణింపఁబడినవి).

## దుర్విరక్తపద్ధతి.

అవ. స్త్రీలనుజూచి మనోవికారము నొందనివారు ధన్యులని చెప్పుచున్నాఁడు.—

ధన్యాస్త ఏవ చపలాయతలోచనానాం
తారుణ్యదర్పఘనపీనపయోధరాణామ్,
క్షామోదరోపరి లసత్త్రివళీలతానాం
దృష్ట్వాఽఽకృతిం వికృత మేతి మనో న యేషామ్. 61

చ. కలికిమెఱుంగువాలుఁ గెలిగన్నులు సన్నపుఁగౌనుదీఁగపై
నలరెడుసత్త్రివళీలతలు నంచితయౌవనదర్పలక్ష్మిచేఁ
గులికెడుసిబ్బెపున్వలుఁద గుబ్బలునుం గలమించుబోండ్లరూ
పులఁ గని నిర్వికారు లగు పూరుషులే కృతకృత్యు లిద్ధరన్.

కదలుచుండు నిడివికన్నులు గలవారును, యౌవనగర్వము గలిగి దట్టములైన యుబ్బిన స్తనంబులు గలవారును, సన్ననినడుముపై వెలయుచుండు ముడుతలు గలవారు నైన చెలువలయాకారముఁ జూచినను, ఏపురుషులమనసు వికారము నొందదో, వారేపుణ్యాత్ములు (స్త్రీలుతమచూపులచేతనే పురుషులవశపఱచుకొందురని భావము).

అవ. ఒకసింగారి విరక్తుఁడై తనయనుభవముఁ దెల్పుచున్నాఁడు.—

బాలే! లీలాముకుళిత మమీ మన్థరా దృష్టిపాతాః
కిం క్షిప్యన్తే విరమ విరమ వ్యర్థ ఏష శ్రమస్తే,
సమ్ప్రత్యన్యే వయ ముపరతం బాల్య మాస్థా వనాన్తే
క్షీణో మోహ స్తృణ మివ జగజ్జాల మాలోకయామః. 62

ఉ. మానిని! యేల చిమ్మెదవు మాపయి మంథరదృష్టిపాతము
ల్మానుము నీశ్రమంబు విఫలం బివి వింతలమైతి మిత్తఱిన్
మానుగ జవ్వనం బడఁగె మానసవృత్తి వనంబు గోరెను
జ్ఞానము నష్టమయ్యె యవసంబుగఁ జూచెద మెల్లలోకమున్.

ఓసీ ముద్దరాలా! నీయొయ్యారముచే నరమోడ్చిన కన్నుదోయినుండి వెడలు నీ తిన్ననిచూడ్కులను నాపైఁ జిమ్మకుము. ఇఁకఁ జాలింపు చాలింపుము. ఏలయనఁగా: యీనీశ్రమంబు వ్యర్థమగును. మేము ముందటివారముగాము. మే మితరులమైతిమి. యౌవన ముడిగినది. వనవాసమునం దాసగలిగినది. నీమీఁదివలపు నశించినది. కావున నే మే మీప్రపంచమెల్ల గడ్డిపోఁచతో సమముగా నెంచుచున్నారము. కాఁబట్టి నీచేష్ట లిక్కడఁ బనికిరావు పొమ్ము అని యొకవిరక్తుఁ డొకకామినితోఁ జెప్పెను.

అవ. మఱి యుక్తమునే ప్రకారాంతరమునఁ జెప్పుచున్నాఁడు.—

ఇయం బాలా మాం ప్రత్యనవరత మిన్దీవరదళ
ప్రభాచోరం చక్షుః క్షిపతి కి మభిప్రేత మనయా,
గతో మోహోఽస్మాకం స్మరకుసుమబాణవ్యతికర
జ్వరజ్వాలా శాన్తా త దపి న వరాకీ విరమతి. 63

ఉ. నీలసరోజపత్త్రకమ♦నీయవిభాహరణప్రవీణ దృ
గ్జాలము లీలతాంగి వెద♦చల్లెడు నాపయి నేమి గోరెనో
తూలె సమస్తమోహవికృ♦తుల్ రతివల్లభభల్లభల్లభూ
జ్వాల లడంగె మాకుఁ దన♦వైఖరి మానదు జోటి నేఁటికిన్.

ఓచెలికాఁడా! యీ ముద్దియ యెల్లప్పుడు కలువచాయఁ జూఱగొను తన కంటిచూపు నాపై నిగిడించుచున్నది. ఇట్లు చేయుటయం దీముచ్చకంటియభిప్రాయ మేమో తెలియరాదు. మేమిపుడు దీనిచూపులకు బేలుపోము. మాకు మోహము దొలఁగిపోయినది. మరుఁడేయుపూవుటమ్ములతాఁకుళ్లచేఁ గలిగిన వేఁడిమిమంట చల్లారినది. మే మిట్లు విరక్తులమైయున్నను, ఈ నీచురాలుమాత్రము మమ్ము విడువక చూచుచునే యున్నది

అవ. ఒకవిరాగి మదనాదులను నిందించుచున్నాఁడు.—

రే కన్దర్ప కరం కదర్థయసి కిం కోదణ్డటఙ్కారితైః
రేరే కోకిల! కోమలైః కలరవైః కిం వా వృథా జల్పసి,
ముగ్ధే స్నిగ్ధవిదగ్ధముగ్ధమధురై ర్లోలైః కటాక్షై రలం
చేత శ్చుమ్బితచన్ద్రచూడచరణధ్యానామృతం వర్తతే. 64

ఉ. ఓరి మనోజ సూనశర♦ మూరక చిమ్మకు మిన్నకే కుహూం
కారము లేల చేసెదు పి♦కద్విజ యోమృగశాబకాక్షి నీ



చారువిలోకనంబు లిఁకఁ♦జాలును నాహృదయంబు శంకరో
దారపదాబ్జచింతనసు♦ధారసతత్పర మయ్యె నియ్యెడన్.

ఓరీ మన్మథుఁడా! వింటినారిని మీటిమీటి యేల ప్రేళ్లునొప్పియెత్తునట్లు చేసికొనెదవు? ఓకోకిలా! యింపగు తిన్నని కూఁతల నూరక యేల పదరెదవు? ఓముగుదరాలా! జాణతనంబున మెఱయఁ ప్రేమ వెల్లివిరియ నింపుమీఱ సొంపుగల్గియున్న చంచలములగు కడగంటిచూడ్కుల నిఁకఁ జాలింపుము. మా మన సిప్పుడు చంద్రమౌళీశ్వరుని పాదకమలధ్యానమనెడి యమృతమును గ్రోలియున్నది (మామనస్సు భగవంతుఁడగు పరమేశ్వరుని పదాంబుజధ్యానంబున లీనమైయున్నది.) ఇప్పుడు మా మానసము విలాసంబులఁ దగులదు. మన్మథా! నీవు సపరివారుఁడవై పొమ్మని యొక్కవిరాగి చెప్పెను.

అవ. సంయోగవియోగములకు మనసే కారణమనుట.—

విరహేఽపి సఙ్గమః ఖలు పరస్పరం సఙ్గతం మనో యేషామ్,
[1]హృదయ మపి విఘటితం చేత్ సఙ్గో విరహం విశేషయతి. 65

క. విరహములందైనఁ బర
స్పర మనురాగులకుఁ బొందు♦ భాసిలు మన సె
వ్వరి కెనయదు వారలకును
విరహము హెచ్చుగ నొనర్చు♦ వెస సంగతియున్.

ఏ స్త్రీపురుషులకు పరస్పరము మనస్సు గలిగియుండునో, వారెడఁబాసియున్నప్పుడును మనస్సు గలిసియుండుటచే నొండొరులు గలిసి యున్నవారె యగుదురు. స్త్రీపురుషులకు మనసు విఱిగెనేని, వారు గలిసియుండినను విరహము గలవారే యగుదురు.

అవ. ఒకబాటసారి తనవిరక్తినిఁ దెల్పుచున్నాఁడు.—

కిం గతేన యది సా న జీవతి ప్రాణితి ప్రియతమా తథాఽపి కిమ్,
ఇత్యుదీక్ష్య నవమేఘమాలికాం స ప్రయాతి పథికః స్వమన్దిరమ్.

క. చన నేఁటికిఁ బ్రేయసి జీ
వనవతి యగునేని ప్రాణ♦వతి గానితఱిం
బని యే మని యొక తెరువరి
చనఁ డింటికి నవ్యజలద♦సమయమునందున్. 66

1 'హృదయం విఘట్టితం చేత్' అప్పుడు (మనస్సు రోసినయెడలఁ గలిసియుండుట విరహతుల్యమే' యని తాత్పర్యము.

ఆ నాప్రాణసఖి ప్రాణములతోనున్న నేమియెక్కువ ? బ్రతికియుండకున్న నేమి తక్కువ? నేను విరక్తుండనైతిని. నేనింటనున్న నొక్కటే. ఇక్కడనున్న నొక్కటే యని యొకబాటసారి నవమేఘంబు లుదయించుటఁజూచి యిట్లు నుడివి తనయింటికిఁ బోకయుండెను.

అవ. వైరాగ్యోపదేశముఁ జేయుచున్నాఁడు.—

విరమత బుధా! యోషిత్సంగా త్సుఖా త్క్షణభంగురాత్
కురుత కరుణా మైత్రీ ప్రజ్ఞా వధూజనసంగమమ్,
న ఖలు నరకే హారాక్రాన్తం ఘనస్తనమణ్డలం
శరణ మథవా శ్రోణీబిమ్బం రణన్మణిమేఖలమ్. 67

మ. మన సింపొందఁగ ధీరులార కరుణా ♦ మైత్రీ మనీషా క్షమా
వనితాసంగము మాచరింపుఁ డెపుడున్ ♦ భామాసుఖం బస్థిరం
బని వర్జింపుఁడు హారరమ్యకుచముల్ ♦ ప్రాంచన్మణీమేఖలా
ధ్వనితాలంబినితంబముల్ నరకబా♦ధ ల్మాన్పి రక్షించునే.

ఓపండితులారా ! స్త్రీసంగ మనుక్షణనశ్వరమగుసుఖమునుండి మనసుఁ ద్రిప్పుఁడు. కరుణ, మైత్రి, ప్రజ్ఞ యను చెలువలతో సంగమం బొనర్పుఁడు. ముత్తెపుహారములచే మెఱయు గబ్బిగుబ్బలపాలిండ్లుగాని, మ్రోఁతగల చిఱుగజ్జలచే వెలయు నొడ్డాణముగల పిఱుఁదులుగాని మిమ్ము నరకమునుండి లేవఁదీసి రక్షింపఁజాలవు.

అవ. విరక్తునికి సంసార మక్కఱ లేదనుచున్నాఁడు.—

యదా యోగాభ్యాసవ్యసనకృశయో రాత్మమనసో
రవిచ్ఛిన్నా మైత్రీ స్ఫురతి కృతిన స్తస్య కిము తైః,
ప్రియాణా మాలాపై రధరమధుభి ర్వక్త్రవిధుభిః
సనిశ్వాసామోదైః సకుచకలశాశ్లేషసురతైః. 68

చ. ఎనసిన యోగమార్గగతి ♦ యెవ్వనిడెందములో వెలుంగుతోఁ
గొనకొని యేకమై వెలుఁగు ♦ గూరిమి మీఱఁగ వాని కేటికిన్
వనితలముద్దుపల్కులును ♦ వాతెఱ తేనియ లూర్పుఁ దావులున్
గొనబగు మోముఁజందురులు ♦ గుబ్బలఁ గౌఁగిటఁ జేర్చుకూటముల్.

ఎవ్వఁడు యోగాభ్యాసమ్మునందుఁ దనమనసును లయింపఁజేసి, యెల్లప్పుడాత్మయందు నిల్పి యందలి యెడతెగని యానందాతిశయము నొందుచున్నాఁడో, అట్టిజ్ఞానికిఁ బ్రియకాంతల ముచ్చటలును, మోవితేనియలును, మోముచందురులును,



కుచకలశముల కౌఁగిలింతలును యూర్పులకమ్మనివాసనలును, సురతమును నీచములై తృణప్రాయముగాఁ దోఁచును.

అవ. విరక్తునికి సర్వము బ్రహ్మమని చెప్పుచున్నాఁడు.—

య దాసీ దజ్ఞానం స్మరతిమిరసఞ్చారజనితం
తదా దృష్టం నారీమయ మిద మశేషం జగ దితి,
ఇదానీ మస్మాకం పటుతరవివేకాంజనజుషాం
సమీభూతా దృష్టి స్త్రిభువన మపి బ్రహ్మ మనుతే. 69

చ. స్మరతిమిరప్రచారభవ♦శశ్వదబోధము గల్గువేళ మే
దురగతి ముజ్జగంబులు వ♦ధూమయ మై కన నయ్యె నిప్పు డిం
పరయఁగ సద్వివేక మహి♦తాంజనసంగత మై మదీయ భా
సురసమదృష్టి బ్రహ్మముగఁ ♦ జూచుచు నున్నది విశ్వమంతయున్.

మరుం డనెడి యంధకారము వ్యాపించుటచే నెప్పుడు తెలివిలేమి కలిగెనో, అప్పుడు నాకంటికి బ్రహ్మస్వరూపమగుప్రపంచమెల్ల స్త్రీమయముగాఁ దోఁచెను. మేలయిన వివేక మనుకాటుక వేసికొనుటచే నాకన్నులమసక దొలఁగి యిప్పుడు ప్రపంచమెల్ల బ్రహ్మస్వరూపముగాఁ దోఁచుచున్నది. అవివేకులకు ప్రపంచము స్త్రీయే. వివేకులకు ప్రపంచము బ్రహ్మమే యనుట.

అవ. స్త్రీలు వివేకమును బాడుసేయువారని నిందించుచున్నాఁడు.

తావదేవ కృతినాం హృది స్ఫుర
త్యేష నిర్మలవివేకదీపకః,
యావదేవ న కురఙ్గచక్షుషాం
తాడ్యతే చపలలోచనాఞ్చలైః. 70

క. నీలోత్పలనయనాతర
ళాలోకనవాతులు సోఁకు♦నంతకు వెలుఁగున్
ధీలలితసుజనవిమలో
జ్జ్వలాతిస్ఫుటవివేక♦దీపము నెమ్మిన్.

పండితు లెంతవఱకు లేఁడిచూపులం బోలుచూపులు గల యతివల క్రేగంటిచూపులచేఁ గొట్టఁబడరో, అంతవఱకే పండితులయొక్క హృదయమందు మంచి

చెడ్డలను దెలియునట్టివివేక మనుదీపము వెలుఁగుచుండును. స్త్రీల కడగంటిచూపుల చేతనే పండితులకైనను బుద్ధిచెడును.

అవ. దుర్విరక్తదూషణముఁ జెప్పుచున్నాఁడు.—

వచసి భవతి సఙ్గత్యాగ ముద్దిశ్య వార్తా
శ్రుతిముఖరముఖానాం కేవలం పణ్డితానామ్,
జఘన మరుణరత్నగ్రన్థికాఞ్చీకలాపం
కువలయనయనానాం కో విహాతుం సమర్థః. 71

చ. నిగమసుభాషితాభ్యసన♦నిష్ఠలు గల్గినయట్టిపండితుల్
మగువలపొందు నింద్య మని ♦ మాటికి వార్తలు చెప్ప నేర్పరుల్
జగమున నెవ్వఁ డోపు విల♦సత్కురువిన్దమణిప్రభాఢగ
ద్ధగితకలాపరమ్యవని♦తాజఘనంబుఁ బరిత్యజింపఁగాన్.

పండితులు వేదాంతములు నోట వదరుచు స్త్రీలతోఁ గూడిక పనికిరాదని మాటలు చెప్పుచుందురుగాని, వారిని మనఃపూర్తిగా విడువఁగలవారుగారు. ఏలయన: కెంపులు చెక్కిన యొడ్డాణముచే నొప్పారుచున్నకలాపకంటుల కటిపురోభాగము నెవ్వఁడును విడిచి పోఁజాలఁడు.

అవ. మఱియు.

స్వపరప్రతారకోఽసౌ నిన్దతి యోఽలీకపణ్డితో యువతీః,
యస్మాత్తపసోఽపి ఫలం స్వర్గః స్వర్గేపి చాప్సరసః. 72

తే. కుటిలవాదియుఁ బరపంచ♦కుండు వాఁడు
నెమ్మి నెవ్వాఁడు యువతుల ♦ నిందసేయు
నింద్రలోకము తపముల ♦ కెల్ల ఫలము
స్వర్గమున నున్నవార ల♦చ్చరలు గారె.

బూటకపుఁబండితులు గొందఱు స్త్రీలు చెడ్డవారు. వారితోఁ జేరరాదు. అరణ్యములందుఁ దపస్సుచేయుట మేలని పల్కుచుందురు వీరు తాము మోసపోయి, యొరులును మోసపోవునట్లు చేయువారు ఏలయన: ఆతపస్సుకు ఫలము స్వర్గమేగదా! స్వర్గముననుండువా రచ్చరలె. అచ్చటికిఁబోయినను మగువలే తపఃఫలముగా నున్నప్పుడు స్త్రీలను నిందించుట పైకేకాని లోపల స్త్రీలాభమునకుఁ దగినపనులనే వారు చేయుచుందురు.



అవ. మదనునికి లోఁబడనివా రెవ్వరును లేరనుట.—

మత్తేభకుమ్భదలనే భువి సన్తి శూరాః
కేచి త్ప్రచణ్డమృగరాజవధేఽపి దక్షాః,
కిన్తు బ్రవీమి బలినాం పురతః ప్రసహ్య
కన్దర్పదర్పదలనే విరలా మనుష్యాః. 73

తే. సమదకుంజరకుంభభం♦జనులు మఱియు
నుగ్రమృగరాజవధదక్షు ♦ లుర్విఁ గలరు
తఱుచుగా లేరు కందర్ప♦దర్పదళన
నిపుణజను లని చాటింతు ♦ నిల్చి సభల.

మదపుటేనుఁగుల గండస్థలములను జీల్చుటయందుఁ జాలినదిట్ట లనేకులు పుడమినున్నారు. సింహములను సంహరింపఁ జాలినవారును కొందఱు గలరు. అయినను, మన్మథునిగర్వము నణఁపఁగలవా రనేకులు లేరని నేను బలవంతులయెదుట దృఢముగాఁ జెప్పుచున్నాను. దీనికి బదు లెవ్వరు చెప్పఁగలరో చెప్పుఁడు.

అవ. పురుషుఁడు స్త్రీలకడగన్నులం బడువఱకే యోగ్యుఁడుగా నుండునని చెప్పుచున్నాఁడు.—

సన్మార్గే తావ దాస్తే ప్రభవతి పురుష స్తావ దే వేన్ద్రియాణాం
లజ్జాం తావ ద్విధత్తే వినయ మపి సమాలమ్బతే తావదేవ,
భ్రూచాపాకృష్టముక్తాః శ్రవణపథగతా నీలపక్ష్మాణ ఏతే
యావల్లీలావతీనాం న హృది ధృతిముషో దృష్టిబాణాః పతన్తి. 74

శా. సారాచారముఁ బూను నింద్రియములన్ ♦ శాసించు లజ్జాన్వితుం
డై రాజిల్లుఁ బ్రశాంతిఁ జేకొను నరుం ♦ డందాఁక నెందాఁక దు
ర్వారంబుల్ శ్రుతిమార్గగాములు నుదా♦రభ్రూధనుర్ముక్తముల్
నారీవీక్షణబాణముల్ చొరవు వి♦న్నాణంబుగా డెందముల్.

చెవివఱకీడ్చి కనుబొమ లనెడువింటియందు జోడించి యేయఁబడిన నల్లని ఱెప్పలనెడు ములుకులుగలవియు, పురుషులధైర్యమును బోఁగొట్టునవియు నైనవేడుకకత్తెల చూడ్కులనెడు శరము లెంతవఱకుఁ బురుషులహృదయమున నాటవో, యంతవఱకే పురుషుఁడు సన్మార్గమునఁ బ్రవర్తింపుచున్నాఁడు. అంతవఱకే ఇంద్రియములను గెల్వఁజాలుచున్నాఁడు. అంతవఱకే చెడ్డపనులందుఁజొచ్చుటకు సంకోచపడుచున్నాఁడు. అంతవఱకే పెద్దలయందడఁకువతో నడచుచున్నాఁడు. (గర్వములేకయున్నాఁడు.)

అవ. ఇఁక రెండుశ్లోకములచే స్త్రీలమహిమ యనివార్య మనుచున్నాఁడు.—

ఉన్మత్తప్రేమసంరమ్భా దారభన్తే యదఙ్గనాః,
తత్ర ప్రత్యూహ మాధాతుం బ్రహ్మాపి ఖలు కాతరః. 75

క. ప్రేమావేశభరంబున
భామాజను లాచరించు ♦ పని మరలింపం
దామరవిరిలోఁ బొడమిన
యామేటికి నైన నలవి ♦ యగునె తలంపన్.

స్త్రీలు మిక్కుటమగు ప్రేమముతో నెట్టిపనిని జేయఁబూనినను, వారి నట్లు చేయనీకుండఁ జేయుటకు సృష్టికర్త యగుబ్రహ్మకుఁ గూడ నలవికాదు.

తావన్మహత్త్వం పాండిత్యం కులీనత్వం వివేకితా,
యావజ్జ్వలతి నాఙ్గేషు హతః పఞ్చేషు పావకః. 76

క. కులశీలవివేకంబులు
దొలఁగక నరులందు నిల్చు ♦ దుర్భరమదన
జ్వలనము సర్వాంగంబుల
నెలకొననందాక నంత ♦ నిలువం గలవే.

కూరమగుమదనాగ్ని శరీరమందుఁ బ్రవేశించి, వికారము గలిగింపకుండు నంతవఱకే నరుఁడు పండితుఁడనియు, మహిమగలవాఁడనియు, గొప్పకులమునఁ బుట్టినవాఁడనియు, మంచిచెడ్డ లెఱిఁగినవాఁ డనియుఁ బేరుపొందును.

అవ. స్త్రీలు సద్గతికి విరోధిను లనుట.—

శాస్త్రజ్ఞోఽపి ప్రగుణితనయోఽప్యాత్తబోధోఽపి బాఢం
సంసారేఽస్మిన్ భవతి విరలో భాజనం సద్గతీనామ్,
యేనైతస్మిన్నిరయనగరద్వారముద్ఘాటయన్తీ
వామాక్షీణాం భవతి కుటిలా భ్రూలతా కుఞ్చికేవ. 77

తే. శాస్త్రవిదుఁడైన బుధుఁడైన ♦ సదయుఁడైన
సద్గతికిఁ బోవు టరిది ♦ సంసారసరణి
యమపురద్వారమున కవా ♦ టములఁ గుంచి
కలునుబలె విప్పుచున్నవి ♦ కలికిబొమలు.



ఈ సంసారమున నందమగు కన్నులుగల పొలఁతులయొక్క వంకరలైన తీఁగవంటికనుబొమలు నరకపట్టణముయొక్క తలుపుదీయు కుంచకోలలవలె నున్నవి కాన నీసంసారమున మెలఁగెడు మానవుఁడు శాస్త్రజ్ఞుఁడయినను నీతిని దెలిసినవాఁడయ్యు, చక్కఁగా గురూపదేశము నందినవాఁడయినను సద్గతి నొందుట దుర్లభము.

అవ. రెండుశ్లోకములచేమదనునిమహిమవర్ణింపుచున్నాఁడు.—

కృశః కాణః ఖఞ్జః శ్రవణరహితః పుచ్ఛవికలో
వ్రణీ పూయక్లిన్నః కృమికులశతైరావృతతనుః,
క్షుధా క్షామో జీర్ణః పిఠరకకపాలార్పితగళః
శునీమన్వేతి శ్వా హత మపిచ హన్త్యేవ మదనః. 78

చ. కరము కృశించి కాల్ విరిగి ♦ కన్నులు గానక పుచ్ఛహీనమై
పురుగులు గ్రమ్ముచున్నవ్రణ ♦ పుంజము మేనలమంగ నాఁకటం
బరవశమై ఘటీముఖక ♦ పాల గళం బగుకుక్క వెంటితో
నరిగెడుఁ గూళజంతువుల ♦ నైన వధించు మనోజుఁ డక్కటా!

మిక్కిలిచిక్కి, కన్ను లొత్తిపోయి, కుంటిదయి, చెవులుదెగి, తోఁకలేనిదై, పుండ్లు దేహమెల్ల నుండఁగా వానినుండికాఱు చీముచేఁ దడిసి, పెక్కుపురువు లొడలెల్లచుట్టికొనియుండ నాఁకలిచే డస్సి యొకగుండ్రని యోటికుండపెంకును మెడకుఁ దగిలించుకొని యల్లాడుచుండు ముదుసలికుక్క కూడ నొక యాఁడుకుక్కను జూచిన దానితోఁగలియనెంచి వలపుచే వెంబడించి పోవుచుండును. మదనుఁడు చచ్చినవారికి మోహము గలిగించి యింకను జంపుచునేయుండును. మోహము చచ్చినను బోదు.

స్త్రీముద్రాం ఝషకేతనస్య పరమాం సర్వార్థసమ్పత్కరీం
యే మూఢాః ప్రవిహాయ యాన్తి కుధియో మిథ్యాఫలాన్వేషిణః,
తే తేనైవ నిహత్య నిర్దయతరం నగ్నీకృతా ముణ్డితాః
కేచిత్పఞ్చశిఖీకృతాశ్చ జటిలాః కాపాలికాశ్చాపరే. 79

చ. స్మరునకు సర్వలోకజయ ♦ సంపద లీయఁగఁ జాలుపోఁడిమిగలం
దరుణుల నిందసేయుట న ♦ ధర్మలు కొందఱు మానవుల్ దిగం
బరులును బ్రహ్మచారులుఁ గ ♦ పాలకపాణులు దండహస్తులై
తిరుగుచు నున్నవారు రతి ♦ దేవుని మీఱినభోగ మబ్బునే.

సరళమైన బుద్ధిలేనివా రగుటచే విపరీతములఁ దలఁచుమూఢులు సకలసంపదలను, సకలకార్యముల నొడఁగూర్చునట్టి మీనధ్వజుని జయప్రదమగు స్త్రీరూపముద్రి

కను విడిచి, కంటికిఁ గనఁబడని స్వర్గాదిఫలములను వెదకఁబోవుచున్నారు. వారిలోఁ గొందఱిని మన్మథుఁడు తనయాజ్ఞనుమీఱుట యను నెపమువెట్టి, దిస్సమొలగలవారిని గను (దిగంబరులనుగాను), కొందఱిని బోడులనుగాను (పరమహంసలనుగాను), కొందఱిని అచ్చటచ్చట జుట్టుపెట్టి గొరిఁగింపఁబడినవారినిగను (పంచశిఖులనుగాను), కొందఱిని జడలను గలవారినిగాను (మునులనుగాను), కొందఱిని తలపుర్రెయందు బిచ్చమెత్తువారినిగాను (కాపాలికు లనువారినిగాను) జేయుచున్నాఁడు. ఇది నిజము.

అవ. మహర్షులకుఁ గూడ నింద్రియనిగ్రహము దుర్లభమనుట.-

విశ్వామిత్రపరాశరప్రభృతయో వాతామ్బుపర్ణాశనా
స్తేఽపి స్త్రీముఖపఙ్కజం సులలితం దృష్ట్వైవ మోహంగతాః,
శాల్యన్నం సఘృతం పయోదధియుతం భుఞ్జన్తి యే మానవా
స్తేషామిన్ద్రియనిగ్రహో యదిభవే ద్విన్ధ్యః ప్లవే త్సాగరే. 80

చ. వనదళవాతముల్ మెసవు ♦ వారు పరాశరకౌశికాదులా
ఘనులును సుందరీజనులఁ ♦ గన్గొని మోహితచిత్తులైరి హె
చ్చిన ఘృతపాయసాన్నము భు♦జించెడివారలకున్ మనోజయం
బు నెగడునేని వింధ్యము స♦ముద్రజలంబులఁ దేలియాడదే.

విశ్వామిత్రుఁడు బరాశరుఁడు మొదలగు పెక్కండ్రు మహర్షులు సంసారముఁ బాసి, యాకులుదినుచు, నీళ్లుద్రాగి యడవియందుఁ దపసుచేయుచుండిరి. అట్టివారు గూడ చక్కనిస్త్రీలమోముదమ్మిని చూడఁగానే మరునికిలోఁబడి వలపునొందిరి. పెరుఁగు, పాలు, నెయ్యిచేర్చి వరియన్నమును దినుమానవుల కింద్రియనిగ్రహంబు గలిగనేని, వింధ్యపర్వతము సముద్రమునఁ దేలును. పర్వతము తేలుట యెట్లసంభావ్యమో అట్లు మానవుల కింద్రియనిగ్రహము గలుగుట దుస్తరమని భావము.

## ఋతువర్ణనపద్ధతి.

అవ. వసంతర్తువు రాఁగానే, కామోద్దీపకవస్తుప్రాదుర్భావము కలుగునని చెప్పుచున్నాఁడు.—

పరిమళభృతో వాతాః శాఖా నవాఙ్కురకోటయో
మధురవిరుతోత్కణ్ఠా వాచః ప్రియాః పికపక్షిణామ్,
విరళసురతస్వేదోద్గారా వధూవదనేన్దవః
ప్రసరతి మధౌ ధాత్ర్యాం జాతో న కస్య గుణోదయః. 81



చ. వలపు వహించె గంధగిరి♦వాతపరంపరభూరిభూజశా
ఖలు చిగిరించె నిం పెసఁగె ♦ గాకలి కోకిలలందుఁ జెక్కులం
బలుచని ఘర్మబిందువులు ♦ భామలకుం బ్రసరించె నెయ్యెడం
జెలువు ఘటింపఁ జాలదు వి♦శేషవసంతసమాగమం బిలన్.

వసంతర్తువు వచ్చినంతనే యేవస్తువు గుణసహితముగా నుండదు? సకలవస్తువులు రమ్యములైయుండును. వాయువులు కమ్మనితావిగలిగి వీఁచుచుండును. కొమ్మల కొనలందుఁ జిగుళ్లు చిగిరించుచుండును. కోకిలములు చెవులకింపుగఁ గూయుటయందాస గలిగియుండును. రాత్రులందు అతివలచంద్రబింబములంబోలు ముఖములనుండి సురతమువలనిచెమట స్వల్పముగాఁ గాఱుచుండును.

మధురయం మధురై రపి కోకిలా
కలకలై ర్మలయస్య చ వాయుభిః,
విరహిణః ప్రహిణస్తి శరీరిణో
విపది హన్త సుధాఽపి విషాయతే. 82

తే. నిండుకొని వచ్చు గంధపుఁ♦గొండచల్ల
గాలియును బికకాకలి♦కారవంబు
విరహిజనుల వధించె న♦వ్వేళఁ గాన
నమృతమును విష మగు విప♦త్ప్రాప్తియందు.

ఈవసంతర్తువును చెవుల కింపయిన కోకిలముల యవ్యక్తములగు కూఁతలచేతను, మలయమారుతములచేతను విరహు లగుజనులను జంపుచున్నది. అక్కటా! చెడుకాలంబున నమృతంబును విషమగును.

ఆవాసః కిల కించి దేవ దయితాః పార్శ్వే విలాసాలసాః
కర్ణే కోకిలకామినీకలరవః స్మేరో లతామంటపః,
గోష్ఠీ సత్కవిభిః సమం కతిపయైః సేవ్యాః సితాంశోః కరాః
కేషాంచి త్సుఖయ న్త్యవేహి హృదయే చైత్రే విచిత్రాః క్షపాః.

చ. ఘనకిలికించితప్రచుర♦కాంతలు చెంతఁ బికాంగనాకల
స్వనములు వీనులందు సుమ♦శాలి నికుంజము పుష్పమాల్యముల్
వినుతకవిప్రసంగమును ♦ వెన్నెలతేటలు భాగ్యవంతులా
జనులకుఁ జైత్రమాసమున♦సౌఖ్య మొనర్చు సుగంధితోయముల్.

దయితలవెంబడిఁ గొంచెముసేపు క్రీడించి పరుండుటచేతను, చెవులకింపగు నాఁడుకోయిలలపాటలను వినుటచేతను, చక్కఁగాఁ బూచిన తీఁగెలయిండ్లయం దుండుటచేతను, కొందఱు కవులతోడ ముచ్చటలాడుటచేతను, వెన్నెలలందుఁ బరుం డుటచేతను గొందఱుమాత్రము వసంతర్తువునందు రాత్రులందు సుఖముల ననుభవించు చుందురు.

పాన్థస్త్రీవిరహానలాహుతికలా మాతన్వతీ మఞ్జరీ
మాకన్దేషు పికాఙ్గనాభి రధునా సోత్కణ్ఠ మాలోక్యతే,
అప్యేతే నవపాటలాపరిమలప్రాగ్భారపాటచ్చరా
వాన్తి క్లాన్తివితానతానవకృతః శ్రీఖణ్డశైలానిలాః. 84

చ. వరలు వియోగినీవిరహ♦వహ్నికి నాహుతిలీలఁ బొల్చు భా
సురసహకారమంజరులఁ ♦ జూచి మదించెఁ బికంబు లిత్తఱిన్
సురతపరిశ్రమాతిశయ♦సూదనముల్ విహరించెఁ బాటలీ
పరిమళభారచోరములు ♦ బంధురచందనశైలవాతముల్.

ఈవసంతర్తువునందు బాటసారుల యతివలవిరహమనెడు నగ్నియందు వేల్చెడి హోమద్రవ్యమో యనఁదగియుండు మామిడిచిగుళ్ళను ఆఁడుకోయిలలు తమితోఁ జూచుచున్నవి. మఱియు మలయమారుతములు క్రొత్తగాఁ బూచిన శిరీషపుష్పముల నెత్తావిని జూఱకొనుచు నలసటను దీర్చునట్టివై వీచుచున్నవి.

ప్రథితః ప్రణయవతీనాం తావ త్పద మాతనోతు హృది మానః,
భవతి న యావ చ్చన్దనతరుసురభి ర్మలయపవమానః. 85

తే. అంగజునిగంధసింధురం ♦ బనఁగఁ బరఁగు
మలయజసుగంధి మలయాద్రి ♦ మారుతంబు
మలయ దెందాఁక నందాఁక ♦ మానవతుల
మానసంబున నెలకొని ♦ మాన మమరు.

లోకమున మగువలు దమభర్తలన్యకాంతలనుగూడి రన్నయీసుచే, వారు తమ కడకు వచ్చినను పెడమోముపెట్టి మాటాడక బిఱ్ఱుగలిగి కోపముతోనుందురు. అట్టి వారు చందనవృక్షములలోనుండి వీచుకమ్మనితావిగల దక్షిణపుగాలి సోఁకఁగానే, మదనపరవశలై కోపమువీడి తమంతటఁ దామే ప్రియుఁకడ కేగుదురు.

సహకారకుసుమకేసరనికరభరామోదమూర్ఛితదిగన్తే,
మధురమధువిధురమధుపే మధౌ భవే త్కస్య నోత్కణ్ఠా. 86



తే. సరససహకారకుసుమకే♦సరసమూహ
గురుతరామోదమయదిగం♦తరము మధుర
మధువిధురమధుపము మధు♦మాససమయ
మెవ్వనికి వేడ్క వాటింప ♦ దిజ్జగమున.

వసంతర్తువునందుఁ దియ్యమామిడిపూఁతయొక్క కింజల్కముల కమ్మనితావులు దిక్కులెల్ల వ్యాపించియుండును. తుమ్మెదలు పూఁదేనియలు గ్రోలుటయందు విసుఁగు చెందియుండును. ఇట్టిమనోహరమగు ఋతువునం దెవరి కాశ పుట్టకుండును? అంద ఱును వసంతకాలమునఁ బ్రేమతో వనంబులసొంపుఁ జూచుచుందురు.

అవ. గ్రీష్మర్తువును వర్ణించుచున్నాఁడు.—

అచ్ఛాచ్ఛచన్దనరసార్ద్రపరా మృగాక్ష్యో
ధారాగృహాణి కుసుమాని చ కౌముదీ చ,
మన్దో మరు త్సుమనసః శుచి హర్మ్యపృష్ఠం
గ్రీష్మే మదం చ మదనం చ వివర్ధయన్తి. 87

చ. అతిసితచందనార్ద్రరుచి♦రాంగులు భామినులున్ సుగంధసం
గత మగుమందమారుతముఁ ♦ గౌముదియున్ జలయంత్రగేహము
న్నతశుచిసౌధభాగముఘ♦నం బగు వాసనబూనుపుష్పసం
తతియు మదంబు దర్పకుని ♦ దర్పము బెంపుగఁ జేయు వేసవిన్.

గ్రీష్మర్తువునందు నిర్మలమగు మేలైనచందనముఁ బూసికొన్నవారలగు మచ్చ కంటులును, నీటిధారలు పడుయంత్రములు గలగృహములును, పుష్పములును, వెన్నె లయు, తిన్ననిగాలియు, జాజిపూవులు, వెల్లనైన మేటి యుప్పరిగలు ఇవియన్నియుఁ బురుషులకు మదమును, మన్మథవికారమును వృద్ధిఁజెందించుచున్నవి.

స్రజో హృద్యామోదా వ్యజనపవన శ్చన్ద్రకిరణాః
పరాగః కాసారో మలయజరజః సీధు విశదమ్,
శుచిః సౌధోత్సఙ్గః ప్రతను వసనం పఙ్కజదృశో
నిధాఘార్తా హ్యేత త్సుఖ ముపలభన్తే సుకృతినః. 88

ఉ. కమ్మనిదండలున్ సురఁటి ♦ గాడ్పులు వెన్నెలయుం బరాగపుం
జమ్మును మంచిగందమును ♦ సన్నపువల్వలు సీధుపానముం
దమ్మికొలంకు మేడయును ♦ దామరసాక్షు లనంగ నొప్పుభో
గమ్ములు పుణ్యవంతులకుఁ ♦ గాని లభింపవటండ్రు వేసవిన్.

వేసవికాలంబున నెండకు డస్సి పుణ్యవంతులు కమ్మనివాసనగల పూలదండలను, విసనకఱ్ఱలగాలిని, చంద్రకిరణములను, పుప్పొడిని, కొలఁకులను, స్వచ్ఛమగు మద్యమును, తెల్లనిమేడల పైభాగములను, సన్నని బట్టలను, కమలములంబోలు నేత్రములుగల స్త్రీలను వీనినిం బొంది సుఖింతురు.

సుధాశుభ్రం ధామ స్ఫురదమలరశ్మిః శశధరః
ప్రియావక్త్రామ్భోజం మలయజరసశ్చాతిసురభిః,
స్రజో హృద్యామోదా స్తదిద మఖిలం రాగిణి జనే
కరోత్యన్తః క్షోభం న తు విషయసంసర్గవిముఖే. 89

తే. కలువచెలియును బూవుదం♦డలును మంచి
గంధమును గేళిసౌధంబుఁ ♦ గలికిమోముఁ
గాముకునకు వికారంబు ♦ గలుగఁజేయుఁ
గలఁక వాటింప వెపుడు ని♦ష్కాముసకును.

సున్నపుఁబూఁతచేఁ దెల్లనైనయిల్లును, వెలుఁగుచున్న వెల్లనైన కిరణములుగల చంద్రుఁడును, ప్రియురాలియొక్క కమలముంబోలు ముఖమును, మిక్కిలి పరిమళించుచున్న గంధపుఁబొడియు, మనోహరమగు వాసనగల పూవులదండలు ఇవియన్నియు సంసారసక్తి గలవారికి మనంబునఁ గలవరమును గలిగించునుగాని, విషయసుఖములం దపేక్షలేనివారి కెట్టిహానియుఁ జేయఁజాలవు.

అవ. వర్షర్తువును వర్ణించుచున్నాఁడు.—

తరుణీ వైషా దీపితకామా వికసితజాతీపుష్పసుగన్ధిః,
ఉన్నతపీనపయోధరభారా ప్రావృట్ తనుతే కస్య న హర్షమ్. 90

క. కామోద్దీపకయు సము
ద్దామపయోధరవిరాజి♦తయు జాతిసుమ
స్తోమసుగంధియు నై ప
ర్వామోద మొనర్చెఁ బ్రావృ♦డంగన భళిరే!

కామమును వృద్ధిచేయునదియు, పూచిన జాజిపూవుల కమ్మనితావిగలదియు, ఎత్తైన గొప్ప పయోధరములుగలదియు, (స్త్రీపక్షమున గబ్బిగుబ్బలుగలదియు) నైనవర్షర్తువు జవరాలివలె నెవరికి సంతసమును గలిగింపదు.

వియ దుపచితమేఘం భూమయః కన్దలిన్యో
నవకుటజకదమ్బామోదినో గంధవాహాః,



శిఖికులకలకేకారావరమ్యా వనాన్తాః
సుఖిన మసుఖినం వా సర్వ ముత్కణ్ఠయంతి. 91

చ. జలధరమాలికాఖచిత♦చారునభంబు నవాంకురప్రభా
లలితమహీతలంబును గ♦లస్వన కేకికులోల్లసద్వన
స్థలములు జాతినీపకుట♦జస్ఫుటగంధిలగంధవాహముల్
నెలకొని యెల్లవారలకు ♦ నిండుముదంబు ఘటించె నత్తఱిన్.

దట్టములయిన మబ్బులతోఁగూడిన యాకసంబును, పుట్టకొక్కులతోఁగూడిన పొలములును, అప్పుడేపూచిన యడవిమల్లెపూలతావితోఁగూడి వీచెడివాయువులును, నెమళ్లగుంపుల యింపగుకూతలతోఁగూడి మనోహరంబులైయుండువనప్రదేశములును, ఈవస్తువులు సుఖవంతునినైనను, దుఃఖవంతునినైనను అందఱిని సంతోషపఱచును.

అవ. ప్రియలంబాసిన బాటసారులదశను వర్ణించుచున్నాఁడు.—

ఉపరి ఘనం ఘనపటలం తిర్యగ్గిరయోఽపి నర్తితమయూరాః,
క్షితి రపి కన్దళధవళా దృష్టిం పథికః క్వ పాతయతి. 92

తే. మీఁద మబ్బులు మోసులు ♦ మిసిమిమాపఁ
బుడమియును గందళమ్ములఁ ♦ బొదల నాడు
నెమ్మిగమితోడ దెసల శై♦లమ్ము లుండ
విరహిజనుఁ డెందుఁ దనదృష్టి ♦ విరియఁ జేయు.

మేఘములు నెమళ్లు పుట్టగొడుగు మొదలగునవి విరహులకుఁ గామోద్దీపకములు గనుక, ప్రియాంగనలఁబాసి తిరుగుచుండుబాటసారులు తమదృష్టులను మీఁద నేయుంచుచుఁ బోవుదమనిన పైన దట్టములైన మేఘములున్నవి. అడ్డముగాఁ జూచుచుఁబోవుదమనిన నెమళ్ళు పర్వతములయందు నాట్యములాడుచున్నవి. క్రిందఁజూచుచుఁబోవుదమనిన, పుడమియుఁ బుట్టఁగొడుగులచే దెల్లబాఱియున్నవి. పైనను క్రిందను రెండుపార్శ్వములందునుగాక బాటసారి తనదృష్టి నెచట్టునకుఁ బోనిచ్చుచుఁ బోగలఁడు (కావున నట్టిసమయములందుఁ గాంతతోడియునికియే మంచిది).

ఇతో విద్యుద్వల్లీవిలసిత మితః కేతకితరోః
స్ఫురద్గన్ధః ప్రోద్యజ్జలదనినదస్ఫూర్జిత మితః,
ఇతః కేకిక్రీడాకలకలరవః పక్ష్మలదృశాం
కథం యాస్యన్త్యేతే విరహదివసాః సమ్భృతరసాః. 93

ఉ. ఇక్కడఁ గ్రొమ్మెఱుంగుఁదివె ♦ లిక్కడఁ గేతకిగంధవైభవం
బిక్కడ భూరిగర్జితము ♦ లిక్కడ మత్తమయూరనిస్స్వనం
బక్కట యీరసోజ్జ్వలము ♦ లైనదినంబులు మన్మథార్తి పెం
పెక్కు వియోగినీజనుల ♦ కెట్లు చనం గల వెన్నిచూడఁగన్.

ఒకతట్టు మెఱుపుఁదీగెలు మెఱయుటయు, ఒకతట్టు మొగలిపూలయొక్క సువాసనయు, మఱియొకప్రక్కఁ గ్రమ్ముచుండు మొగుళులయుఱుములును, వేఱొకప్రక్క నెమళులయొక్క యాటలయందలి యవ్యక్తమధుర మగుధ్వనులును అనునిశ్శృంగారరసోద్దీపకము లగుపదార్థములతోఁగూడిన యీదినములను, విరహిణులగుకాంత లెట్టులు గడపఁగలరు? పైఁజెప్పిన యన్నివస్తువులు విరహోద్దీపకములు గావున నీదినంబులందు విరహిణులగు స్త్రీలు బాధపడుదురనిభావము.

అసూచీసంసారే తమసి నభసి ప్రౌఢజలద
ధ్వనిప్రాయే తస్మిన్ పతతి పృషతానాంచ నిచయే,
ఇదం సౌదామన్యాః కనకకమనీయం విలసితం
ముదం చ గ్లానిం చ ప్రథయతి పథిష్వేవ సుదృశామ్. 94

చ. ఘనతిమిరంబు సూది కవ♦కాశ మొసంగమి మీఁద వారిద
స్వనముల మిన్ను పిక్కటిల ♦ వారికణంబులు రాలుచుండఁగాఁ
గనకపురేఖలం దెగడు ♦ వారికణంబులు జార కామినీ
జనములకున్ మదంబును వి♦షాదమునుం బ్రకటించెఁ ద్రోవలన్.

దట్టములయిన మబ్బులయుఱుములతోఁగూడినవర్షర్తువునందు సూదిదూఱుటకుఁ గూడ వలనుపడనంత దట్టమయినచీఁకటియందు వానచినుకులు గురియునప్పుడు ఈపసిఁడివంటిచాయగల మెఱుపువెలుఁగుబాటలందే భర్తలతోఁ గూడియుండుకాంతలకు సంతసమును, ప్రియులం బాసియుండునతివలకు వ్యసనమును గలిగించుచున్నవి.

ఆసారేణ న హర్మ్యతః ప్రియతమై ర్యాతుం బహి శ్శక్యతే
శీతోత్కమ్పనిమిత్త మాయతదృశాగాఢం సమాలిఙ్గ్యతే,
జాతాః శీతలశీకరా శ్చ మరుతో రత్యన్తభేదచ్ఛిదో
ధన్యానాం బత దుర్దినం సుదినతాం యాతి ప్రియాసఙ్గమే. 95

ఉ. కేరుచు మేడనుండి వెలి♦కిం జన శక్యము గాక యుండె నా
సారముచేత శీతమున ♦ జవ్వనికౌఁగిలి గట్టె శీకరో



దారసమీరణంబు సుర♦తశ్రమవారణ మయ్యె దుర్దినం
బారయ నయ్యెడన్ సుదిన ♦ మయ్యెఁ గృతార్థుల కంగనారతిన్.

జడివాన కురియుటచేఁ బ్రియులగువారు మేడలు విడిచి వెలుపటఁ బోవుట వీలుకాదు. విశాలనేత్రలగుపొలఁతులు చలికి వణఁకుచుఁ దమ ప్రియులను గట్టిగఁ గౌఁగిలించుకొందురు. అలసటను బాగుగాఁ బోఁగొట్టునట్టి చల్లనితుంపురులతోఁగూడిన గాలులు వీచుచుండును. కావున దుర్దినము (సూర్యరశ్మి లేనిదినము 'దుర్దినము' అనఁబడును.) పుణ్యాత్ములకు దమయతివలతోడికూడికచే సుదినత్వమునొందుచుండును.

అవ. శరదృతువును వర్ణించుచున్నాఁడు.—

అర్ధం సుప్త్వా నిశాయాః సరభససురతాయాసఖిన్నశ్లథాఙ్గః
ప్రోద్భూతాసహ్యతృష్ణో మధుమదనిరతో హర్మ్యపృష్ఠే వివిక్తే,
సంభోగక్లాన్తకాన్తాశిథిలభుజలతావర్జితం కర్కరీతో
జ్యోత్స్నాభిన్నాచ్ఛధారం పిబతి న సలిలం శారదం మన్దభాగ్యః.

చ. ప్రియముగ రే సగంబు నిదు♦రించి నితాంతరతాంతవిహ్వలుం
డయి తగఁ జెంది యాసవము♦దాలసుఁ డై రతిఖిన్న కామినీ
శయమునఁ గర్కరీగళిత♦చంద్రవిభాచ్ఛశరజ్జలంబు లా
రయఁ గృతపుణ్యుఁ డింపెసఁగఁ ♦ ద్రాగు రహస్థితసౌధసీమలన్.

ఎట్టులో సగమురాత్రినిఱుకు నిద్రించి, యావల నిబ్బరమైన సంభోగమందలి యలసటచే డస్సి వీడినయంగములు గలవాఁడును, విశేషమైన యోర్వరానియాసగల వాఁడగుటచే మద్యపానమునం దెక్కువ మక్కువగలవాఁడును నై యేపురుషుఁ డేకాంతస్థలంబున, సంభోగమునఁ దనప్రియుని గట్టిగఁ గౌఁగిలించికొని, సంభోగాంతమున డస్సినదై తనచేతికట్టును వీడినయతిస తనశిథిలభుజముచేఁ దెచ్చియిచ్చిన వెన్నెలతోఁ గూడిన నిర్మలధారగల శరత్కాలమందలి యుదకంబును దోసకాయతోఁగూడఁ ద్రావఁడో, ఆపురుషుఁ డదృష్టహీనుఁడు (ఏపురుషుఁడు శరత్కాలంబున సురతశ్రమముచే డస్సినవాఁడై మేడయొక్క పైభాగమున నట్టికాంతచేఁ దెచ్చియిచ్చినయుదకంబును ద్రాగునో, ఆపురుషుఁడు ధన్యుఁడని భావము).

అవ. హేమంతఋతువును వర్ణించుచున్నాఁడు.—

హేమన్తే దధిదుగ్ధసర్పిరశనా మాఞ్జిష్ఠవాసోభృతః
కాశ్మీరద్రవసాన్ద్రదిగ్ధవపుషః ఖిన్నా విచిత్రై రతైః,

వృత్తోరుస్తనకామినీజనకృతాశ్లేషా గృహాభ్యన్తరే
తామ్బూలీదళపూగపూరితముఖా ధన్యాః సుఖం శేరతే. 97

చ. ఘృతదధిదుగ్ధభోజన మొ♦గిఁ భుజియించి సురంగవస్త్రముల్
హితముగఁ దాల్చి కుంకుమము♦ హెచ్చుగ మేన నలంది ధన్యు ల
ద్భుతరతిఖిన్ను లై విడెము ♦ పుక్కిట నుంచి పృథుస్తనాంగనా
కృతపరిరంభు లై కడు ర♦మింతురు మేడలలోన సీతునన్.

హేమంతర్తువునందు ధన్యులగుపురుషులు పాలు పెరుగు నెయ్యి చక్కఁగా వేసికొని భుజింపుచు, మంజిష్ఠవర్ణముఁగల బట్టలను గట్టుకొని, దట్టముగా మేనికి కుంకుమపూఁతఁబూసికొని నానావిధసురతములచే డస్సినవారలై, బలిసినతొడ లుబ్బుగుబ్బలుం గలకాంతలచే గట్టిగఁ గౌఁగిలింపఁబడినవారలై, తాంబూలము చక్కఁగా నములుచు, సుఖముగాఁ బరుండుదురు.

ప్రోద్యత్ప్రౌఢప్రియంగుద్యుతిభృతివికసత్కున్దమాద్యద్ద్విరేఫే
కాలే ప్రాలేయవాతప్రచలవిలసితోదారమన్దారధామ్ని,
యేషాం నో కణ్ఠలగ్నా క్షణ మపి తుహినక్షోదదక్షా మృగాక్షీ
తేషామాయామయామా యమసదనసమా యామినీ యాతియూ
[నామ్.

స్రగ్ధర. ప్రోద్యత్ప్రౌఢప్రియంగు♦స్ఫుటరుచియుతమై♦ఫుల్లమల్లీమతల్లీ
మాద్యత్సారంగమై హై♦మనపవన చల♦న్మంజుమందారభూజా
తద్యోతం బైన హేమం♦తమున విరహసం♦తప్తు లౌవారి కెల్లన్
సద్యామాయామరాత్రుల్ ♦ చను విషమయమ ♦ స్థానసాదృశ్య
మూర్తిన్

దట్టముగాఁబూచిన ప్రేంకణపుఁబూవులకాంతిఁ దాల్చినదియు, విరియుచున్న కొల్లలందుఁదిరుగుచు మత్తిలియున్నతుమ్మెదలు గలదియు, మంచుగాలివీచుటచేఁ గదలుచున్న వికసించిన మందారపుష్పదండలు గలదియు నైన హేమంతర్తువునందు మంచుగాలివలనిబాధ దీర్పఁగల మచ్చెకంటి నిముసమైనను ఏపురుషులను గౌఁగిలింపదో, యాపురుషుల కాహేమంతర్తువునందలి నిడుదజాములుగలరాత్రి నరకసమమై బహుకష్టముతోఁ గడచును.



అవ. శిశిరర్తువును వర్ణించుచున్నాఁడు.—

చుమ్బన్తో గణ్డభిత్తీ రలకవతి ముఖే సీత్కృతా న్యాదధానాః
వక్ష స్సూత్కఞ్చుకేషు స్తనభరపులకోద్భేద మాపాదయన్తః,
ఊరూ నాకమ్పయన్తః పృథుజఘనతటా త్స్రంసయన్తో ఽంశుకాని
వ్యక్తం కాన్తాజనానాం విటచరితభృతః శైశిరా వాన్తి వాతాః.

ఉ. చెక్కులు ముద్దుగొంచు ముఖ♦సీమను సీత్కృతులన్ ఘటించుచుం
జక్కనిచన్నవం బులక♦జాలములన్ మొలపించుచుం గటిం
జెక్కినచేలముం దొలఁగ ♦ జేయుచు శైశిరమారుతంబు లిం
పెక్కఁగఁ గాంతలందు విట♦కృత్యముఁ బూని చరించు నిత్తఱిన్.

శిశిరర్తువునందలిగాడ్పులు జవరాండ్రచెక్కిళ్లను ముద్దిడుచు (తాఁకుచు), ముంగురులు గలమోమున సీత్కారములు గావించుచు గుత్తపురవికెలు దొడిఁగినను చలిచే గగుర్పాటు పుట్టించుచు, తొడలఁ గదలించుచు వలుఁదపిఱుఁదులనుండి కోకలు వీడఁజేయుచు విటులుచేయుపనులం జేయుచు వీచుచున్నవి.

కేశా నాకులయన్ దృశో ముకుళయన్ వాసో బలా దాక్షిప
న్నాతన్వ న్పులకోద్గమం ప్రకటయ న్నఙ్గేషు కంపం శనైః,
వారం వార ముదారసీత్కృతకృతో దన్తచ్ఛదాన్ పీడయన్
ప్రాయః శైశిర ఏష సంప్రతి మరుత్కాన్తాసు కాన్తాయతే. 100

ఉ. వేనలిఁ గ్రొన్ననల్ చెదర♦విప్పుచుఁ గన్నుల మాయఁ జేయుచుం
బూనిన సీత్కృతుల్ నెఱపు♦మోవుల నొక్కుచు నీవు లూడ్చుచున్
జానుగ మేనులం బులక♦జాలములన్ వెలయించుచున్ బర
స్త్రీనికరంబునందుఁ బతి♦రీతిఁ జరించు సమీరుఁ డత్తఱిన్.

వాయువు తలవట్టియూడ్చుచు, కన్నులను మూయుచు, బలాత్కారముగా బట్టఁబట్టిలాగుచు, గగుర్పాటుపుట్టఁజేయుచు, మెల్ల మెల్లఁగ నంగముల వణఁకుపుట్టించుచు, మాటిమాటికి గొప్పసీత్కారములఁజేయుచు, నొడుగఱచుచుఁ దఱుచుగాఁగాంతలందుఁ బ్రియునిమాడ్కి నాచరించుచున్నాఁడు.

చ. ఉపనిషదర్థవేద్య దురి♦తోగ్రభవామయవైద్య వాసరా
ధిపశశివహ్నినేత్ర సము♦దీర్ణపవిత్రచరిత్ర సత్కృపా
స్నపితసమస్తలోక కర♦సంగతదివ్యపినాక భీకర
ద్విపసురవైరిభంజన సు♦ధీజనరంజన నిర్గతాంజనా.

ఉత్సాహ. తారకాసురారిజనక ♦ దక్షయాగభంజనా
తారకాచలేంద్రవాస ♦ దానకల్పభూరుహా
తారకాధినాయకావ♦తంస భవపయోధిసం
తారకాభిధాన యాతు♦ధానవైరిసన్నుతా.

క. దండధరచండవిక్రమ, దండనపాండిత్యమండి♦తప్రబలభుజా
దంక సుపర్వాలయకో, దండ యఖండప్రమోద♦తాండవలోలా.

గద్యము. ఇది శ్రీ మదుమామహేశ్వరకరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుఁగు లక్ష్మణకవిరాజపౌత్త్ర తిమ్మనార్యపుత్త్ర వివిధవిద్వజ్జనవిధేయ లక్ష్మణకవినామధేయ ప్రణీతం బయినసుభాషితరత్నావళీకావ్యంబునందు శృంగారశతకంబున స్త్రీప్రశంసయు, సంభోగవర్ణనంబును, కామినీగర్హణంబును, సువిరక్తదుర్విరక్తపద్ధతియు, ఋతువర్ణనంబు ననునైదుప్రకరణంబులు గలది ద్వితీయాశ్వాసము.

శృంగారశతకము సమాప్తము.

---

శ్రీరస్తు.

# భర్తృహరిసుభాషితము

## వైరాగ్యశతకము.

### తృష్ణాదూషణము.

చూడోత్తంసితచారుచన్ద్రకలికాచంచచ్ఛిఖాభాస్వరో
లీలాదగ్ధవిలోలకామశలభ శ్శ్రేయోదశాగ్రే స్ఫురన్,
అన్తస్స్ఫూర్జదపారమోహతిమిరప్రాగ్భార ముచ్చాటయం
శ్చేత స్సద్మని యోగినాం విజయతే జ్ఞానప్రదీపో హరః. 1

క. శ్రీరమణధృతమృదంగగ
భీరధిమింధిమినినాద♦భేదక్రమయో
గ్యారంభగుంభనటన
శ్రీరంజిత సుఖనివేశ! ♦ శ్రీసోమేశా.

చ. కలితవతంసితేందుకలి♦కాశిఖచే విలసిల్లి చిత్తభూ
శలభము నుగ్గుసేసి శుభ♦సారదశాగమునన్ వెలుంగుచున్
బలవదపారమోహభర♦బాధతమోహభరంబు సేయుచుం
దెలివి వెలుంగు పొల్చు శివ♦దేవుఁడు యోగిమనోంబుజంబులన్.

శిరోభూషణముగాఁ దాల్పఁబడిన చంద్రరేఖ యను కొనగలిగి కాముఁడను మిడుతను మసిచేసి, శ్రేయస్సనెడివత్తి తుదభాసిల్లు లోనియజ్ఞానమనెడు గాఢాంధకారమును మాయించుచు హరుఁడను జ్ఞానప్రదీపము యోగుల హృదయము లనెడు నిండ్లలో వెలుఁగుచున్నది.

భ్రాన్తం దేశ మనేకదుర్గవిషమం ప్రాప్తం నకించి త్ఫలం
త్యక్త్వా జాతికులాభిమాన ముచితం సేవా కృతా నిష్ఫలా,
భుక్తం మానవివర్జితం పరగృహే ష్వాశంకయా కాకవ
త్తృష్ణే! జృమ్భసి పాపకర్మ నిరతే నాద్యాపి సంతుష్యసి. 2

చ. విసికితి దుర్గదుర్విషయవిభ్రమయుక్తిఁ గులాభిమానముం
బసచెడ సేవ చేసితి విపన్నుఁడనై పరగేహసీమ వా
యసము వలెన్ భుజించితిఁ బ్రయత్నము నిష్ఫలమై నశించె సం
తసపడ వుగ్రకర్మపిశునత్వము చూపెద వాశ యేటికిన్

అడవులలోఁ గొండలలో నదులలోఁ దిరుగరానిదేశ మెల్లఁ దిరిగి తిరిగి విసికితిని. లేశమైనను లాభము కలుగలేదు. ఉండవలసిన జాత్యభిమానమును గులాభిమానమును విడిచి నిష్ఫలమైన సేవావృత్తి నాచరించితిని. సిగ్గువోనాడి కాకివలె నితరులకొంపల బెదరుచుఁ దిండితిననైతిని. పాపకర్మలకుఁ బాల్పఱుచునో యాశా! యింకను బెచ్చు పెరుఁగుచునే యుంటివిగాని పరితృప్తి చెందవు గదా.

ఉత్ఖాతం నిధిశఙ్కయా క్షితితలం ధ్మాతా గిరేర్ధాతవో
నిస్తీర్ణ స్సరితాంపతి ర్నృపతయో యత్నేన సంతోషితాః,
మన్త్రారాధనతత్పరేణ మనసా నీతా శ్శ్మశానే నిశాః
ప్రాప్తం కాణవరాటకో౽పి న మయా తృష్ణే! సకామా భవ.

చ. నిధి యనుశంక భూతలము నిచ్చలుఁ ద్రవ్వితి నావచే మహో
దధిఁ దరియించితిన్ శిఖరిధాతువు లూఁదితి రాజుఁ గొల్చితిన్
వ్యథ గొని ఘోరమంత్రజప మర్థి నొనర్చితి గవ్వయైన నే
విధమునఁ బొందనైతిఁ గదవే ముద మందఁగదే దురాశరో. 3

నిక్షేపముదొరకునను నాశతో నేలఁ ద్రవ్వితిని. బంగరుకొఱకై కొండల మీఁది మణిశిల మొదలగు ధాతువులఁ గరఁగించితిని. సముద్ర ప్రయాణములఁ గావించితిని కష్టపడి వారి మనసువచ్చునట్లు నడచుకొని రాజుల సంతసపెట్టితిని. మంత్రారాధనముల నొనర్చుచు శ్మశానములందుఁ బెక్కురాత్రులు గడిపితిని. ఇంతచేసియు నేనొకగ్రుడ్డి గవ్వనైనఁ గాంచనైతిని. ఆశా! యింక సంతోషపడి యూరకుండుము.

ఖలోల్లాసా స్సోఢాః కథ మపి తదారాధనపరై
ర్నిగృహ్యాన్తర్బాష్పం హసిత మపి శూన్యేన మనసా,
కృతో విత్తస్తమ్భప్రతిహతధియా మఞ్జలి రపి
త్వ మాశే! మోఘాశే! కి మపర మతో నర్తయసి మామ్. 4

చ పలువలు పల్కుమాటల లోకభంగి సహించితి బాష్పవారి లో
పల నెహరించి శూన్యమగుభావమునన్ వెడనవ్వు నవ్వితిన్



బొలుపఱి విత్తజాడ్యహతబుద్ధుల కంజలి చేసితిం గటా
తలఁకక యింక నేపనికిఁ దార్చెదు నన్ను దురాశ నీ విటన్.

నీచులఁ గొలుచుచు వారిదుర్భాషలెల్ల సైఁచితిని. పొరలివచ్చుకన్నీటిని లోలోన మ్రింగి మనసునలేని వెడనవ్వుసయితము నవ్వితిని. ధనగర్వముచే మతిమాలినవారికి దోసిలియొగ్గితిని. ఆశా! నీకోరిక యీడేఱలేదు. ఇంక నన్నేమి యాడించెదవు.

అమీషాం ప్రాణానాం తులితబిసినీపత్రపయసాం
కృతే కిం నాస్మాభి ర్విగళితవివేకై ర్వ్యవసితమ్,
య దాఢ్యానా మగ్రే ద్రవిణమదనిస్సంజ్ఞ మనసాం
కృతం వీతవ్రీడై ర్నిజగుణకథాపాతక మపి. 5

మ. నళినీపత్రగతాంబుచంచలము లెన్నం బ్రాణముల్ వీనికై
గళితప్రజ్ఞత మేము చేయనియసత్కార్యంబు లే దేమియున్
బలవద్విత్తమదాతిరేకజనితాపస్మారులై నట్టి లు
బ్ధుల మ్రోలన్ నిజసద్గుణస్తుతి మహాదోషంబు గావించుటన్.

తామరాకులోని జలబిందువులవలెఁ జంచలములైన యీప్రాణములకొఱకై మతిమాలిన మనమెట్టి దుష్కార్యము చేయఁబూనము? ధనమదముచే మది మఱచియున్న ఘనికులచెంత సిగ్గువదలి స్వగుణసంకీర్తన మనుపాతకమునుసయితము మార్జించుకొంటిమి.

క్షాన్తం న క్షమయా గృహోచితసుఖం త్యక్తం న సంతోషత
స్సోఢో దుస్సహశీతవాతపవనక్లేశో న తప్తం తపః,
ధ్యాతం విత్త మహర్నిశం నియమితప్రాణై ర్న శమ్భోః పదం
తత్తత్కర్మ కృతం య దేవ మునిభి స్తైస్తైః ఫలై ర్వఞ్చితాః. 6

మ. క్షమచేఁ గాదవమాన మోర్చుట మహాసంతుష్టిచేఁ గాదు గే
హమునం దైనసుఖంబు మానుట తపోవ్యాసక్తిచేఁ గాదు దు
ర్దమశీతోష్ణజయంబు కాదు హరుపై ధ్యానంబు విత్తంబుపై
నమరెన్ మాకు మునీంద్రకృత్యములు లేవా సత్ఫలాభ్యున్నతుల్.

నిందావమానాదులను సహించియుంటిమి కాని యది క్షమవలనఁ గాదు. సంసారసౌఖ్యమును విడనాడితిమి కాని యది పరమానందముతోఁ గాదు. ఎండవానలకోర్చియుంటిమి గాని యది తప మొనరించుటకై కాదు. రేయనక పవలనక ధనమును ధ్యానించితిమి కాని మనోవృత్తుల నాపి శివచరణముల ధ్యానింపలేదు. మునులుచేయు నాయాకర్మలఁ జేయనేచేసితిమి కాని వానిఫలములు మమ్ము మోసపుచ్చెను.

భోగా న భుక్తా వయమేవ భుక్తా స్తపో న తప్తం వయమేవ తప్తాః,
కాలో న యాతో వయమేవ యాతా స్తృష్ణా న జీర్ణా వయమేవ జీర్ణాః.

క. భోగానుభవంబు తపో
యోగము కాలంబు చనుట ♦ యును ఘనతృష్ణో
ద్యోగవిరామము లేదహ
హా గురుత వహించి తృష్ణ ♦ యలజడి తెచ్చెన్. 7

భోగములు మాచే ననుభవింపఁబడలేదు. మేమే యనుభవింపఁబడితిమి. తపస్సు మాచేఁ దపింపఁబడలేదు. మేమే తద్దయు సంతప్తులమైతిమి. కాలము పోవుట లేదు. మేమే పోవువారము. ఆశ బిగి దప్పలేదు. మేమే బిగి దప్పినవారమైతిమి.

వలిభి ర్ముఖ మాక్రాన్తం పలితై రంకితం శిరః,
గాత్రాణి శిథిలాయన్తే తృష్ణైకా తరుణాయతే.

క. కరచరణాద్యవయవముల
భర ముడిగెన్ వళులు మొగము ♦ పై నిండారెన్
శిరసెల్లఁ దెల్లవాఱెను
దరిమాలినతృష్ణ యొకఁడె ♦ తరుణతఁ బూనెన్.

మొగమెల్ల ముడుతలావహిల్లినవి. తలయెల్ల నరసినది. అంగములు పట్టువదలుచున్నవి. ఒక్కయాశమాత్రము విజృంభించుచున్నది.

నివృత్తా భోగేచ్ఛా పురుషబహుమానో విగళిత
స్సమానా స్స్వర్యాతా స్సపది సుహృదో జీవితసమాః,
శనై ర్యష్ట్యుత్థానం ఘనతిమిరరుద్ధే చ నయనే
అహో దృష్టః కాయ స్తదపి మరణాపాయచకితః. 9

శా. భోగాపేక్ష తొలంగెఁ బూజ్యత చెడెన్ ♦ బోరానిమిత్రుల్ మహా
భాగుల్ సెల్లిరి దండ మూఁతగొనుటల్ ♦ ప్రాప్తించెఁ గన్నుల్ తమో
రోగచ్ఛన్నము లయ్యె దేహము జరా ♦ రూఢంబు ప్రాణానిల
త్యాగాపాయభయంబునన్ వడఁకెదున్ ♦ దా నెంత సమ్మూఢమో.

అనుభవింపవలయు ననెడుకోరిక యడుగంటినది. పురుషుఁడ ననుకొనుబింకము చల్లనారినది. ప్రాణసమానులైన తోడిచెలికాండ్రు స్వర్గస్థులైరి. నేనా మూఁడుకాళ్లముసలినైతిని. కఱ్ఱలేనిది నిలువఁజాలను. కనులు పొరలు గ్రమ్మి యగపడుటలేదు.



అయ్యో! ఈ సిగ్గుమాలినకాయ మిట్టియవస్థనున్నను, బ్రాణములు వదలవలయునే యని భయపడుచునే యున్నదిగదా.

ఆశా నామ నదీ మనోరథజలా తృష్ణాతరంగాకులా
రాగగ్రాహవతీ వితర్కవిహగా ధైర్యద్రుమధ్వంసినీ,
మోహావర్తసుదుస్తరాతిగహనా ప్రోత్తుఙ్గచిన్తాతటీ
తస్యాః పారగతా విశుద్ధమనసో నన్దన్తి యోగీశ్వరాః. 10

చ. కలితమనోరథంబు లుద ♦ కంబులు తృష్ణలు భూరివీచికా
వళు లనురాగముల్ మకర ♦ వర్గము మోహవితర్కముల్ సుడుల్
పులుఁగులు గాఁగ ధైర్యఫల ♦ భూజముఁ గూల్చు దురాశ పేరిపు
ష్కలనది దాఁటి నిత్యసుఖ ♦ సంపదఁ గాంతురు యోగిపుంగవుల్.

కోరిక లనుజలము, అభిలాష లనుతరంగములు, అనురాగవృత్తు లనుమొసళ్లు, సందేహము లనుపక్షులు, అజ్ఞానమనెడిసుడులు, ఎడతెగనిచింతయనెడియొడ్లును గల్గి ధైర్యమనువృక్షమును బెల్లగించివేయునట్టియాశ యనుదాఁటరానినదిని, పరిశుద్ధహృదయులైన యోగీశ్వరులు తరించి యావల నానందమునఁ జెలఁగుచుందురు.

## విషయపరిత్యాగవిడంబనము.

న సంసారోత్పన్నం చరిత మనుపశ్యామి కుశలం
విపాకః పుణ్యానాం జనయతి భయం మే విమృశతః,
మహద్భిః పుణ్యౌఘై శ్చిరపరిగృహీతా హి విషయా
మహాన్తో జాయన్తే వ్యసన మివ దాతుం విషయిణామ్. 11

చ. భవమునఁ బుట్టుసత్క్రియ శు ♦ భం బని చూడము పుణ్యకర్మగౌ
రవఫలమైనసంపద క ♦ రంబు భయావహ మెన్నిచూచినం
బ్రవిమలపూర్వపుణ్యసము ♦ పార్జితచందనముఖ్యభోగవై
భవమును భోగశీలుర క ♦ పాయము చేయను వృద్ధిబొందెడున్.

సంసారప్రచర్య మేలుగా నాకగపడుటలేదు. పుణ్యములపరిణామమ్మును విచారింపఁగా భయమునే కలిగించుచున్నది. ఎన్నిపూర్వపుణ్యములచేతనో లభించుచందనవనితాదివిషయములును దటిగిపోవుటచే దుఃఖమునే కలిగించుచున్నవి.

అవశ్యం యాతార శ్చిరతర ముషిత్వాఽపి విషయా
వియోగే కో భేద స్త్యజతి స జనో యత్స్వయ మమూన్,

వ్రజన్త స్స్వాతంత్ర్యా దతులపరితాపాయ మనస
స్స్వయం త్యక్తా హ్యేతే శమసుఖ మనన్తం విదధతి. 12

చ. ఉరుగతితోడ నేగుఁ దడ♦వుండియు భోగము లట్టివానిఁ దా
నరుఁడు పరిత్యజింపఁడు క♦నం గనఁ దద్విరహంబు భిన్నమే
పురుషునిభోగముల్ విడిచి ♦ భూరిమనోవ్యథ లాచరించు నా
పురుషుఁడె భోగముల్ విడిచి♦పొందు నిరామయశాంతిసౌఖ్యముల్.

విషయానుభవములు చిరకాలమున్నను నెప్పటికేని తప్పక విడనాడునవియే. ఇట్టిచోఁ బురుషుఁడు వానిని దానేయేల విడువరాదు? ఎట్లయిననేమి? ఇదికాక వానియంత నవి విడనాడిపోవునేని మనస్సు కెంతో సంతాపము కలుగును. కావునఁ దానే త్యజించివైచినచో మిక్కిలి మనశ్శాంతిని బొందఁగలఁడు గదా!

బ్రహ్మజ్ఞానవివేకినోఽమలధియః కుర్వ న్త్యహో దుష్కరం
యన్ముంచ న్త్యుపభోగభాంజ్యపి ధనా న్యేకాన్తతో నిస్పృహాః,
న ప్రాప్తాని పురా న సంప్రతి న చ ప్రాప్తౌ దృఢప్రత్యయో
వాఞ్ఛామాత్రపరిగ్రహా ణ్యపి పరం త్యక్తుం న శక్తా వయమ్. 13

ఉ. అనఘులు బోధపూర్ణులు మ♦హాత్ములు భోగనిధాన మౌమహా
ధనముఁ బరిత్యజింతురు గ♦తస్పృహులై పరమాద్భుతంబుగా
మునుపును బొందకిప్పుడును ♦ ముట్టక యింకనుఁ జెందలేక నె
మ్మనమునఁ దోఁచుభోగముల♦మానఁగఁజాలము మేమొకింతయున్.

బ్రహ్మజ్ఞానముచేఁ బరిశుద్ధ మగుచిత్తము గలధన్యు లెంతదుష్కరకార్యముల నేని చేయఁజాలుదురు. ఇదె భోగోపయుక్తమయినను ధనమును నిస్పృహులై సంపూర్ణముగాఁ బరిత్యజించుచున్నారుగదా! అద్దిరా! మనకన్ననో ఇంతకుము న్నీధనము కలిగియుండలేదు. ఇప్పుడు చేకుఱలేదు. ముందురాఁబోవు ననెడునమ్మకములేదు. తలంపులు మాత్రమే కలుగునదయ్యు నీధనమును వీడలేకున్నాము.

ధన్యానాం గిరికంధరేషు వసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానన్దాశ్రుజలం పిబన్తి శకునా నిశ్శఙ్క మఙ్కేశయాః,
అస్మాకం తు మనోరథోపరచితప్రాసాదవాపీతట
క్రీడాకానన కేళికౌతుకజుషా మాయుః పరిక్షీయతే. 14

చ. గిరిగుహలన్ వసించి వృష♦కేతన చింతన మాచరించు స
త్పురుషులసమ్మదాశ్రుకణ♦పుంజముఁ గ్రోల్చుచు నంకశయ్యలం



దిరవుగ నుండుఁ బక్షులు స♦మిద్ధమనఃకృతసౌధవాపికా
వరవని కేళిశీలు రగు♦వారల కాయువె విక్షతం బగున్.

కొండగుహలందు వసించి నిరంతరముఁ బరబ్రహ్మచింతనము గావించు ధన్యాత్ముల కన్నులనుండి తొరఁగునానందబాష్పములను దొడలపయి నెక్కి పక్షులు త్రావుచుండును. కోరికలపైఁ గోరికలతో మనముననే మేడలు, దిగుడుబావులు, పూఁదోఁటలు నిర్మించుకొని వానివిలాసములకై యువ్విళ్లూరుమనయాయుష్య మిట్లు తుదముట్టుచుండును.

భిక్షాఽశనం త దపి నీరస మేకవారం
శయ్యా చ భూః పరిజనో నిజదేహమాత్రమ్,
వస్త్రం సుజీర్ణశతఖణ్డమయీ చ కన్థా
హాహా తథాఽపి విషయా న్న జహాతి చేతః. 15

చ. నిరతముఁ దిండి బిచ్చ మగు ♦ నీరస మద్దియు నొక్కపూఁటయే
ధరణితలంబు సెజ్జ సత♦తంబున దోడు శరీరమాత్రమే
చిరుఁగులచీరతున్కగమి♦చేత నమర్చినబొంత పుట్టమీ
కరణి మెలంగినన్ విషయ♦కాంక్ష లొకింతయుఁ బాయ వక్కటా.

భిక్షమే యాహారము. అదియు నిస్సారమయినది. అందును నొక్కపూఁటయే. పట్టినేలయే సెజ్జ. తనశరీరమే తక్క మఱొకపరివారములేదు. చినిఁగిపోయిన ప్రాతప్రేలికలతోఁ గూర్చినబొంతయే కట్టుబట్ట. అద్దిరా! అట్లయినను విషయేచ్ఛలనుండి మనసు మరలకున్నది గదా!

స్తనౌ మాంసగ్రన్థీ కనకకలశా విత్యుపమితౌ
ముఖం శ్లేష్మాగారం త దపి చ శశాఙ్కేన తులితమ్,
స్రవన్మూత్రక్లిన్నం కరివరశిరస్స్పర్ధి జఘనం
ముహు ర్నిన్ద్యం రూపం కవిజనవిశేషై ర్గురు కృతమ్. 16

చ. స్తనములు మాంసపిండములు ♦ చక్కనిబంగరుకుండ లంచు నా
ననము కఫాలయంబు తుహి♦నద్యుతితుల్య మటంచు మూత్రభా
జనజఘనస్థలంబు కరి♦చారుశిరస్సమ మంచుఁ గామినీ
జనమలినాంగముల్ సుకవి♦చాతురి వర్ణన కెక్కె నిమ్మహిన్.

మాంసపుముద్దలైన స్తనములను బంగరుకుండ లనియుఁ, గఫమునకు నెలవగు మొగమును జంద్రబింబ మనియు, మూత్రావసిక్త మగుజఘనస్థలమును నేనుంగుకుంభస్థల

మనియు నీవిధముగా సేవగింపఁదగిన కామినీరూపమును గొందఱుకవులు పెద్దచేసి పొగడుదురు.

ఏకో రాగిషు రాజతే ప్రియతమా దేహార్ధధారీ హరో
నీరాగేషు జనో విముక్తలలనాసంగో న యస్మాత్పరః,
దుర్వారస్మరబాణపన్నగవిషవ్యావిద్ధముగ్ధో జన
శ్శేషః కామవిడంబతాన్న విషయాన్భోక్తుం న మోక్తుం క్షమః.

చ. కాముకులందు మే సగముఁ ♦ గాంతకు నిచ్చెను శంకరుండె ని
ష్కాములలోనఁ బంచశర♦శాసనుకన్నఁ బరుండుఁ గల్గఁడు
ద్దామమనోజబాణవిష♦దగ్ధులు తక్కినమూఢు లోప రే
సీమల భామినీసుఖముఁ ♦ జేరి భుజింపఁ బరిత్యజింపఁగన్.

తన యఱమేను నెచ్చెలికర్పించిన హరుఁ డొక్కఁడే కాముకులలోఁ దొలుత నెన్నఁదగినవాఁడు. మన్మథుని నిర్దహించి స్త్రీసంగవిరహితుఁడై నెగడినయాహరుని కంటె విరాగి మఱి యెవ్వఁడు గలఁడు? నెఱకువిలుతునితూపులపోటు లనెడుపాపకాటులచే మైమఱపుఁజెందుతక్కినజను లట్లు విషయోపభోగములను బడయనులేరు. విడువను లేరు.

అజానన్దాహాత్మ్యం పతతు శలభో దీపదహనే
స మీనోఽప్యజ్ఞానా ద్బడిశయుత మశ్నాతు పిశితమ్,
విజానన్తోఽప్యేతే వయ మిహ విపజ్జాలజటిలా
న్న ముఞ్చామః కామా నహహ గహనో మోహమహిమా. 18

చ. తెలియక నాశహేతు వగు♦తీవ్రతరానలకీలలోపలన్
శలభము చొచ్చుఁ గాక మఱి ♦ చాలక మీనము గాలపుంగొనం
గలపిశితంబు తా మెసఁగుఁ ♦ గాక యెఱింగియు మేము దుఃఖదో
హలవనితాసుఖంబు విడ♦నాడము మోహమహత్త్వ మెట్టిదో.

తగులఁ బెట్టునని యెఱుఁగమిచే మిడుత దీపపుమొగ్గపైఁ బడును. తెలియకపోవుటచేఁ జేప గాలమునకున్న యెరను దినును. ఈ మనమన్ననో కుప్పతెప్పలుగా నాపదలు కలవని యెఱిఁగియుండియు విషయేచ్ఛలను మానలేకున్నాము. అజ్ఞానమాహాత్మ్య మెట్టిదోగదా!

తృషా శుష్య త్యాస్యే పిబతి సలిలం శీతమధురం
క్షుధార్త శ్శాల్యన్నం కబళయతి మాంసాదికలితమ్,



ప్రదీప్తే కామాగ్నౌ సుదృఢతర మాలింగతి వధూం
ప్రతీకారం వ్యాధే స్సుఖ మితి విపర్యస్యతి జరః. 19

ఉ. శీతలవారిఁ ద్రావు నడఁ ♦ జెందినవాఁడు క్షుధార్తుఁ డిష్టసు
ష్టాతతభక్ష్యమాంసకలి♦తాన్నము సాపడు మన్మథాగ్నితా
పాతురుఁ డైనవాఁడు జవ♦రాలిఁ గవుంగిటిలోన జేర్చు నీ
రీతిని రోగశాంతికర♦కృత్యము భోగ మనంగఁ జెల్లునే.

దప్పిచే నోరెండినప్పుడు చల్లనిమంచినీరు త్రావును. ఆఁకొన్నప్పుడు మాంసాదులతో శాల్యన్న మారగించును మరులు రేఁగినప్పుడు జవరాలిని బిగ్గకవుంగిలించుకొనును. ఇఁక వీని నెల్ల సౌఖ్యమని తలంచుచున్నాఁడు.

తుంగం వేశ్మ సుతా స్సతా మభిమతా స్సంఖ్యాతిగా స్సంపదః
కళ్యాణీ దయితా వయ శ్చ నవ మి త్యజ్ఞానమూఢో జనః,
మత్వా విశ్వ మనశ్వరం నివిశతే సంసారకారాగృహే
సంవృశ్య క్షణభంగురం తదఖిలం ధన్యస్తు సన్న్యస్యతి. 20

చ. పొడవులుమేడవుల్ ఘనులు♦పుత్త్రులు పెక్కులు రమ్యసంపదల్
పడఁతుక చారుశీల యెల♦ప్రాయ మటంచు నరుండు మూఢుఁడై
కడు జగ మెల్ల శాశ్వతము♦గాఁ గొని సంసృతిబందిలోపలం
బడు నిది మాయయంచు మతి♦మంతుఁడుదావిడుచున్సమస్తమున్.

మేడ చాలఁబెద్దది, కొడుకు లడఁకువగలవారు, సంపదలు మితిలేనివి, పెండ్లము మనస్సుమెచ్చినది, వయస్సు నిండుజవ్వనము. ఇట్లని యజ్ఞానముగలమనుజుఁడు మోహపడి విశ్వమెల్ల శాశ్వతమని తలఁచి సంసారమను చెఱసాలలోఁ జిక్కువడును. ధన్యులగువారి దియెల్ల క్షణభంగుర మని తృణీకరించి సన్న్యసించుచున్నారు.

## యాచ్ఞాదైన్యదూషణము.

దీనా దీనముఖై స్సదైవ శిశుకై రాకృష్టజీర్ణాంబరా
క్రోశద్భిః క్షుధితై ర్నిరన్నవిధురా దృశ్యా న చే ద్గేహినీ,
యాచ్ఞాభఙ్గభయేన గద్గదగళత్రుట్యద్విలీనాక్షరం
కో దేహీతి వదే త్స్వదగ్ధజఠర స్యార్థే మనస్వీ పుమాన్. 21

ఉ. ఆఁకొని యేడ్చు లేఁజిఱుత♦లన్నముకై తనకొంగు లాగఁ బె
ల్లాఁకట సోలుచుండెడు ని♦జాంగనదుర్దశఁ జూడఁ డేని యా

ష్ణాకలనావిభంగభయ♦సంభృతగద్గదశూన్యకంఠుఁడై
చేకొని దేహి యం చడుగఁ♦ జేరునె కాలినపొట్ట కెవ్వఁడున్.

బిక్కమొకములతో నాఁకటనేడ్చుచుఁ జినిఁగిపోయినచీరచెఱఁగు లాగుచు బిడ్డలు వెన్నాడ నన్నములేక పొగులుపెండ్లమే కన్నుల కగపడకుండినచోఁ దనపాడు పొట్టకై యాచన నేమిచేయుదురో యనుభయముచే డగ్గుత్తుకపడి నుడువులు తడఁబడ "దేహి" యని వివేకి యగువాఁ డెవఁడు యాచింపఁబూనును?

అభిమతమహామానగ్రన్థిప్రభేదపటీయసీ
గురుతరగుణగ్రామామ్భోజస్ఫుటోజ్జ్వలచన్ద్రికా,
విపులవిలసల్లజ్జావల్లీవితానకుఠారికా
జఠరపిఠరీ దుష్పూరేయం కరోతి విడమ్బనమ్. 22

శా. మానగ్రంథివిభేదనక్షమము శుం♦భద్ధైర్యగాంభీర్యము
ఖ్యానేకప్రియసద్గుణాంబుజసమూ♦హజ్యోత్స్నలజ్జాలతా
హానిస్ఫారకుఠారధార జఠరం♦ బన్నట్టిపెన్బాన యా
రా నిండారదు దైన్యవృత్త్యభినయ♦ప్రాగల్భ్యముం జూపుచున్.

ఈకడుపనుబాన గౌరవమును దొలఁగించును వెన్నెల తామరపూలముకుళింపఁ జేయునట్లు సద్గుణములనెల్ల సంకోచింపఁజేయును. గాఢముగా నల్లుకొన్నలజ్జ యను తీవను జిలుగొడ్డలివోలెఁ దెగఁద్రెంచును. దీనికి నిండుట యనుమాటలేదు.

పుణ్యే గ్రామే వనే వా మహతి సితపటచ్ఛన్నపాలీం కపాలీ [శే,
మాదాయ న్యాయగర్భద్విజహుతహుతభుగ్ధూమధూమ్రోపకంఠం
ద్వారం ద్వారం ప్రవిష్టో వర ముదరదరీపూరణాయ క్షుధార్తో
మానీ ప్రాణై స్సనాథో స పున రనుదినం తుల్యకుల్యేషు దీనః.

చ. అవని సురావళీహుతహు♦తాశనకోమలధూమధూమలా
ప్రవిశదవాటియందు వన♦భాగమునందుఁ గపాలపాణి యై
భవనములందు భిక్షగొని♦ప్రాణము దాల్చుట కొంత మేలు బాం
ధవులను జేరి వేఁడి కడు♦దైన్యము చెందుటకంటె మానికిన్.

యథాన్యాయముగా వ్రేల్చుబ్రాహ్మణు లగ్నిహోత్రపుధూమముతోఁ బొలుపారుపవిత్రమయినయొకగ్రామమునఁగాని లేకయరణ్యమునఁగాని భిక్షాపాత్రఁ గైకొని దానిపై దెల్లవస్త్రముఁ గప్పికొని యిల్లిల్లును బిచ్చమెత్తి యాఁకొన్నపొట్టనించుకొనుచుంట మేలుగాని, యభిమానవంతుఁడై బ్రదుకఁ గోరువాఁడు సమానులగు తనకుఁ పువారిని దీనతతో యాచించి దినములు గడపుట యనుచితము.



గంగాతరంగ హిమశీకరశీతలాని
విద్యాధరాధ్యుషితచారుశిలాతలాని,
స్థానాని కిం హిమవతః ప్రళయం గతాని
యత్సావమానపరపిండరతా మనుష్యాః. 24

తే. పూతగంగోర్మిశీకర♦శీతలములు
లలితవిద్యాధరాశ్రయశి♦లాతలములు
హిమగిరిస్థానములు నశి♦యించె నొక్కొ
నరులు నిందిత పరపిండ♦నిరతు లగుట.

మిన్నేటి యలలనుండి యొలయు మంచుతుంపురులచేఁ జల్లనై, విద్యాధరులు విహరించుచు మనోహరములయిన చఱియపట్టులు గలిగి చెలఁగు ప్రదేశము లెల్లఁ బాడఱెనా? మనుజు లవమానకరమైన పరపిండముల కాశించుకొని యుందురేల?

కిం కన్దాః కన్దరేభ్యః ప్రళయ ముపగతా నిర్ఝరా వా గిరిభ్యః
ప్రధ్వస్తా వా తరుభ్య స్సరసఫలభృతో వల్కలిన్య శ్చ శాఖాః,
వీక్ష్యన్తే యన్ముఖాని ప్రసభ ముపగతప్రశ్రయాణాం ఖలానాం
దుఃఖోపాత్తాల్పవిత్తస్మయపవనవశానర్తితభ్రూలతాని. 25

మ. ఇలఁ గందంబులు మూలముల్ మడిసెనో♦యెల్లిం కెనో కొండలన్
ఫలముల్ నారలు వృక్షశాఖలయెడన్♦బాడయ్యెనో చూడఁ గే
వలదుఃఖాప్తమితార్థగర్వపవన♦వ్యానర్తితభ్రూలస
త్ఖలభూపాస్యము లర్థిఁ జూచెదరె భ్రాం♦తస్వాంతులై యాచకుల్.

కందమూలములు లోయలనుండి మాయమై పోయెనా? కొండలనుండి సెలయేళ్లెండి పోయెనా? నారచీరల నొసఁగు ఫలభరితములైన చెట్లకొమ్మలు పాడుపడెనా? కొండలలోనుండి కందమూలముల భక్షించుచు, తీయని సెలయేళ్ల నీళ్ళఁ ద్రావుచు, నారచీరలఁ దాల్చుచు, రుచ్యములైన యారఁ బండినపండ్ల నారగించుచు సౌఖ్యపడకచ్చి చెడి నాలుగుడబ్బు లార్జించి, ధనికుల మను గర్వమునఁ గన్నుఁగానక మర్యాద దప్పి వర్తించు నీచుల దేవిరింపఁ బోనేల?

పుణ్యై ర్మూలఫలైః ప్రియే ప్రణయినీం వృత్తిం కురు ష్వాధునా
భూశయ్యాం నవపల్లవై రకృపణై రుత్తిష్ఠ యావో వయమ్,

క్షుద్రాణా మవివేకమూఢమనసాం యత్రేశ్వరాణాం సదా
విత్తవ్యాధివికారవిహ్వలగిరాం నామాపి న శ్రూయతే. 26

చ. ప్రవిమలకందమూలఫల♦పంక్తుల జీవికఁ జేయు ముర్విపై
నవనవపల్లవంబుల నొ♦నర్పుము పానుపు లెమ్ము పాపనా
టవికిని బోవు మయ్యెడ దృ♦ఢద్రవిణామయదుర్వికారగా
రవవికలోక్తులై మెలఁగు♦ రాజులపేరును జెప్పఁ డెవ్వఁడున్.

ప్రేయసీ! పవిత్రములయిన కందమూలఫలములతో నాహారము కావింపుము. లేఁజిగురుటాకులతోఁ బడుక నొనర్పుము. లెమ్ము. మనమిర్వుర మరణ్యమున కరుగుదము. ధనమనెడు రోగమువలనఁ దబ్బిబ్బులాడు నీచులపేరయిన నయ్యెడ వినరాదు.

ఫలం స్వేచ్ఛాలభ్యం ప్రతివన మఖేదం క్షితిరుహాం
పయః స్థానే స్థానే శిశిరమధురం పుణ్యసరితామ్,
మృదుస్పర్శా శయ్యా సులలితలతాపల్లవమయీ
సహన్తే సన్తాపం తదపి ధనినాం ద్వారి కృపణాః. 27

చ. కలవు పచేళిమంబు లయి ♦ కానలలోఁ ఫలఁ బండ్లు మ్రాఁకులం
గలవు పవిత్రవాహినులఁ ♦ గమ్మనిశీతలవారిపూరముల్
గలవు చివుళ్ల పాన్పు లవి ♦ గైకొన నేరక దీనులై ధనా
ఢ్యులగవనిన్ వసించి నరు ♦ లోలి సహింతురు తీవ్రతాపమున్.

ప్రతి వనమందును ననాయాసమున నిష్టము వచ్చినన్ని పండ్లు చెట్లనుండి కోసికొనవచ్చును. ఎక్కడఁ బట్టిన నక్కడఁ బుణ్యనదులలోఁ జల్లఁగా మధురముగా నుండునీరు త్రాగవచ్చును. లేఁజిగురుటాకులతో మెత్తనిసెజ్జలు గల్పించుకోవచ్చును. ఇట్టివసతియున్నను దరిద్రులు ధనికుల వాకిళ్ళఁ బడి యిక్కట్టుల నోర్చుచున్నారు.

యే వర్ధన్తే ధనపతిపురః ప్రార్థనా దుఃఖభాజో
యే చాల్పత్వం దధతి విషయాక్షేప పర్యస్తబుద్ధేః,
తేషా మన్తస్స్ఫురితహసితం వానరాణాం స్మరేయం
ధ్యానచ్ఛేదే శిఖరికుహరగ్రావశయ్యానిషణ్ణః. 28

చ. ధనపతిమ్రోల నిల్చి కడు♦దైన్యము జూపెడువార లెవ్వరో
ఘనవిషయాభిలాష మతి♦కల్పన మీఱిననీచు లెవ్వరో
మొనయుచు వారిదుష్టదిన♦ముల్ మది నవ్వి తలంతు నాత్మచిం
తనము తుదిన్ గుహాంతరము♦నన్ రుచిరోపలతల్పశాయి నై.



ధనికులచెంత నిల్చి మిక్కిలి దైన్యముతో నెవరు యాచించుకొని బ్రతుకుచుందురో ఎల్లప్పుడును దుర్విషయసౌఖ్యములనే కోరుకొనుచు నెవరు నైచ్యము నందుచుందురో యట్టివారి దుర్దినములను, ధ్యానావసానమునఁ గొండగుహచెంత రాతిసెజ్జయగు చఱియపైఁ గూరుచుండి తలఁచుకొని నవ్వువాఁడను.

యే సన్తోషనిరన్తరప్రముదితా స్తేషాం న భిన్నా ముదో
యే త్వన్యే ధనలుబ్ధసంకులధియ స్తేషాం న తృష్ణాహతా
ఇత్థం కస్య కృతే కృతః స విధినా తాదృక్పదం సమ్పదాం
స్వాత్మన్యేవ సమాప్తహేమమహిమా మేరు ర్న మే రోచతే. 29

మ. వరసంతోషనిరంతరప్రముదితుల్ ♦ వర్ణింప నెవ్వారు ని
ర్భరముల్ వారికి మోదముల్ కనకలు♦బ్ధస్వాంతు లెవ్వారికిన్
విరతిం బొందదు తృష్ణ యెవ్వనికిఁ గా♦వింపంబడెన్ బ్రహ్మచే
స్థిరసంపన్నిధి మేరు వాత్మధృతల♦క్ష్మీకంబు నా కిష్టమే.

ఎవరు నిరంతర పరమానందమున నోలలాడుచుందురో వారియానందమున కెప్పుడును జెఱుపులేదు. ఇంక నెప్పుడును ధనకాంక్షతోడనే గిజగిజలాడువారి యాశలకు బరిసమాప్తిలేదు. తొలుతటివారికి బంగరుకొండపైఁ గోర్కెయే పొడమదు. రెండవవారికది చేకుఱినను దృప్తిగలుగదు. చూడఁగా నాలాటి సకలసంపదలకు నిలయమైన బంగరుకొండను బ్రహ్మదేవుఁ డెవరికై సృజించినట్లు? లోకమును దృప్తిచెందింపక నుపకరింపక తనకుఁ దా సంపదలు గల దనిపించుకొను మేరువు కొఱమాలినదిగా నాకుఁ దోఁచుచున్నది.

భిక్షాహార మదైన్య మప్రతిముఖం భీతిచ్ఛిదం సర్వదా
దుర్మాత్సర్యమదాభిమానమథనం దుఃఖౌఘవిధ్వంసనమ్,
సర్వత్రాన్వహ మప్రయత్నసులభం సాధుప్రియం పావనం
శంభోః సత్త్ర మవార్యమక్షయనిధిం శంసన్తి యోగీశ్వరాః. 30

మ. అభివర్ణింతురు యోగిపుంగవులు భి♦క్షాహారమున్ వీతదై
న్యభరాక్రోధమదాభిమానజడిమా♦హంకారమున్ సత్సుఖ
ప్రభవం బశ్రమలభ్య మూర్జిత మవా♦ర్యం బక్షయం బుగ్రదుః
ఖభిదాదక్షము శంభుసత్త్రము మహా♦కైవల్యసత్పాత్రమున్.

మహాయోగులు పరమేశ్వరుఁడు పెట్టిన భిక్షాన్నసత్త్రమునందలి భిక్షాహారమును దైన్యము లేనిదానిగను, నిరాటంకమైనదానిగను, నిర్భయమొసగుదానిగను, మాత్సర్య

మదాభిమానధ్వంసక మగుదానిగను, అప్రయత్నసులభమగుదానిగను, సాధువుల కిష్ట మగుదానిగను, పావనమగుదానిగను, అక్షయమునుగను జెప్పుచున్నారు.

## భోగాస్థైర్యవర్ణనము.

భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలా ద్భయం
మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయా భయమ్,
శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాన్తా ద్భయం
సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్య మే వాభయమ్.

చ. బలగుణరూపభోగకుల♦ధర్మకళేబరశాస్త్రమానముల్
బలిఖలరుగ్జరాచ్యుతి నృ♦పాలయమప్రతివాదిదైన్యసం
కులభయయుక్తముల్ నరుల♦కుఁ భువి నెవ్వియు నిర్భయంబులే
నెలకొని యెన్నిభంగులను ♦ నిర్భయ మొక్కవిరాగమే సుమీ.

సంపూర్ణభోగము లనుభవించుచో రోగము లెక్కడవచ్చునో యనుభయము కలదు. పేరుప్రతిష్ఠలుగల సత్కులమందుఁ బుట్టితిమనుకొనునపుడే యకార్యకరణము వలన నెప్పు డప్రతిష్ఠ వాటిల్లునో యనుభయముకలదు. ఐశ్వర్యవంతుల మనుకొనునప్పు డెప్పుడు రాజుకైకొనునో యనుభయముకలదు. అభిమానవంతుల మనుకొనునప్పుడు దైన్య మెప్పు డవలంబింపవలయునో యనుభయముగలదు. బలవంతుఁడనుగదా యనుకొనునప్పుడు శత్రువు లోడింతురో యనుభయముకలదు. చక్కదనముగల దనుకొనునపుడు ముసలితనమువచ్చునో యనుభయముగలదు. శాస్త్రజ్ఞుఁ డనుకొనునప్పుడు ప్రతివాదులవలన భయముగలదు. సద్గుణములుగలవాఁడనుగదా యనుకొనునప్పుడు దుర్మార్గులవలన భయముగలదు. శరీరమును జూచుకొనునపుడు మరణమువచ్చునో యనుభయము గలదు. అరసిచూచిన సర్వవస్తువులును భయాన్వితములే. వైరాగ్య మొక్కటియే నిర్భయ మైనది.

ఆక్రాన్తం మరణేన జన్మజరయా విద్యుచ్చలం యౌవనం
సన్తోషో ధనలిప్సయా శమ సుఖం ప్రౌఢాంగనావిభ్రమైః,
లోకై ర్మత్సరిభి ర్గుణా వనభువో వ్యాళై ర్నృపా దుర్జనై
రస్థైర్యేణ విభూతయో ఽప్యుపగతా గ్రస్తం న కిం తేన వా. 32

చ. జననము చావుచేత శమ♦సౌఖ్యము కాంతలలీలచేత జ
వ్వనము జరార్తిచేత గుణ♦వర్గము కూళలచేత రాజు దు



ర్జనములచే ముదంబు ధన♦రాగముచే సిరులెల్ల లేమిచే
వినిహతిఁ జెందు దోషపరి♦విద్ధము గాదె తలంప నెద్దియున్.

జన్మమును మరణము, యౌవనమును ముదుసలితనము, సంతోషమును ధనాశ, ప్రశమసుఖమును మిటారుల టకటొంకులు, సద్గుణములను మాత్సర్యముగల కూళలు, వన్యప్రదేశములను ఘాతుకజంతువులు, రాజులను దుర్జనులు, ఐశ్వర్యములను నిలుకడ లేమి చెఱచివేయుచున్నవి. నిరుపద్రవమైన దింక నేదిగలదు ?

ఆధివ్యాధిశతై ర్జనస్య వివిధై రారోగ్య మున్మూల్యతే
లక్ష్మీ ర్యత్ర పతన్తి తత్ర వివృతద్వారా ఇవ వ్యాపదః,
జాతం జాత మవశ్య మాశు వివశం మృత్యుః కరో త్యాత్మసా
త్తత్కిం నామ నిరంకుశేన విధినా య న్నిర్మితం సుస్థిరమ్. 33

శా. ఆధివ్యాధిశతంబుచే జనులధై♦ర్యం బెల్ల నిశ్శోభమై
బాధింపంబడు సంపదల్ గలుగుచోఁ ♦ బ్రత్యక్షమై ద్వారసం
రోధం బేమియు లేక దుర్దశలు చే♦రుఁ మృత్యువుఁ మర్త్యుల
న్వేధించు న్విధి యేది సుస్థిరముగా ♦ నిర్మించెఁ దర్కించినన్.

మనోవ్యథలచేతను, వ్యాధులచేతను ఆరోగ్యము పాడ్వడుచున్నది. సంపద లెక్కడఁగలవో అక్కడనే యడ్డులేన ట్లాపదలు కుప్పతెప్పలుగా సంభవించుచున్నవి. అస్వతంత్రముగ జన్మించిన ప్రతిప్రాణిని మాయదారిమృత్యువు తనపాట్టను బెట్టుకొనుచున్నది. అడ్డమాఁకలులేని యాదైవముచే సుస్థిరమని చెప్పఁదగునట్టు నిర్మింపఁబడిన దేదికలదు ?

భోగాస్తుఙ్గతరఙ్గభంగతరళాః ప్రాణాః క్షణధ్వంసినః
స్తోకా న్యేవ దినాని యౌవనసుఖస్ఫూర్తిః ప్రియాసు స్థితా,
త త్సంసార మసారమేవ నిఖిలం బుద్ధ్వా బుధా బోధకా
లోకానుగ్రహపేశలేన మనసా యత్నః సమాధీయతామ్. 34

ఉ. తుంగతరంగభంగముల♦తోఁ దులతూఁగువిలోలభోగముల్
భంగపడుఁ నిమేషమునఁ ♦ బ్రాణము కొన్నిదినంబులే సుఖం.
బంగనలందు నిట్లు మది ♦ నారసి బ్రహ్మవిచారయత్నము
పొంగుచుఁ జేయఁగావలయు♦భూరిజగద్ధితబుద్ధిఁ బండితుల్.

భోగములు ఎత్తయినతరఁగలవలె నించుకలోఁ జిదికిపోవునవి. ప్రాణములో యుత్తరక్షణమున నుండునో యుండవో వాఁడుకొనఁజాలము. ప్రియురాండ్రతోనను

భవించుయౌవనసౌఖ్యములు మూఁడునాళ్ళముచ్చటలె కాఁబట్టి హితబోధకులగు నో విబుధులారా! యీసంసారమునెల్ల నిస్సారమునుగా గ్రహించి లోకానుగ్రహమున సంసక్తమగు మనసుతోఁ బ్రయత్నము కావింపుఁడు.

భోగా మేఘవితానమధ్యవిలసత్సౌదామనీచఞ్చలా
ఆయు ర్వాయువిఘట్టితాబ్జపటలీలీనామ్బువద్భఙ్గురమ్,
లోలా యౌవనలాలసా స్తనుభృతా మిత్యాకలయ్య ద్రుతం
యోగే ధైర్యసమాధిసిద్ధిసులభే బుద్ధిం విదధ్వం బుధాః. 35

చ. జలదములోని క్రొమ్మెఱుఁగు♦చాయలు భోగపరంపరల్ మహా
నిలపరిఘట్టితాబ్జదళ♦నీరతుషారము జీవితంబు చం
చలతరముల్ వయోభిమత♦సౌఖ్యము లీగతి నాలకించి స
భ్యులు పరమాత్మయోగమున♦బుద్ధి ఘటింపుఁడు సత్వరంబుగన్.

భోగములు మబ్బులోని మెఱయు మెఱుఁగులవలె నతిచంచలమైనవి. జీవితము గాలిచే రెపరెపలాడుతామరాకుమీఁదిజలబిందువువలె నిలుచునదికాదు. పడుచుఁదనపుఁ గోరికలు స్థిరములుకావు. ఈవిషయము మనమున నిశ్చయించుకొని యోపండితులారా! శీఘ్రముగా మీమనస్సులను సమాధియోగమున నుంచుఁడు.

ఆయుః కల్లోలలోలం కతిపయదివసస్థాయినీ యౌవనశ్రీ
రర్థాః సంకల్పకల్పా ఘనసమయతటిద్విభ్రమా భోగపూరాః,
కణ్ఠాశ్లేషోపగూఢం తదపి చ న చిరం యత్ప్రియాభిః ప్రణీతం
బ్రహ్మణ్యాసక్తచిత్తా భవతి భవ భయామ్భోధిపారం తరీతుమ్.

ఉ. ఆయువు వీచి చంచలము ♦ యౌవన మల్పదినోచితంబు పు
ష్పాయుధకేళిజన్యసుఖ ♦ మస్థిర మర్థము వాంఛవోలె నా
పాయము భోగముల్ మెఱపు ♦ లట్ల భ్రమించు భవాబ్ధిలంఘనో
పాయము బ్రహ్మచింతనముఁ ♦ బాయక సేయుఁడు సజ్జనోత్తముల్

ఆయువు తరంగమట్లు చంచలమైనది. పడుచుఁదనపుసొగసు కొన్నాళ్ళుండును. నదియే, సంపదలు తలఁపులవంటివి. భోగములు వర్షకాలపు మెఱుపులవంటివి ప్రియురాండ్రొనరించు కత్తుక కౌఁగిలింతలుసయితము నిత్యములుకావు. కావున నీసంసార సముద్రమును దాఁటుటకుఁ బరబ్రహ్మసంసక్తచిత్తులు కండు.

కృచ్ఛ్రేణా మేధ్యమధ్యే నియమితతనుభిః స్థీయతే గర్భవాసే
కాన్తావిశ్లేషదుఃఖవ్యతికరవిషమో యౌవనే చోపభోగః,



వామాక్షీణా మవజ్ఞా వివసితవసతి ర్వృద్ధభావోఽప్యసాధు
స్సంసారే రే మనుష్యా వదత యది సుఖం స్వల్ప మప్యస్తికించిత్

ఉ. కాయము గుంచి గర్భనర♦కంబున నుండుట దుఃఖ మాదియం
దాయతలోచనావిరహ ♦ మబ్బుట దుఃఖము జవ్వనంబునం
బాయక భామినీహసన♦పాత్రము దుఃఖము వృద్ధభావ మిం
కేయెడఁ గల్గుసౌఖ్యలవ ♦ మించుకయే జనులార చెప్పుఁడీ.

తొలుత మలమూత్రములతో నొడలు సంకోచించుకొని యల్లాడుచు గర్భనరకము నైఁపవలయును. యౌవనమునఁ బ్రియురాండ్రవియోగము నోర్వఁజాలక పొగుల వలయును. ముదుసలితనమునఁ జంచలాక్షులేవగొని వెక్కిరించినవ్వినఁ నవమానముపాలు కావలయును. ఓరీనరులారా! ఈసంసారమున నించుకేని సౌఖ్యముకలదేమోచెప్పుఁడు.

వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి దేహమ్,
ఆయుః పరిస్రవతి భిన్నఘటా దివామ్భో
లోక స్తథా ప్యహిత మాచరతీతి చిత్రమ్. 38

చ. కడు వెఱపించుచున్ ముదిమి ♦ గద్దఱి బెబ్బులిమాడ్కి నున్న దె
క్కుడు పగదాయలంబలెఁ దె♦గుళ్లు శరీరము నొంచుచున్న వె
ప్పుడుఁ జను భిన్నకుంభజల♦ముంబలె నాయువు లిట్టులయ్యుఁ దా
రుడుగక మానవుల్ దురిత♦మోలి నొనర్చుచు నున్నవా రహో!

ముదుసలితనము బెబ్బులివలె వెఱపు గుడుపుచుఁ బైఁబడ నున్నది. రోగములు శత్రువులట్లు దేహము నొంచుచున్నవి. ఓటికుండలోనినీరువోలె నాయువు గారిపోవు చున్నది. ఇట్లయ్యును లోకము తప్పుదారిని వీడకున్నది. అద్దిరా!

భోగా భఙ్గురవృత్తయో బహువిధా స్తై రేవ చాయం భవ
స్తత్కస్యేహ కృతే పరిభ్రమత రే లోకాః కృతం చేష్టితైః,
ఆశాపాశశతోపశాన్తివిశదం చేత స్సమాధీయతాం
కామోచ్ఛిత్తివశే స్వధామని యది శ్రద్ధేయ మస్మద్వచః. 39

చ. తరళతరంబులున్ బహువి♦ధంబులు భోగము లీదురంతసం
సరణము వానిచేఁ బొడమెఁ ♦ జాలుఁ బరిభ్రమణంబు వానికై
నరులు మదీయభాషణము ♦ నమ్మెదరేని శమప్రసన్నమై
పరఁగుమనంబు శంభుపద♦పద్మయుగప్రవణంబు సేయుఁడీ,

పలువిధములయిన భోగములెల్ల నశించిపోయెడిని. వానిచేతనే యీసంసార మేర్పడినదిగాన నిదియు నశ్వరమే. ఓరీ నరులారా! దేనికై యిట్లు పలుతిప్పలఁ బడెదరు? ఇంకఁ జాలు. చాలించుఁడు. మామాటవిని యాశాపాశములు త్రెంపి నిర్మలమగుమనసును పరబ్రహ్మమున లయింపఁజేయుఁడు.

బ్రహ్మేన్ద్రాదిమరుద్గణాం స్తృణకణా న్యత్ర స్థితో మన్యతే
య త్స్వాదా ద్విరసా భవన్తి విభవా స్త్రైలోక్యరాజ్యాదయః,
భోగః కోఽపి స ఏక ఏవ పరమో నిత్యోదితో జృమ్భతే
భో సాధో క్షణభఙ్గురే తదితరే భోగే రతిం మాకృథాః. 40

ఉ. ఎందు వసించి ధన్యుఁడు వి♦ధీంద్రముఖామరకోటి నెల్ల నెం
చుం దృణమట్ల దేనిఁ జవి♦చూచుటచే రసహీనభావముం
జెందు జగత్ప్రభుత్వమును ♦ జెప్పఁగరానియనంతకేవలా
నందము దానియందు మది♦నాటుము మానుము నీచభోగముల్.

బ్రహ్మానందానుభవమున ననుషక్తుఁ డగువాఁడు తృణీకృతబ్రహ్మపురందరుఁడుగానుండును. ఆయనుభవమునఁ దేలువానికి ముల్లోకములసామ్రాజ్యపట్టాభిషేకమబ్బినను నీరసముగానే తోఁచును. కావున నో సాధుజనుఁడా! ఆలాటిపరమోత్కృష్టమును, అద్వితీయము నగుభోగమునందుఁ దక్కఁ దక్కిన నిక్కముకానిభోగముపై మక్కువఁ జెందకుము.

## కాలమహిమానువర్ణనము.

సా రమ్యా నగరీ మహా న్స నృపతి స్సామన్తచక్రం చ త
త్పార్శ్వే తస్య చ సా విదగ్ధపరిష త్తా శ్చన్ద్రబిమ్బాననాః,
ఉద్వృత్త స్స చ రాజపుత్రనివహ స్తే వన్దిన స్తాః కథా
స్సర్వం యస్య వశా దగాత్ స్మృతిపథం కాలాయ తస్మై నమః. 41

మ. అది మేలైనపురంబు పూజ్యచరితుం ♦ డారాజు రాణ్మండలం
బది పార్శ్వంబున నావిదగ్ధసభ వా ♦ రబ్జాస్య లత్యుద్ధతం
బది రాజన్యక మద్ది వందినికరం ♦ బాగాథలున్ సర్వముం
గదలం జేసినకాలమూర్తికి నమ♦స్కారంబు సత్కీర్తికిన్.

సొగసయిన యారాజధాని, మహోన్నతుఁడైనయారాజు, ఆసామంతరాజమండలము, అక్కడ సభదీరియుండు నావిద్వత్సమూహము, పొగరుమీరు నారాజపుత్త్రనివహము, ఆస్తోత్రపాఠకులు, ఆకథాలాపములు నివి యన్నియు దేనిమహిమమున స్మరింపవలసివచ్చెనో యట్టికాలమునకు నమస్కారము.



యత్రానేకే క్వచి దపి గృహే తత్ర తిష్ఠ త్యథైకో
యత్రాప్యేక స్తదను బహవ స్తత్ర నైకోఽపి చాన్తే,
ఇత్థం చేమౌ రజనిదివసౌ దోలయ న్ద్వావివాక్షౌ
కాలః కాళ్యా భువనఫలకే క్రీడతి ప్రాణిశారైః. 42

శా. ఏయింటన్ వసియించుఁ బెక్కలోకఁడా♦యింటన్ బ్రవర్తించు నే
చాయన్ నిల్చు నొకం డు పెక్కురచటన్♦సంధిల్లు నొం డైన లే
దాయింటన్ మది నిల్పి రాత్రిదినరూ♦పాక్షద్వయిం జిమ్ముచుం
జేయుం గాలుఁడు క్రీడ లోకఫలక♦శ్రేణిన్ నృశారంబులన్.

లోకమనెడు నాటపాళిపైఁ గాళియుఁ గాలుఁడు ననునిర్వురు జూదరులు రేయును, బవలు ననురెండుపాచికలను దొర్లించుచు నాడుచున్నారు. ఈయాటయందేగడిని దొలుతఁ బెక్కుకాయలుండునో యాయింటఁ దుద నొకటిమాత్రముండుట సంభవించును. తొలుత నేయింట నొకకాయయే యుండునో పదపడి పెక్కుకాయ లుండి యంతమునకు నొకకాయయు లేకపోవుట సంభవించును. అట్లే యేగృహమునఁ దొలుతఁ బెక్కురుందురో యందుఁ దుద నొక్కఁడుండుటయుఁ దొలుత నేయింట నొక్కఁడుండునో యందుఁ బిదపఁ బెక్కురుంటయు నంతమున నెవరులేకపోవుటయుఁ గూడ సంభవించును.

ఆదిత్యస్య గతాగతై రహరహ స్సంక్షీయతే జీవితం
వ్యాపారై ర్బహుకార్యభారగురుభిః కాలో న విజ్ఞాయతే,
దృష్ట్వా జన్మజరావిపత్తిమరణం త్రాస శ్చ నోత్పద్యతే
పీత్వా మోహమయీం ప్రమాదమదిరా మున్మత్తభూతం జగత్

చ. అనుదినమున్ నశించుఁ బర♦మాయువు సూర్యునిరాకపోకలన్
ఘనబహుకార్యభారములఁ ♦ గాలము పోవుట గానరాదు సం
జననజరామయంబులును ♦ జావును జూచి భయంబు లేదు దు
ర్జనభువనంబు మోహమది♦రారసవిహ్వల మయ్యె నయ్యయో.

సూర్యుని యుదయాస్తమానములచే నాఁడునాఁటికి నాయువు తఱిగిపోవుచుండుటను, ఎడతెగనిపనులలో మునిఁగి తేలుచు జనులు గుఱుతింపలేకయున్నారు. పుట్టుచున్నవారిని, గిట్టుచున్నవారిని, ముదసల్లుచున్నవారిని, ఇడుమలఁ గుడుచువారిని జూచుచుండియు భయపడకున్నారు. కల్లుద్రావికై పెక్కిన ట్లజ్ఞానముచే మతిదప్పి జగమెల్ల పిచ్చఁబడియున్నది.

ర్యాత్రి స్సైవ పున స్స ఏవ దివసో మత్వా ముధా జన్తవో
ధావ న్త్యుద్యమిన స్తథైవ నిభృతప్రారబ్ధత త్తత్క్రియాః,
వ్యాపారైః పునరుక్తభుక్తవిషయై రేవం విధే నామునా
సంసారేణ కదర్థితా వయ మహో మోహా న్న లజ్జామహే. 44

ఉ. వచ్చినరాత్రులే తిరిగి♦వచ్చుట వోయిన వాసరంబులే
వచ్చు టెఱింగి గూఢతర♦వర్తనులై పునరుక్తకార్యముల్
నిచ్చలు సేయుచుం జనులు ♦ నిశ్చలవృత్తిఁ జరింతు రీభవా
భ్యుచ్చయరీతిచేఁ జెడి కు♦బుద్ధులు సిగ్గు వహింప రెంతయున్.

పోయినరాత్రియే మరల వచ్చును. పోయినపగలే మరలవచ్చును. ఇదియెఱిఁగియు నజ్ఞాను లూరకయే యేవో పను లారంభించి, పూనికతో నేమో మునిఁగిపోవుచున్నట్లు పరుగులిడుచుందురు. ఆపనులా చేసినవే మరలమరలఁ జేయఁబూనుకొన్నవి. ఈలాటి సంసారముచే నవమానితులమై యజ్ఞానమువలన సిగ్గిలకున్నాము.

న ధ్యాతం పద మీశ్వరస్య విధివ త్సంసారవిచ్ఛిత్తయే
స్వర్గద్వారకవాటపాటనపటు ర్ధర్మోఽపి నోపార్జితః,
నారీపీనపయోధరోరుయుగళీ స్వప్నేపి నాలింగితా
మాతుః కేవల మేవ యౌవనవనచ్ఛేదే కుఠారా వయమ్. 15

ఉ. శ్రీరమణీయశంభుపద♦చింత యొనర్చుట లేదు గోపుర
ద్వారకవాటపాటనసు♦ధర్మము సేయుట లేదు సుందరీ
హారికుచోరులబ్ధిఁ గల♦నైన నెఱుంగము మాతృయౌవనో
దారవనీకుఠారముల ♦ మై జనియించినవార మిమ్మహిన్.

సంసారవిచ్ఛేదమగునట్లు మోక్షప్రాప్తికై యీశ్వరధ్యానమును జేయమైతిమి. స్వర్గద్వారముఁ దెఱపించుధర్మమునేని కావింపమైతిమి. ఒండె జవరాండ్ర బిగిచను దోయి స్వప్నమునసైనఁ గౌఁగిలించుకొని యెఱుఁగము. నిశ్చయముగా మేముతల్లుల యౌవనమును బాడుసేయుటకు జన్మించితిమి

నాభ్యస్తా భువి వాదిబృన్దదమనీ విద్యా వినీతోచితా
ఖడ్గాగ్రైః కరికుమ్భపీఠదళనై ర్నాకం సనీతం యశః,
కాన్తాకోమలపల్లవాధరరసః పీతో న చన్ద్రోదయే
తారుణ్యం గతమేవ నిష్ఫల మహో! శూన్యాలయే దీపవత్. 46



చ. వలనుగ విద్య నేర్చి ప్రతి♦వాదుల గెల్చుట లేదు కుంభిని
ర్దళనని శాతఖడ్గముల ♦ దైవతలోకమునందుఁ గీర్తులన్
నిలుపుట లేదు చారురమ♦ణీమధురోష్ఠము గ్రోలలేదు ని
ష్ఫల మయి జవ్వనం బరిగెఁ ♦ బాడుగృహంబున దీపముంబలెన్.

ప్రతివాదుల నణఁగఁ ద్రొక్కఁజాలిన యుత్తమోచిత మగువిద్య నభ్యసించనైతి. సమరమునందు శత్రుగజకుంభస్థలముల ఖడ్గాగ్రములతోఁ జీల్చి స్వర్గ మంటు యశమునేని యార్జింపలేనయితిని. చందురుపొడుపున నెచ్చెలి చిఱుదొండపండువంటి మోవి నొక్కి తేనియ నాని తనియనేని. తనియనైతిని. ఇస్సిరో! ఎందుకనునుగాని నాతారుణ్యముఁ బాడుకొంపలోని దీపమట్లు నిరుపయుక్తముగాఁ గడచెనుగదా!

విద్యా నాధిగతా కళఙ్కరహితా విత్తంచ నోపార్జితం
శుశ్రూషాఽపి సమాహితేన మనసా పిత్రో ర్న సమ్పాదితా,
ఆలోలాయతలోచనాః ప్రియతమా స్స్వప్నేఽపి నాలింగితాః
కాలోఽయం పరపిణ్డలోలుపతయా కాకై రివ ప్రేరితః. 47

చ. వినయవిశేషహృద్య లగు♦విద్యలు నేర్చుట లేదు నీతిచే
ధనమును గూర్పలేదు తలి♦దండ్రుల సేవయుఁ జేయ లేదు చ
క్కనిచిగురాకుబోండ్లబిగి♦కౌఁగిలియుం గలనైన లేదు గో
బ్బున సమయంబు కాకులకుఁ ♦ బోలె గతించెఁ బరాన్నభుక్తులన్.

నిష్కళంకమయిన విద్యను నేర్వలేదు. ధనము నార్జింపలేదు. నిలుకడగల మనసుతోఁ దలిదండ్రులకు సేవ కావింపలేదు. చంచలవిశాలనయన లగుమించుఁబోండ్లకౌఁగిలింతల స్వప్నమునసైన నందుకొనలేదు. కాకులవలెఁ బరపిండములకై తిరిగి కాలమును గోలుపోయితిమి.

వయం యేభ్యో జాతా శ్చిరపరిగతా ఏవ ఖలు తే
సమం యై స్సంవృద్ధా స్స్మృతివిషయతాం తేఽపి గమితాః,
ఇదానీ మేతే స్మః ప్రతిదివస మాసన్నపతనా
గతా స్తుల్యావస్థాం సికతిలనదీతీరతరుభిః. 48

ఉ. తాలిమి మాలి కన్నతలి♦దండ్రులతోడ మెలంగువారలం
గాలము గోలుపుచ్చె నని ♦ కానరు ఘోరజరాభరార్తులై
తూలుచు నిత్యసన్నిహిత♦దుర్దశులై సికతాలగన్నదీ
కూలమహామహీజముల♦కుం సరివత్తురు మూఢమానసుల్.

మమ్ముఁ గన్న తలిదండ్రులు గతించి చిరకాలమైనది. ఎవరితోఁ బెరిగితిమో వారును స్మరణీయులైరి. ఇప్పు డీమాకును, ఇసుకపాఱుగా నున్నయేటిదరిని గల చెట్టునకువలెఁ గూలుకాలము చేరువగుచున్నది.

ఆయుర్వర్షశతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతం
తస్యార్ధస్య పరస్య చార్ధమపరం బాలత్వవృద్ధత్వయోః,
శేషం వ్యాధివియోగదుఃఖసహితం సేవాదిభి ర్నీయతే
జీవే వారితరఙ్గచఞ్చలతరే సౌఖ్యం కుతః ప్రాణినామ్. 49

ఉ. ఆయువు నూఱువత్సరము • లందు సగంబు నశించె నిద్రచే
నాయఱలో సగంబు గత • మయ్యెను బాల్యజరాప్రసక్తిచేఁ
బాయక తక్కినట్టిసగ • బాలు గతించుఁ బ్రయాసవృత్తిచేఁ
నాయువు చంచలం బగుడుఁ • బ్రాణుల కెట్లు సుఖంబు చేకుఱున్.

మనుజుల కాయుఃపరిమితి 100 వత్సరములు. అందు సగము (50 ఏండ్లు) నిద్రలోఁ బోవును. మిగిలిన 50 సంవత్సరములలోఁ బసితనము ముసలితనములలో 25 వర్షములు పోవును. రోగములతోను, ఎడఁబాటులతోను, దుఃఖములతోను నిండిన తక్క 25 వత్సరములును బొట్టకై సేవాదికృత్యములతో గడపవలయును. మఱి యీ జీవిత మన్ననో నీటిపలెఁ జంచలము. ప్రాణుల కిఁక సౌఖ్య మెట్లు?

క్షణం బాలో భూత్వా క్షణ మపి యువా కామరసికః
క్షణం విత్తై ర్హీనః క్షణ మపిచ సమ్పూర్ణవిభవః,
జరాజీర్ణై రఙ్గై ర్నట ఇవవలీమండితతను
ర్నర స్సంసారాన్తే విశతి యమధానీయవనికామ్. 50

ఉ. బాలకుఁడై క్షణంబు యువ • భావయుతుం డయి కొంతకాల ము
ద్వేలదరిద్రుఁడై క్షణము • విత్తసమన్వితుఁడై క్షణంబు జీ
ర్ణాలసగాత్రుఁడై నటుని • యట్లు నటించి తుదిన్ నరుండు యా
మ్యాలయనామ మైన తెర • యందుఁ జొరంబడు సత్వరంబుగన్.

సంసార మను నెడు కపటనాటకమున నరుఁడను నట్టువు, కొంతకాలము బాలుఁడుగను, మఱికొంతకాలము భోగరసికతతోఁ బడుచువాఁడుగను, ఇంకఁ గొంతకాలము దరిద్రుఁడుగను, మఱియుఁ గొంతకాలము ఐశ్వర్యశాలిగను, ఆపైఁ గొంతకాలము ముసఁడుకాళ్ల ముదుసలిగను నటించి తుదకు యమపుర మను తెరమఱుఁగునకుఁ జొచ్చును.



## యతినృపతిసంవాదము.

త్వం రాజా వయ మ ప్యుపాసితగురుప్రజ్ఞాభిమానోన్నతాః
ఖ్యాత స్త్వం విభవై ర్యశాంసి కవయో దిక్షు ప్రతన్వన్తి నః,
ఇత్థం మానధనాతిదూర ముభయో రప్యావయో ర న్తరం
యద్యస్మాసు పరాఙ్ముఖోఽసి వయ మ ప్యేకాన్తతో నిస్స్పృహాః. 51

ఉ. రాజవు నీవు మేము గురు • రాట్కలితప్రతిభాభిమానవి
భ్రాజిమహోన్నతాత్ములము • భవ్యధనప్రథితుండ వీవు స
ద్రాజి నుతించు మాయశము • దవ్వు సుమీ మనవాసి మమ్ము ని
ర్వ్యాజతఁ జూడవేని యను • రాగము మాకును లేదు నీయెడన్.

నీవు దొరవు. మేము గురుశుశ్రూషచే నార్జించిన ప్రజ్ఞావిభవముచే నధికులము. సొమ్మున నీవు పేరెత్తినవాఁడవు. జ్ఞానమున మాకీర్తిని కవులు దిగంతముల నించుచున్నారు. ఇవ్విధమున నీకును మాకును భేద మంతగాలేదు. నీవే మమ్ము లెక్కసేయవేని నిస్స్పృహుల మగు మేము ని న్నాశించువారము.

అర్థానా మీశిషే త్వం వయ మపి చ గిరా మీశ్మహే యావదర్థం
శూర స్త్వం వాదిదర్పవ్యుపశమనవిధా వక్షయం పాటవం నః,
సేవన్తే త్వాం ధనాఢ్యా మతిమలహతయే మామపి శ్రోతుకామా
మయ్యప్యాస్థా న తేచే త్త్వయి మయి సుతరా మేవ రాజన్గతోఽస్మి.

చ. ధనపతి వీవు మేము వివి • ధశ్రుతిపుంజపదార్థతత్త్వశా
సనులము నీవు శూరుఁడవు • చండతరప్రతివాదిగర్వభం
జనులము మేము నిన్ను ధన • శాలులు మమ్ము భజింతు రాశ్రితుల్
వినయము సేయవేని పృథి • వీవర సాగెద మీక్షణంబునన్.

నీకు ధనముకలదు. మాకు సర్వశాస్త్రసిద్ధాంతములు కలవు. నీవు దేహశూరుఁడవు. మేము వాదశూరులము. ధనకాములు నిన్నుఁ గొలుతురు. చిత్తశుద్ధికాములు మమ్ము శుశ్రూషచేయుదురు. నాయందు నీకు గౌరవముతేదేని నీయందు నాకు మొదలే లేదు. ఇదుగోఁ బోవుచున్నాను.

వయ మిహ పరితుష్టా వల్కలై స్త్వం దుకూలైః
సమ ఇహ పరితోషో నిర్విశేషో విశేషః,
స తు భవతి దరిద్రో యస్య తృష్ణా విశాలా
మనసి చ పరితుష్టే కోఽర్థవాన్ కో దరిద్రః. 53

చ. కలితదుకూలవస్త్రములు ♦ గట్టిన నీకును జీర్ణవల్కలం
బులు ధరియించు మాకును బ్ర♦మోదము తుల్యము లేదు వాసియ
గ్గల మగుతృష్ణ యెవ్వనికి ♦ గాఢదరిద్రుఁడు వాఁడు లేమియుం
గలిమియు లేవు సమ్మదవి♦కస్వరమానసు లైనవారికిన్.

దుకూలములుదాల్చి నీ వెంతతృప్తి చెందుదువో నారచీరలు దాల్చి మేమునంత తృప్తిని చెందుచునేయున్నాము. తృప్తియెడల నిర్వారకును భేదములేదు. ఇంక నింక నని యాశ యెవని బాధించునో వాఁడు దరిద్రుఁడగును. కాని మనసు తృప్తిచెందినపుడు దారిద్ర్యమేమి? ఐశ్వర్యమేమి? అట్టివాఁ డీరెంటికిని లోఁబడఁడు.

ఫల మల మశనాయ స్వాదు పానాయ తోయం
క్షితి రపి శయనార్థం వాససే వల్కలం చ,
నవధనమధుపానభ్రాన్తసర్వేన్ద్రియాణా
మవినయ మనుమన్తుం నోత్సహే దుర్జనానామ్. 54

చ. ఫలములు చాలు జీవికకుఁ ♦ బానము సేయ జలంబు చాలు వ
ల్కలములు చాలుఁ గట్టుట కి♦లాతలముల్ శయనింపఁ జాలు ని
ష్ఫలనవవిత్తసీధురస♦పానవిజృంభితమోహలీనచి
త్తు లగునికృష్టభూపతుల♦దుర్నయ మించుకయున్ సహింతునే.

తినుటకుఁ బండ్లును, త్రావ నుదకమును, కట్టుటకు నారచీరలును, శయనింప నేలయును మాకుఁ జాలును. కల్లుద్రావినఁ గై పెక్కినట్లు నూతనసంపదచే నొడలు మరచి కనులు గానకున్న నీచులదుర్వినయమును కనుఁగొని మనఁగి యుండఁ దలంపము.

అశ్నీమహి వయం భిక్షా మాశావాసో వసీమహి,
శయీమహి మహీపృష్ఠే కుర్వీమహి కి మీశ్వరైః. 55

తే. చేరి భిక్షాన్న మారగిం♦చెదము మేము
కట్టెదము దిక్కు లనియెడి♦కలితశాటిఁ
బవ్వళించెద మిల యను♦పాన్పుమీఁద
నేమికార్యము మాకు న♦రేంద్రులందు.

భిక్షాన్నము భుజింతుము. దిగంబరులముగా నుందుము. నేలపై శయనింతుము. ఐశ్వర్యవంతులతో మా కేమి పని కలదు?

న నటా న విటా న గాయకా న చ సభ్యేతరవాదచుంచవః,
నృప మీక్షితు మత్ర కే వయం స్తనభారా నమితా న యోషితః.



క. విటగాయక వైతండిక
నటజనులము గాము పృథుఘన స్తననమితో
త్కటవారకాంతలము గా
మటు గావున నృపునిఁ జూడ ♦ నగునే మాకున్. 56

మేము నటులముకాము. విటులముకాము. గాయకులముకాము. అసభ్యవాదచుంచువులముకాము. చనుఁగవ వ్రేఁగున వంఁగాడు భోగమువాండ్రము కాము. రాజును జూడ మాకేల?

విపులహృదయై ర్ధన్యైః కైశ్చి జ్జగ జ్జనితం పురా
విధృత మపరై ర్దత్తం చాన్యై ర్విజిత్య తృణం యథా,
ఇహ హి భువనా న్యన్యే ధీరా శ్చతుర్దశ భుఞ్జతే
కతిపయపురస్వామ్యే పుంసాం క ఏష మదజ్వరః. 57

ఉ. అంచితబుద్ధు లైనమను♦జాధిపతుల్ జగ మెల్లఁ దొల్లి ని
ర్మించిరి దానిఁ గొందఱు భ♦రించిరి యిచ్చిరి గొంద ఱర్థికిన్
మించి జగమ్ము లన్నియును♦ నెమ్మి భుజించుచుఁ గొంద ఱుండఁగాఁ
బంచపపట్టణేశుల క♦పారమదజ్వర మింత యేటికిన్.

తొల్లి మహాస్వాంతు లగుప్రజాధిపతు లీజగమును సృజించిరి. పిదప మఱికొందఱు మన్వాదులుకాపాడిరి మఱికొందఱు పరశురామప్రభృతులు జయించి యితరులకు దానముచేసిరి. ఇప్పుడును బదునాల్గుభువనములను ధీరులగుబలిముఖ్యులనుభవించుచున్నారు కొన్నియూళ్లకుమాత్రముదొరతనముబ్బినంతనే మనుజులకీమదజ్వరమేమి?

అభుక్తాయాం యస్యాం క్షణ మపి న యాతం నృపశతై
ర్భువ స్తస్యా లాభే క ఇవ బహుమానః క్షితిభృతామ్,
తదంశ స్యా ప్యంశే తదవయవలేశేఽపి పతయో
విషాదే కర్తవ్యే విదధతి జడాః ప్రత్యుత ముదమ్. 58

చ. ఎడ నిముసంబు లేక ధర♦ణీశశతంబు భుజించుచున్న యి
ప్పుడమి లభించినన్ మహిమ ♦ పొందునె రాజుల నేల తున్కలో
నడరు లవంబులోఁ దునియ ♦ యం దొకమూలకు నాథులైనవా
రడలక వైపరీత్యమున ♦ హర్షము చెందుదు రెంత మందులో!

ఈభూమి నెప్పుడును రాజు లెవరో యనుభవించుచునేయుందురు. ఇట్టి భుక్తముక్త మగుభూమి లభించినప్పుడు రాజులకేపాటిగౌరవము చేకుఱును? అందు నీభూమి

యంశములోని యంశమునం దొకలవలేశమునకు యాజమాన్యము చెందువారు చింతిల వలసియుండఁగా మూర్ఖులై వైపరీత్యముచే సంతసింతురేల ?

మృత్పిణ్డో జలరేఖయా వలయిత స్సర్వోఽప్యయం నన్వణుః
స్వాంశీకృత్య స ఏవ సంయుగశతై ర్రాజ్ఞాం గణై ర్భుజ్యతే,
నో దద్యు ర్దదతేఽథవా కి మపి తే క్షుద్రా దరిద్రా భృశం
ధి గ్ధి క్తాన్ పురుషాధమాన్ ధనకణం వాఞ్ఛన్తి తేభ్యోఽపి యే.

చ. తగ జలరేఖచే వలయి♦తం బగుకొంచెపుమంటిముద్దకై
జగడము లాడి యాడి పెలు♦చన్ విభజించి భుజించుచున్నదు
ర్భగనృపు లిచ్చువారె తలఁ♦పం గడు నీచులు వారియందు నొ
ప్పుగ ధనలేశకాంక్ష గల♦పూరుషులుం గడుహీనులే కదా.

ఈభూమి సముద్రముచే గిఱిగీయఁబడిన మట్టిముద్దగదా ! ఇది యీసృష్టిలో నెంత ; అణువంత ; ఈయణువంతను యుద్ధములుచేసి కొట్లాడి కొట్లాడి పెక్కురు రాజులు పంచుకొని యనుభవించుచున్నారు. ఇట్టివారొరుల్ల కొసంగుదురా ? ఒసంగినను నానికృష్టులు నీచాతినీచముగా నించుకంత ! ఇస్సిరో! అట్టినృపతులకడ యాచనకుఁ బోవువారిబ్రదు కెంతరోఁత !

స జాతః కోఽప్యాసీ న్మదనరిపుణా మూర్ధ్ని ధవళం
కపాలం య స్యోచ్చై ర్వినిహిత మలఙ్కారవిషయే,
నృభిః ప్రాణత్రాణప్రవణమతిభిః కైశ్చి దధునా
నమద్భిః కః పుంసా మయ మతులదర్పజ్వరభరః. 60

చ. అతఁడ సుజన్ముఁ డెవ్వనిస♦మంచితశుభ్రకపాల మద్రిజా
పతి కుతుకంబుతోడఁ దల♦పై ధరియించె విభూషణంబుగా
క్షితిపయిఁ బ్రాణరక్షణము ♦ సేయుటకై తముఁ జేరి కొంద ఱా
నతు లయి రంచు దుర్మదఘ♦నజ్వర మేటికి మానవాళికిన్.

ఎవనికపాలమును పరమేశ్వరుఁడు వానిభక్తికి మెచ్చి మరణానంతరమున శిరోలంకారముగాఁ దాల్చెనో ఆవానిజన్మమే సార్థకము. తమపొట్టకై యెవరోకొందఱు మ్రొక్కినంతమాత్రముననే రాజులకుఁ గొందఱ కీమిన్ను మన్ను గానక విఱ్ఱవీఁగుట యేమి ?

—మనస్సంబోధననియమనము.—

పరేషాం చేతాంసి ప్రతిదివస మారాధ్య బహుధా
ప్రసాదం కిం నేతుం విశసి హృదయ క్లేశకలిలమ్,



ప్రసన్నే త్వ య్యన్త స్స్వయ ముదితచిన్తామణిగుణే
విముక్త స్సంకల్పః కి మభిలషితం పుష్యతి న తే. 61

చ. పరులమనంబు లోలి బహు♦భంగులఁ గొల్చి ప్రసన్నతాగుణ
స్ఫురణ వహింపఁ జేయుటకుఁ ♦ బూనఁగ నేటికి నీవు చిత్తమా
స్థిరముగ సుప్రసాదము భ♦జించి నిలింపమణీగుణోదయ
స్ఫురితగతిన్ మనోరథము ♦ సొంపు వహింపదె నీకు మేలుగన్.

ఓమనసా ! ఒరులమనస్సులను దినము ననుసరించి వారియనుగ్రహము నార్జించుకొనుట కేల కడగండ్లు పడెదవు ? నీవు నిర్మలముగా నగుదువేని చింతామణిఁ బోలుదువు ఎట్లనఁగా : సంకల్పములు పోయినతర్వాతఁ గావలసిన దేమున్నది ?

పరిభ్రమసి కిం వృథా క్వ చన చిత్త ! విశ్రామ్యతాం
స్వయం భవతి య ద్యథా భవతి త త్తథా నాన్యథా,
అతీత మననుస్మర న్నపి చ భా వ్యసఙ్కల్పయ
న్నతర్కితసమాగమా ననుభవామి భోగా నహమ్. 62

ఉ. ఏల పరిభ్రమించెద న♦నేకవిధంబుల వెఱ్ఱిచిత్తమా
తాలిమి విశ్రమింపు మొక♦తావున యత్నము లేకయే యగున్
మేలును గీడు నేఁ దలఁప ♦ మించినకార్యము భావికార్యమున్
లాలసవృత్తిఁ గోర విధి♦లబ్ధఫలంబులు నే భుజించెదన్.

ఓ మనసా ! వ్యర్థముగా నేలభ్రమ్మరెదవు ? ఎక్కడైన విశ్రమింపుము. ఏది యెట్లు కావలయునో యది యట్లేయగుఁగాని వేఱుకాదు. కావున నేను కడచినదానిఁ దలపెట్టక రానున్నదానిఁ గోరక యప్రయత్నలబ్ధము లగుభోగముల ననుభవించెదను.

ఏతస్మా ద్విర మేన్ద్రియార్థగహనా దాయాసకా దాశ్రయ
శ్రేయోమార్గ మశేషదుఃఖశమనవ్యాపారదక్షం క్షణాత్,
శాన్తం భావ ముపైహి సన్త్యజ నిజాం కల్లోలలోలాం గతిం
మా భూయో భజ భఙ్గురాం భవరతిం చేతః ప్రసీదాధునా. 63

శా. ఆయాసప్రద మింద్రియార్థగహనం ♦ బాత్రోవ వర్జింపుమీ
శ్రేయోమార్గము సర్వదుఃఖనికర♦చ్ఛేదార్థమై చేరుమీ
ధ్యేయాద్వైతముఁ బొందుమీ స్థిరతచే ♦ దీపింపుమీ చిత్తమా
మాయాకేళికి వెండియుం జొరకుమీ ♦ మాలిన్యమున్ వీడుమీ.

మనసా ! ఆయాసపెట్టెడు నీయింద్రియార్థము లనెడునరణ్యముతోవ వర్జించి శ్రేయస్సునకుఁ జేర్చునట్టియు సర్వదుఃఖనాశక మగునట్టియు సన్మార్గమునఁ బ్రవేశిం

వుము. ప్రశాంతధ్యానమును జెందుము. అతిచంచలమగు నిష్ఫలవర్తనమును విడనాడుము. అస్థిరమగు సంసారేచ్ఛను మనలఁ జెందకుము. నైర్మల్యము నందుము.

మోహం మార్జయ తా ముపార్జయ రతిం చన్ద్రార్ధచూడామణౌ
చేతః స్వర్గతరంగిణీతటభువా మాసఙ్గ మఙ్గీకురు,
కో వా వీచిషు బుద్బుదేషు చ తటిల్లేఖాసు చ స్త్రీషు చ
జ్వాలాగ్రేషు చ పన్నగేషు చ సరిద్వేగేషు చ ప్రత్యయః. 64

చ. దురితపుమోహముం దొలఁగఁ ద్రోయుము చేయుము భక్తి శూలిపై
వరసురవాహినీతటని వాసముఁ జేకొను మేటి నమ్మికల్
తరఁగలయందు బుద్బుదవితానములందు మెఱుంగుఁదీఁగెలం
దరయుఁగఁ గీలలందు ఫణులందు సుహృజ్జనులందు డెందమా.

డెందమా! సంసారమోహము నింక విడనాడుము. అర్ధచంద్రావతంసునిపైఁ దాత్పర్యముఁ జెందుము. గంగానదీతీరప్రదేశముల నివసింపఁదలంపుము. తరఁగలందును, నీటిబుడగలందును, మెఱుపులందును, స్త్రీలయందును, జ్వాలాగ్రములందును, సర్పములందును, నదీవేగములందును నమ్మిక ముండదగునా?

చేతశ్చిన్తయ! మా రమాం సకృదిమా మస్థాయినీ మాస్థయా
భూపాల భ్రుకుటీకుటీవిహరణవ్యాపారపణ్యాఙ్గనామ్,
కన్థాకఞ్చుకితాః ప్రవిశ్య భవనద్వారాణి వారాణసీ
రథ్యాపఙ్క్తిషు పాణిపాత్రపతితాం భిక్షా మపేక్షామహే. 65

ఉ. అవనీశభ్రుకుటీకుటీవిహరణవ్యాపారపణ్యాంగనన్
భువిలో సంపద నించుకం గొనకుమీ భోగార్థమై చిత్తమా
శివమోదావహకాశికానగరు శ్రీరాజమార్గంబులన్
భవనద్వారములందుఁ జేత నిడు సద్భైక్షం బపేక్షించెదన్.

చిత్తమా! రాజులకనుబొమ్మలను గుడిసె వేసి లక్ష్మి యనెడు వెలయాలు తిరుగులాడుచుండును. ఎప్పుడును నిలుకడ లేక వర్తించు బహుచారిణిని గోరకుము. బొంత గప్పికొని వారాణసీపట్టణవీథులందు గృహద్వారములనుండి యఱచేతిలో నుంచఁబడు భిక్షాన్నము నారగించి మేము జీవింపఁగలము

అగ్రే గీతం సరసకవయః పార్శ్వయో ర్దాక్షిణాత్యాః
పశ్చా ల్లీలావలయరణితం చామరగ్రాహిణీనామ్,
యద్యస్త్యేవం కురు భవరసాస్వాదనే లమ్పటత్వం
నో చే చ్చేతః ప్రవిశ సహసా నిర్వికల్పే సమాధౌ, 66



గంగాతీరమున వసించి తపములే చేయుదుమా? చక్కఁగా ననుకూలవతియగు భార్యతో సౌఖ్యమనుభవింతుమా? శాస్త్రప్రవాహములఁ ద్రావుదుమా? కావ్యామృతరస మాస్వాదింతుమా? కొన్ని నిమేషములమాత్ర మగు నీయాయుష్కాలమున నేది యని కావింతుము.

దురారాధ్యా శ్చామీ తురగచలచిత్తాః క్షితిభుజో
వయం తు స్థూలేచ్ఛాః సుమహతి ఫలే బద్ధమనసః,
జరా దేహం మృత్యు ర్హరతి దయితం జీవిత మిదం
సఖే! నాన్య చ్ఛ్రేయో జగతి విదుషోఽన్యత్ర తపసః. 77

ఉ. వాజిచలస్వభావు లగువారు ప్రసన్నులు గారు భూపతుల్
రంజనవృత్తి మానరు దురాశయు నెక్కుడు మాకు సొమ్ముపైఁ
దేజ మడంచు వృద్ధదశ దీకొని ప్రాణము నొంచుఁ గాలుఁడ
వ్యాజతపంబుకన్న భువి నాత్మహితం బగుకృత్య మున్నదే.

గుఱ్ఱములవలెఁ జంచలించుచిత్తము గలరాజుల నారాధించుట బహుకష్టము. మనకా యాశలు పెద్దవి. కొంచెంతఫలముపై మనస్సు పాఱుచున్నది. దేహప్రాణములను జరామృత్యువులు హరింపనున్నవి. కావున మిత్రమా! తపస్సుకంటె శ్రేయస్కరము విద్వాంసున కొండొకటిలేదు.

మానే మ్లాయిని ఖణ్డితే చ మనసి వ్యర్థం ప్రయాతేఽర్థిని
క్షీణే బన్ధుజనే గతే పరిజనే నష్టే శనై ర్యౌవనే,
యుక్తం కేవల మేత దేవ సుధియాం య జ్జహ్నుకన్యాపయః
పూతగ్రావగిరీన్ద్రకన్దరతటీకుఞ్జే నివాసః క్వచిత్. 78

ఉ. మానము గ్రుంగఁగా ధనము మట్టముగా నిజబాంధవాశ్రితుల్
దీనతఁ జెంది యేగ నతిథిప్రకరంబు నిరాశమై చనన్
మానుగ జవ్వనం బరుగ మాన్యనకుం దగు జహ్నుకన్యకా
నూనతరంగపూతకలితోపలశైలనికుంజవాసముల్.

గౌరవము తగ్గును. ధనము పోవును. యాచకులు వట్టిచేతులతోఁ బోవుదురు. బంధుజనులు క్షీణింతురు. పరిజనము విడనాడును. యౌవన ముడిగిపోవును. ఈయవస్థలు సంభవించునప్పుడు బుద్ధిమంతుఁ డగువాఁడు గంగాప్రవాహముచేఁ బవిత్రీకరింపఁబడిన హిమాలయగుహాసమీపమున నొకపొదరింటఁ దప మాచరించుట యుక్తము.

రమ్యా శ్చన్ద్రమరీచయ స్తృణవతీ రమ్యా వనాన్తస్థలీ
రమ్యం సాధుసమాగమాగతసుఖం కావ్యేషు రమ్యాః కథాః,
కోపోపాహితబాష్పబిన్దుతరళం రమ్యం ప్రియాయా ముఖం

సర్వం రమ్య మనిత్యతా ముపగతే చిత్తే న కించి త్పునః. 79

ఉ. మంచివి పండువెన్నెలలు ♦ మంచివి పుష్పవనప్రదేశముల్
మంచిది సాధుసంగమస♦మాగతసౌఖ్యము చాటువాక్యముల్
మంచివి మంచి దశ్రుయుత♦మానవతీముఖ మీనసుప్తముల్
మంచిది కా దనిత్య మని ♦ మానసవృత్తి నెఱుంగువారికిన్

పండువెన్నెలలు కనులపండువులు. పచ్చికబయళ్లు మెచ్చుకూర్చునవి. సత్సాంగత్య ముత్సాహకరము. కావ్యకథలు శ్రావ్యములు. అలుకచేఁ గనుల నీరుకార్చుకాంతావదనము సంతోషకరము. ఇవి యన్నియు మిగుల రమ్యములే. కాని వీని యనిత్యత చిత్తమున కెఱుకపడెనా యేదియు నిందు రమ్యముగాదు.

రమ్యం హర్మ్యతలం న కిం వసతయే శ్రావ్యం న గేయాదికం
కిం వా ప్రాణసమాసమాగమసుఖం నైవాధికప్రీతయే,
కిన్తు భ్రాన్తపతఙ్గపక్షపవనవ్యాలోలదీపాంకుర
చ్ఛాయాచఞ్చల మాకలయ్య సకలం సన్తో వనాన్తం గతాః. 80

ఉ. సంతతముల్ సుఖంబొసఁగఁ ♦ జాలవె చాలవిశాలసౌధముల్
కాంతలసంగముల్ మధుర♦గానములున్ వివరించి చూడ సం
భ్రాంతపతంగపక్షభవ♦మారుతఘాతవిధూతదీపికా
కాంతిచలంబు సర్వ మని ♦ కానల కేగిరి పండితోత్తముల్.

నివసించుటకు మేడలు బాగుండవా? చక్కని గానము శ్రావ్యము కాదా? ప్రాణసమానురా లగుజవరాలితోడి కలయిక మిగుల నష్టము కలిగింపదా? ఇవియెల్లఁ గుతూహలము గలిగించునవియే. కాని చుట్టును దిరుగు మిడుత ఱెక్కలగాలిచేఁ గదలుచుండు దీపపుమొగ్గవలె నస్థిరము లనియెఱిఁగి వీనినాశింపక మహనీయులు తపము కావింప నడవులకేగిరి.

## —శివార్చనము.—

ఆసంసారం త్రిభువన మిదం చిన్వతాం తాత! తాదృ
ఙ్నైవాస్మాకం నయనపదవీం శ్రోత్రమార్గం గతో వా,
యోఽయం ధత్తే విషయకరిణీ గాఢరూఢాభిమాన
క్షీబస్యాన్తఃకరణకరిణ స్సంయమాలానబీజమ్. 81

మా. తగ సంసారము నాదినుండియును ద♦త్తత్కర్మసంయుక్తి ము
జ్జగముం ద్రిమ్మరు వాఁడఁ గానఁబడఁ డే♦చందంబునం గర్ణమా
ర్గగతుం డైనను గాఁడు భోగకరిణీ♦గాఢాదరోన్మత్తచి
త్తగరిష్ఠద్విపరాజసంయమపటు♦స్తంభాత్మకుం డెవ్వఁడున్.



విషయము లనెడు నాఁడుయేనుఁగులమీఁదిమరులుచే మదమెక్కి వాని పైకి దుముక నుంకించునంతఃకరణ మనుమత్తగజమునకుఁ గట్టుగొయ్యవంటిపురుషుండు, యీయనాదిసంసారమున మూఁడులోకములను వెదకినను, నాయనా మాకుఁగనఁబడలేదు. మేము వినలేదు.

య దేత త్స్వచ్ఛన్దం విహరణ మకార్పణ్య మశనం
సహార్యై స్సంవాస శ్శ్రుత ముపశమైకవ్రతఫలమ్,
మనో మన్దస్పన్దం బహిరపి చిరస్యాపి విమృశ
న్నజానే కస్యైషా పరిణతి రుదారస్య తపసః. 82

ఉ. ఇచ్చకు వచ్చినట్లు చరి♦యించుట దైన్యములేనితిండియున్
సచ్చెలు సాధుసంగమును ♦ నిర్మలశాంతియు శాస్త్రబోధమున్
మచ్చిక లోనఁ బూని వెలి♦మట్టని చిత్తము నాఁగ నింతయున్
వచ్చుట యేమహోన్నతత♦పంబు ఫలంబొ యెఱుంగ నేర్తుమే.

ఈ స్వచ్ఛందవిహారము, దైన్యములేనియాహారము, సత్సాంగత్యము, శాంతిప్రదమగు నెఱుక, మనస్సును బాహ్యవిషయములందుఁ బ్రసరింపఁజేయమి, ఈసర్వమును నేగొప్పతపమునకు ఫలముగా సంభవించెనో తెలిసికోలేకున్నారము.

జీర్ణా ఏవ మనోరథా శ్చ హృదయే యాతం చ త ద్యౌవనం
హన్తాఙ్గేషు గుణా శ్చ వన్ధ్యఫలతాం యాతా గుణజ్ఞై ర్వినా,
కిం యుక్తం సహసాఽభ్యుపైతి బలవాన్ కాలః కృతాన్తోఽక్షమీ
హా! జ్ఞాతం మదనాన్తకాఙ్ఘ్రియుగళం ముక్త్వాఽస్తి నాన్యా గతిః.

ఉ. చిత్తమునందె కోరికలు ♦ జీర్ణములయ్యె నశేషగాత్రముల్
హత్తినజవ్వనం బరిగె ♦ నార్యులు లేమి గుణంబులున్ ఫలో
చ్ఛిత్తి వహించె నెద్ది తగుఁ ♦ జేరక మానఁడు కాలుఁ డక్కటా!
చిత్తజవైరిపాదయుగ♦సేవనమే గతిగా నెఱింగితిన్. 83

కోరికలు మనస్సులోనే జీర్ణించినవి. యౌవనము నవయవములలోనే యంతరించినది. గుణజ్ఞులులేక గుణములును వ్యర్థములయినవి. కాలమా బలవంతమయినది. మృత్యువు సైఁచునదికాదు. ఇప్పుడు సేయవలసినదేమి? ఆ! తెలిసినది. మన్మథాంతకుని చరణముల సేవించుటకా కింకనేమున్నది?

మహేశ్వరే వా జగతా మధీశ్వరే జనార్దనే వా జగదన్తరాత్మని,
న వస్తుభేదప్రతిపత్తి రస్తి మే తథాపి భక్తి స్తరుణేన్దుశేఖరే. 84

తే. జగదధీశ్వరుఁ డగుమహే♦శ్వరునియందు
సకలజగదంతరాత్ముఁడౌ ♦ శార్ఙ్గియందు

భేదవిజ్ఞాన మెయ్యెడ ♦ లేదు మాకు
నైనఁ దరుణేందుశేఖరు ♦ నందె భక్తి.

జగదధీశ్వరుఁడగు మహేశ్వరునందును, జగదంతర్యామి యగుజనార్దనునందు నుమాకు భేదబుద్ధిలేదు. ఇద్దరును నొకటే; కాని పూపసెల దాల్చునందు భక్తి బలసి యున్నది

స్ఫురత్ స్ఫారజ్యోత్స్నాధవళితతలే క్వాపి పులినే
సుఖాసీనా శ్శాన్తధ్వనిషు రజనీషు ద్యుసరితః,
భవాభోగోద్విగ్నా శ్శివ శివ శి వేత్యుచ్చవచసః
కదా స్యా మానన్దోద్గతబహుళబాష్పాప్లుతదృశః. 85

శా. శాంతారావనిశీథకాలముల భా ♦ స్వత్సాంద్రచన్ద్రాతపా
క్రాంతస్వచ్ఛమరున్నదీపులినమో ♦ గ్యక్షోణిఁ గూర్చుండి జ
న్మాంతోద్వేగుల మైనమేము శివశ ♦ బ్దావృత్తితో నెప్పు డ
త్యంతానందభవాశ్రుసంకులదశా ♦ వాప్తిన్ సుఖం బుందుమో.

నిశ్శబ్దముగా మా యుండిగినవేళ నిండారినపండువెన్నెలలచేఁ దెల్లవాఱిన గంగానది యిసుకతిన్నియ పైఁగూరుచుండి యనంతమైన సంసారమునురోసి 'శివశివా'యని పెద్దగ సంకీర్తనము సేయుచుఁ గనులనిండ నానందాశ్రువులు రా నుండు టెప్పుడో!

వితీర్ణే సర్వస్వే తరుణకరుణాపూర్ణహృదయా
స్స్మరన్త స్సంసారే విగుణపరిణామాం విధిగతిమ్,
వయం పుణ్యారణ్యే పరిణతశరచ్చన్ద్రకిరణా
స్త్రియామా నేష్యామో హరచరణచిన్తైకశరణాః. 86

చ. కలధన మంతయున్ సెలవు ♦ గా నిడి నూత్నకృపాప్రపూర్ణచి
త్తుల మయి సంసృతిం గుశల ♦ దూరవిపాకము గాఁగ దైవముం
దలఁచుచుఁ గానలో శివప ♦ దస్మృతినిష్ఠుల మై నయింపఁగాఁ
గలము శరత్ప్రసన్నమిహి ♦ కాకరరమ్యము లైనరాత్రులన్.

పరిపూర్ణకరుణాంతరంగమున నినమెల్ల బీద లకు దానముఁజేసి సంసారమునందలి దైవదుర్విలసితమును చింతించుచుఁ బుణ్యారణ్యమునఁ బండువెన్నెలలో శివపదచింతనము కావించుచు మే మెన్నఁడు రేలు గడపెదమో!

కదా వారాణస్యా మమరతటినీరోధసి వస
న్వసానః కౌపీనం శిరసి నిదధానోఽఞ్జలిపుటమ్,
అయే! గౌరీనాథ! త్రిపురహర! శమ్భో! త్రినయన!
ప్రసీదేతి క్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్. 87



ఉ. శ్రీనుతకాశియం దమర ♦ సింధువుచెంగట నిల్చి గోఁచినిం
బూని ప్రణామముద్రఁ దల ♦ మోపి "పురాంతక! పార్వతీశ! శం
భో! నిటలాక్ష! రక్ష" యని ♦ మొఱ్ఱలు వెట్టుచు నిశ్చలానుసం
ధానత నెన్నఁడే గడపె ♦ దన్ దినముల్ నిమిషంబుకైవడిన్.

ఎప్పుడు కాశిలో గంగయొడ్డున గోఁచిపెట్టుకొని కూరుచుండి యాదలఁ జేతులు దోయి మోడ్చి, 'ఓగౌరీనాథా! పురహరా! శంభూ! త్రినయనా! అనుగ్రహింపుము' అని మొఱయిడుచు దినములను నిమిషములవలె గడపుదునో!

స్నాత్వా గాఙ్గైః పయోభిశ్శుచికుసుమఫలై రర్చయిత్వా విభో! త్వాం
ధ్యేయే ధ్యానం నియోజ్య క్షితిధరకుహరగ్రావపర్యఙ్కమూలే,
ఆత్మారామః ఫలాశీ గురువచనరత స్త్వత్ప్రసాదాత్ స్మరారే
దుఃఖం మోక్ష్యే కదాఽహం సముకరచరణే పుంసి సేవాసముత్థమ్.

ఉ. వేలుపుయేటఁ దోఁగి సుప ♦ విత్రఫలాదులఁ బూజసేసి ని
న్నోలి మనంబులో నిలిపి ♦ యోగ్యగుహాశిలయందు నాత్మసం
శీలుఁడనై ఫలాశి నయి ♦ శ్రీగురువాక్యరతుండనై మహీ
పాలకసేవనశ్రమముఁ ♦ బాసెద నెన్నఁడు మన్మథాంతకా. 88

దేవా! గంగాజలమున స్నానమాడి పవిత్రము లగుపుష్పములతోఁ బండ్లతో నిన్నుఁ బూజించి నిన్నే ధ్యానించుచు, పర్వతగుహాంతరమున నొకఱాతిపలకపై నాత్మారాముఁడనై యుండి పండ్లతో నాకలి నారణము కావించుచు గురువాక్యతత్పరుఁడనై నీయనుగ్రహమువలన నాబంటివాఁడే యగునొకనరుని సేవించి తెచ్చుకొన్న దుఃఖము నెన్నఁడు వదలించుకొందునోగదా మన్మథాంతకా.

ఏకాకీ నిస్పృహ శ్శాన్తః పాణిపాత్రో దిగమ్బరః,
కదా శమ్భో! భవిష్యామి కర్మనిర్మూలనక్షమః. 89

తే. ఒంటి దిరుగుచుఁ గోరిక ♦ లుజ్జగించి
శాంతిఁ జేకొని పాణిభా ♦ జనుఁడనై ది
గంబరుఁడనై సను స్తక ♦ ర్మంబు లెపుడు
మొదలుచెడఁ ద్రుంతుఁ బరమేశ! ♦ సదయహృదయ.

సదాశివా! ఒంటరిని, నిష్కాముఁడను, శాంతుఁడను, దిగంబరుఁడను, అఱచేత బిచ్చమెత్తువాఁడనునైయుండి పురాకృతకర్మమును నిర్మూలము చేయఁగలవాఁడ నెన్నఁటి కగుదునో!

పాణిం పాత్రయతాం నిసర్గశుచినా భైక్షేణ సంతుష్యతాం
యత్ర క్వాఽపి నిషీదతాం బహుతృణం విశ్వం ముహుః పశ్యతామ్,
అత్యాగేఽపి తనో రఖండపరమానందావబోధస్పృశా
మధ్వా కోఽపి శివప్రసాదసులభ స్సంపత్స్యతే యోగినామ్. 90

చ. హితునకుఁ బాణిపాత్రమున కిచ్చునకుం శుచిభైక్షమాత్రతో
హితునకు నెట్టిచోట వసియించెడువానికి విశ్వముం దృణ
ప్రతినిధిఁ జేయువానికిఁ బురస్థితుఁ డయ్యు నఖండసౌఖ్యసం
గతుఁ డగుయోగి కేర్పడు నొకానొకమార్గము శంభుసత్కృపన్.

చేతినే భిక్షాపాత్రముగాఁ జేసికొని స్వభావపవిత్రమగుభిక్షాన్నమాత్రతోఁ దృప్తిఁ జెందుచు నెక్కడనో యొక్కడఁ గూరుచుండి ప్రపంచమునెల్ల గడ్డిపరకసమానముగాఁ జూచుచు శరీరమును వీడకున్నను అఖండపరమానందానుభవభాగులై యోగులకు శివప్రసాదమున మోక్షమార్గము సిద్ధించును.

అవధూతచర్య.

కౌపీనం శతఖణ్డజర్జరతరం కన్థా పున స్తాదృశీ
నైశ్చిన్త్యం నిరపేక్షభైక్ష మశనం నిద్రా శ్మశానే వనే,
స్వాతంత్ర్యేణ నిరంకుశం విహరణం స్వాన్తం ప్రశాన్తం సదా
స్థైర్యం యోగమహోత్సవేఽపి చ యది త్రైలోక్యరాజ్యేన కిమ్?

శా. కౌపీనంబును జీర్ణకంథయు నపేక్షాశూన్యభైక్షంబుఁ జిం
తాపాయంబు వనశ్మశానముల నిద్రావాప్తి దుర్వారస
ద్వ్యాపారంబుఁ బ్రశాంతచిత్తమును యోగారూఢియుం గృత్తిసం
క్షేపంబుం గలదేని యోగికిఁ ద్రిలోకీప్రాభవం బేటికిన్. 91

నూఱుప్రేలికలయిన గోఁచియును, అంతటిదే బొంతయును, నిశ్చింతతయును, ఒకరియపేక్షలేని భిక్షాన్నమును, అడవిలో శ్మశానముననో నిద్రయును, స్వాతంత్ర్యములో నడ్డమాఁకలులేనివిహారమును, ఎప్పుడును ప్రసన్నమైనచిత్తమును, సమాధిసంధానమున స్థైర్యమును జేకూఱినచోఁ ద్రిలోకాధిపత్య మెందుకు?

బ్రహ్మాండమణ్డలీమాత్రం కిం లోభాయ మనస్వినః,
శఫరీస్ఫురితే నాబ్ధిః క్షుబ్ధో న ఖలు జాయతే. 92

క. మండలమాత్రం బగు బ్ర
హ్మాండము లోభకర మగునె యతిధీరునకుం



నిండుసముద్రము జలచర
తాండవగతిచే విలోడితము గాదు గదా!

ఒక యాఁడుమీను దుముకులాడినమాత్రమున సముద్రము కలఁగఁబాఱినట్లు బ్రహ్మాండమండలమెల్లను రానున్నను మనస్వి యగుయోగిచిత్తము లోభపడదు.

మాతర్లక్ష్మి! భజస్వ కంచిదపరం మత్కాంక్షిణీ మాస్మ భూ
ర్భోగేషు స్పృహయాలవ స్తవ వశే కా నిస్పృహాణా మపి,
సద్యస్స్యూతపలాశపత్రపుటికాపాత్రే పవిత్రీకృతై
ర్భిక్షావస్తుభి రేవ సంప్రతి వయం వృత్తిం సమీహామహే. 93

క. అమ్మా! లక్ష్మీ! నమస్కా
రమ్ములు గావించి నిన్నుఁ బ్రార్థించెద నా
నెమ్మదిలో విద్యారూ
పమ్మున నేలకొను ముఖ్యఫల మదియకదా.

అమ్మా! లక్ష్మీ! నమస్కారము నన్నుఁ గోరకుము మఱొకరి నాశించుము. భోగములఁ గోరువారు నీకు లోఁబడుదురు. కాని నిస్పృహులకు నీతోఁ బనియేమి? ఎప్పటికప్పుడు మోదుగాకు దొప్పలుగట్టుకొని తిరిపమెత్తి పవిత్రితములయిన భిక్షావస్తువులతో మేమిఁక జీవయాత్ర గడపఁదలఁచియున్నాము.

మహీ రమ్యా శయ్యా విపుల ముపధానం భుజలతా
వితానం చాకాశం వ్యజన మనుకూలోఽయ మనిలః,
స్ఫురద్దీప శ్చన్ద్రో విరతివనితాసఙ్గముదిత
స్సుఖీ శాన్త శ్శేతే ముని రతనుభూతి ర్నృప ఇవ. 94

చ. ధరణి విశాలతల్పము ముపధానము బాహువు నింగి చందువా
సురటులు గంధవాహములు శోభనదీపము చందురుండుగా
విగతివధూమణిం గలసి వేడుక మీఱ సుఖించి శాంతుఁడై
నిరుపమలీల యోగి శయనించు మహీపతిమౌళికైవడిన్.

భూమి రమ్యమయినసెజ్జ, కైదీవయే విరివిగలతలాడ. ఆకాశమే పెనుమేలుకట్టు. అనుకూలవాయువే వీవన. చంద్రుఁడే దివ్వె. ఈరీతిని ముక్తివనితతోఁ గలయుచు మెలయుచు నానందపడుచు ముని మహారాజువలె హాయి మెయిఁ బవళించును.

భిక్షాశీ జనమధ్యసఙ్గరహిత స్స్వాయత్తచేష్ట స్సదా
హానాదానవిరక్తమార్గనిరతః కశ్చి త్తపస్వీ స్థితః,
రథ్యాకీర్ణవిశీర్ణజీర్ణవసనై స్సంస్యూతకన్థాధరో

నిర్మానో నిరహఙ్కృతి శ్శమసుఖాభోగైకబద్ధస్పృహః. 95

శా. హానాదానవిరక్తమార్గనిరతుం ♦ డక్షయ్యభిక్షాశి స్వా
ధీనారంభుఁడు లోకసంగదురితా ♦ తీతస్వభావుండు ర
థ్యానిక్షిప్తవిశీర్ణవస్త్రకృతకం ♦ థాసీనుఁ డాత్మాక్షర
ధ్యానాసక్తుఁ డొకానొకండు విగతా ♦ హంకారుఁ డొప్పున్ భువిన్.

భిక్షాన్నభోజనుఁడై, జనుల నడుమనున్నను, వారిసంగతిలేక స్వేచ్ఛాప్రవర్తనగలిగి త్యజించుట గ్రహించుటయనునవి లేనిమార్గముననుండి త్రోవలోఁబడియుండిన చింపిగుడ్డప్రేలికలను బొంతఁగాఁ గూర్చుకొని యభిమానము అహంకారము లేనివాఁడై శాంత్యానందపారవశ్యమున నారూఢుఁడై యెవఁడో యోగీశ్వరుఁడొకఁడుండును.

చణ్డాలః కిమయం ద్విజాతి రథవా శూద్రోఽథ కిం తాపసః
కిం వా తత్త్వవివేకపేశలమతి ర్యోగీశ్వరః కోఽపి కిమ్,
ఇత్యుత్పన్నవికల్పజల్పముఖరై రాభాష్యమాణా జనై
ర్న క్రుద్ధాః పథి నైవ తుష్టమనసో యాన్తి స్వయం యోగినః. 96

ఉ. మాలఁడొ వీఁడు విప్రకుల ♦ మండనుఁడో మఱి శూద్రుఁడో తప
శ్శీలుఁడొ సిద్ధుఁడో యనుచుఁ ♦ జెంతలఁ జేరి వికల్పజల్పవా
చాలజనంబు లాడఁగ వె ♦ సం గుపితాత్ములు గారు సమ్మదో
ద్వేలురు గారు మిన్నక భు ♦ విన్ విహరింతురు యోగిపుంగవుల్.

వీఁడు మాలఁడా! లేక బ్రాహ్మణుఁడా! శూద్రుఁడా! తాపసుఁడా! తత్త్వవేత్తయగుయోగీశ్వరుఁడా! యని తన్నుఁజూచి పలువురు జనులు పలుతెఱంగులఁ జేయు భాషణమును వినుచుఁ గోపింపక సంతుష్టమనస్కుఁడై యోగి తనత్రోవనుదానేగును.

హింసాశూన్య మయత్నలభ్య మశనం ధాత్రా మరుత్కల్పితం
వ్యాళానాం పశవ స్తృణాఙ్కురభుజ స్సృష్టా స్స్థలీశాయినః,
సంసారార్ణవలఙ్ఘనక్షమధియాం వృత్తిః కృతా సా నృణాం
యా మన్వేషయతాం ప్రయాన్తి సతతం సర్వే సమాప్తిం గుణాః.

చ. చిలువల గాలిమేపరులఁ ♦ జేసి తృణాంకురభోజనంబు భూ
తలశయనంబు గోవులకుఁ ♦ దామరచూలి విధించెఁ దత్త్వపే
శలమతులైనవారలకు ♦ సన్నుతవృత్తి ఘటించె దానిచేఁ
దొలఁగు రజస్తమోజనిత ♦ దోషములెల్ల భజించువారికిన్. 97

బ్రహ్మదేవుఁడు హింసకావింప నక్కఱలేక యప్రయత్నముగాఁ జేకుఱునట్టి గాలిని సర్పములకాహారము గావించెను. పశువులకు నేలపడుకగను గరికపరక లాహారముగను గావించెను. సంసారసముద్రమును దాఁటఁజాలు బుద్ధియుండిన నరులకును



దగు నాహారము నాలాటిదానిఁ జేసియే యున్నాఁడు. ఆయాహారమును జేకొను వారికి రజస్తమోగుణజనితదోషములెల్ల నశించును.

గఙ్గాతీరే హిమగిరిశిలాబద్ధపద్మాసనస్య
బ్రహ్మధ్యానాభ్యసనవిధినా యోగనిద్రాం గతస్య,
కిం తై ర్భావ్యం మమ సుదివసై ర్యత్ర తే నిర్విశఙ్కాః
కణ్డూయన్తే జరఠహరిణా స్స్వాఙ్గ మఙ్గే మదీయే. 98

ఉ. శ్రీసురసింధుతీరమున ♦ శీతనగోపలసీమయందుఁ బ
ద్మాసనవర్తినై శివు ను ♦ పాస్తి యొనర్చుచు యోగనిద్రచే
భాసిలుచున్ననాతనువు ♦ పైఁ దమ మేనులతీఁట దీఱ న
త్రాసములై కురంగములు ♦ రాపులు సేయుట గల్గునే కదా.

గంగయొడ్డున మంచుకొండచఱియపైఁ బద్మాసనము వైచికొని నేను బ్రహ్మధ్యానాభ్యాసమున యోగనిద్రలో నుండఁగా జింకలు తమయొడలిదురద తీర్చుకొనుటకై నాదేహమును భయములేక రాచుకొనునట్టిసుదినములు కలుగునా ?

పాణిః పాత్రం పవిత్రం భ్రమణపరిగతం భైక్ష మక్షయ్య మన్నం
విస్తీర్ణం వస్త్ర మాశాదశక మచపలం తల్ప మస్వల్ప ముర్వీ,
యేషాం నిస్సఙ్గతాఙ్గీకరణపరిణతిస్స్వాన్తసన్తోషిణ స్తే
ధన్యా స్సన్న్యస్తదైన్యవ్యతికరనికరాః కర్మ నిర్మూలయన్తి. 99

ఉ. పాత్రము పాణిపంకజము ♦ భైక్షము భోజ్య మనల్పతల్ప మీ
ధాత్రి దిశాష్టకంబు పరి ♦ ధాన మగున్ భువి నేరి కాసుచా
రిత్రు లసంగతాగుణధు ♦ రీణులు రీణసుఖానుభూతికిం
బాత్రులు మోహపాశములఁ ♦ బాసి దహింతురు కర్మబీజమున్.

అఱచేయియే భిక్షాపాత్రముగాఁ దిరిపమెత్తి దొరకినయన్నమును భుజించి దిగంబరులై, నిస్సంగులై నట్టినేల శయనించుచు నుండుమహాత్ములు సంబంధములన్నిఁ బెడఁబాయుటచేఁ జిత్తము పరిపక్వముకాఁగాఁ గర్మమును నిర్మూలము చేయుదురు.

మాతర్మేదిని! తాత మారుత! సఖే తేజః! సుబన్ధో జల!
భ్రాత ర్వ్యోమ! నిబద్ధ ఏష భవతా మన్త్యః ప్రణామాఞ్జలిః,
యుష్మత్సఙ్గవశోపజాతసుకృతస్ఫారస్ఫురన్నిర్మల
జ్ఞానాపాస్తసమస్తమోహమహిమా లీయే పరబ్రహ్మణి. 100

ఇతి భర్తృహరియోగీన్ద్రవిరచితాయాం సుభాషితత్రిశత్యాం
వైరాగ్యశతకమ్ సంపూర్ణమ్.

మ. జననీ మేదిని! తాత మారుత! వయ♦స్యా వహ్నీ! చుట్టంబ జీ
వనమా! సోదర తారకాపథమ! భ♦వత్ప్రేమ సంధిల్ల మీ
కొనరింతుం బరమప్రణామము భవ♦ద్యోగస్ఫురత్పుణ్యసం
జనితజ్ఞాననిరస్తమోహతతి నై ♦ సద్బ్రహ్మముం బొందెదన్.

అమ్మా పృథ్వీ! నాయనా మారుత! మిత్రమా అగ్నీ! చుట్టమా నీరమా! అన్నా వ్యోమమా! మీకందఱకుఁ జేదోయి మోడ్చి యిదె తుది మ్రొక్కు కావించుచున్నాను. మీసాంగత్యమువలన నాకుఁ గలిగినపుణ్యమున నజ్ఞానమెల్ల నశించి యఖండజ్ఞాన ముదయించుటచేఁ బరబ్రహ్మమున లయమగుచున్నాను.

ఉ. కూడిక చెందికొన్న తమ♦కూరిమికీరము దెట్లు పల్కున
న్వేడుక చేయుచందమున ♦ నీవయఁ గాంచిన నాకవిత్వమే
జాడ వహించియున్నఁ గడు ♦ సమ్మదమే ఘటియించు నీకుఁ జె
ద్దాడపురీనివాస నిజ♦దాసశివంకర సోమశంకరా.

శా. తారామండల కుండలీశ్వర సుధా♦తారామరక్ష్మోజకాం
తా రామర్త్యగజాంబుజప్రభనకాం♦తారామ గౌరప్రభా
దారాలంకృతవామభాగ బుధసం♦దారాగ యోగీంద్రబృం
దారాధ్యాంఘ్రిసరోరుహద్వితయ వే♦దారామఖేలత్పికా.

క. సంతోషబాష్పవారిని, రంతరదృగ్జలజభర్తృ♦హరిసంయమిరా
ట్ఛాంతస్వాంతనిశాంతని, శాంతోజ్జ్వలబోధదీప♦శరవరచాపా.

మాలిని. ప్రణుతకుధరకన్యా♦ఫాల సాదృశ్యహేతు
ప్రణయభరశిరస్సం♦ప్రాపితాబ్జారిరేఖా
ప్రణవనళినపీఠో♦పాంతసాంతత్యసేవా
చణహరివిధిరామా ♦ చామరోద్వీజమానా.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుఁగు లక్ష్మణకవి రాజపౌత్ర తిమ్మనార్యపుత్ర వివిధవిద్వజ్జనవిధేయ లక్ష్మణకవినామధేయప్రణీతం బయినసుభాషితరత్నావళీకావ్యమునందు వైరాగ్యశతకం బనుతృతీయాశ్వాసము

భర్తృహరిసుభాషితము సంపూర్ణము.

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1923.

